





**మిల్క్‌మేడ్—ప్రశస్తమైన మీగడతో నిండిన పాలు, పంచదార, A,D విటమినులు కలిపి, ఎప్పుడూ తాజా, ఎంతో శుద్ధమైనది.**

నిరపాయకరము, శుద్ధము, ఎంతో సదుపాయము. కాఫీలో టీలో కమ్మదనాన్నిస్తుంది. తాజాయైన, సంపూర్ణమైన తియ్యటి పాల కొరకు ఒక భాగం నెస్‌లేవారి మిల్క్‌మేడ్ కండెన్స్‌డ్ మిల్క్‌లో రెండు భాగాల నీళ్ళు కలపండి. A,D విటమినుల భరితమైన మిల్క్‌మేడ్ సాధారణమైన పాలకన్న మంచిది. సరిగ్గా మీ శిశువుకు కావలసినది.

# మిల్క్‌మేడ్ రుచికి ఆరోగ్యానికి మంచిది

SIPM 5758

నెస్‌లేవారి ఉత్పాదనము

ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి.' ఆంధ్ర పత్రిక వార పత్రిక, మద్రాసు—1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥





# ఉత్తరాలు

## న్యూఢిల్లీ లేఖ

17—7—70 సంచికలో 'వాణి' గారు రాజమండ్రి నుంచి 5—7—70న ప్రచురితమైన నా లేఖపై వ్యాఖ్యానించడం హర్షించదగినది. మనసులో వున్నదాన్ని కుళ్ళబెట్టుకోకుండా వెళ్ళగక్కటమే మంచిది, సరియైనదిన్నీ. వారి లేఖపై నేను కొంత చర్చించదల్చాను.

విమర్శలెప్పుడూ వ్యక్తిగతంగా వుండాలి. తప్పు చేసిన వ్యక్తి జాతినే వేలెత్తి చూపి విమర్శించడం వల్ల అందున్న నిర్దోషుల హృదయవేదనల ఫలితం చాలా వికృతంగా వుంటుంది.

శ్రీకృష్ణగారి వ్యాసాన్ని ఆనాడు నేను విమర్శిస్తూ రాయడం నబబే. వారికి [వారికొక్కపోతే అనువాదకులకు] ముస్లింలపై వున్న కసికి తార్కాణంగా వారి 17—7—70 న్యూఢిల్లీ లేఖలోని ఒక చిన్న వాక్యం చాలు. అది "మేడమ్ గాంధి గారికి ప్రీతిపాత్రులయిన మరొకరు, శ్రీ షా నవాజఖాన్ గారు నేడు నెలకి మూడువేల రూపాయల జీతం సంపాదించుకుంటున్నారు—" అంతవరకు వ్యక్తిగత విమర్శ—బాగానే వుంది. ఇక తర్వాత — వారు ఒకప్పుడు 'కసాయి' వారిని ఎందరినో రయిల్వే కూలీలుగా చేర్పించారు" అని వ్రాశారు.

అలంకార యుక్తంగా ముస్లింలను 'కసాయి'గా మార్చి తమ హృదయంలో వున్నది బయల్పెట్టుకున్నారు. తెలుగులో కసాయి అన్న పదం ఆంగ్లంలో 'స్లాటర్స్'అని శ్రీ కృష్ణగారు రాసియుండవచ్చు. దీనినిబట్టి శ్రీ కృష్ణగారి కలంలో ముస్లింలపై యున్న కసి తేటతెల్లమవుతుంది.

శ్రీకృష్ణగారు మేడమ్‌గాంధి గారిని విమర్శిస్తూ ముస్లింలను ఫణంగా పెట్టుకోనక్కర్లేదు. వారి కలం పదునుకై ఐ. ఎ. యస్. పరీక్షల నిషేధాన్ని, ముస్లిం మర్యాద కుటుంబాలను రాళ్ళుగా మార్చి అరుగదీయనక్కర్లేదు.

మేడమ్ గాంధిగారు ముస్లిం వోట్లు సంపాదిస్తానికి ముస్లింలను వెనకేసుకుంటూ రావడం లేదు. భారత్ ముస్లింలకంటే హిందువులు తక్కువా? ఇది నిర్వివాదాంశం. మైనారిటీ వోట్లకై మెజారిటీ వోట్లను వదులుకునేంత వెర్రి ఆడకాదు శ్రీమతి గాంధి. ఉన్నదున్నట్లు వ్రాక్కుచ్చింది గనుకనే ఆమెపై జనసంఘం, ఆర్. యస్. ఎస్. సంస్థల కోపం.

మతకలహాలలో ఎక్కువ శాతం ముస్లింల వలననే జరిగినవని హోం మంత్రి చవాన్ చెప్పినట్లు వాణి గారు [రాజమండ్రి] వ్రాశారు. మరి శ్రీమతిగాంధితో పాటు, మరికొందరు అధినేతలు పై వాక్యానికి వ్యతిరేకంగా సంభాషించారే! వాటి సంగతేమిటి?—

దక్షిణ భారత్‌లో వున్న శాంతి, స్నేహ సుహృద్భావాలు ఉత్తర దేశంలో లోపించాయి. దానికి కారణం. విన్నజాతులని, మ్లేచ్ఛులని. నికృష్టంగా ముస్లింలను తరిమి కొట్టడమే!

అది వాణి గారు గ్రహించాలి.

అంతెందుకు 1964 లో జంషెడ్‌పూర్, రూర్కేలాలోను, దరిదాపుల్లోను జరిగిన మతకలహాల్లో ముస్లింలు నివసిస్తున్న పల్లెలకు పల్లెలు ఒకే రోజులో శవాల గుట్టలతో నిండి పోవడానికి కారకులెవ్వరు. ఈ నగ్నసత్యాన్ని ఉన్నదున్నట్లు ఏపత్రిక ప్రకటించింది? సమయంవచ్చింది కాబట్టి వ్రాస్తున్నాను. ఆ తరుణంలో అచ్చట రైల్వే యుద్యోగులు కొందరాంధ్రులు—కొన్ని ఆంధ్ర ముస్లిం కుటుంబాలను తమ యిండ్లలో పెట్టుకు రక్షించారు. కావాలంటే అక్కడ ఆ సమయంలో వున్న ఆంధ్ర కుటుంబాలను కనుక్కోండి. [ముస్లింలను రక్షించిన ఆంధ్ర సోదరులు పత్రికా ముఖంగా ఎలా వారిని రక్షించింది తెల్పిన—ముస్లింల నిర్దోషిత్వం బయల్పడుతుంది].

నిరపరాధిని చేసి ఒక వ్యక్తిపై చెయ్యి చేసుకొంటే అతనిలో సహనమెంతవరకుంటుంది? రెండు దెబ్బలు తిని మూడోసారి తిరగబడ్తాడు.

ఇక్కడ చర్చ ఎవరు ముందు ప్రారంభించారన్నది కాదు. ఎందుకిలా ఒకళ్ళపైనొకళ్ళు ద్వేషాన్ని పెంచుకుంటున్నారన్నది.

ఉత్తర భారత్‌లో ముస్లింల దుస్థితి ఇక్కడ వివరిస్తే చర్విత చర్వణమే అవుతుంది. కొన్నిచోట్ల ప్రాణాలరచేతిలో వుంచుకొని ఎప్పుడే వుపద్రవం ముంచు కొస్తుందోనని నిద్రపోతున్నారు.

ఇక యిలా ఈ వుత్తరాలను రాసుకొంటూ పోతే, దూషణలకు ఎక్కడ దారి తీస్తుందో నన్నభయం పుడ్తోంది.

రష్యాలో ముస్లింలకు సరియైన పరిరక్షణ లేదు, స్వాతంత్ర్యం అంతకంటే లేదు. పాకిస్తాన్ ప్రజకు లేని వ్యక్తిస్వాతంత్ర్యం వాక్స్వాతంత్ర్యం భారత్ ప్రజకున్నది. అందుకే — ఎన్నోరకాలుగా మతోన్మాదం తలెత్తినా, మ్లేచ్ఛజాతియని చులకనగా చూసినా భారత్‌ను వీడని ముస్లింల ప్రవృత్తి శంకించడం భావ్యం కాదు.

నాయకుల స్వప్రయోజనాలకై కొన్ని జాతుల విరికించి చెర్లాటాడటం ఆయా పార్టీలకు సిగ్గుచేటు.

ముస్లింగాని, హిందూగాని, మరే జాతీయుడు గాని ప్రభుత్వానికి ద్రోహం తలపెట్టే వానిని భారత్ ప్రజకు ద్రోహం తలపెట్టే వానిని వ్యక్తిగతంగా విమర్శించడం హర్షించదగినది.

తప్పులేమైనా యుంటే తెనుగు సోదరులు సోదరీమణులు నన్ను క్షమిస్తారని తెలుస్తాను.

యస్సే. నజీర్, [ఖర్గపూర్]

* జవాబు

శ్రీ శ్రీకృష్ణగారు 'బుచ్చర్స్' అన్న మాటవాడారు. శ్రీ నజీర్‌గారు సూచించిన 'స్లాటర్స్'ఆయన వాడి ఉండక పోవచ్చు—'స్లాటరర్స్' అని రాసి ఉండేవారు! నాకు తెలిసినంతవరకు శ్రీ కృష్ణ 'కసాయి' వారంటే మహమ్మదీయులని అర్థం రావాలని కోరుకున్నట్లు కనిపించదు. ['కసాయి' అనేమాట అరబ్బు భాషనుంచి తెలుగులోకి వచ్చిందని వినికిడి. అరబ్బుల కన్నా ముందటి నుంచి కూడా ఈ దేశంలో ఆ ఖాటకులు ఉండేవారని నా నమ్మకం!]— అనువాదకుడు.

● ● ●

# లిప్టన్ రూబీ డస్ట్

## డస్ట్ టీలలో చక్రవర్తి






లిప్టన్స్ అంటే మంచి టీ

ఒక పరిడేం లీడర్, 'ఆంధ్ర ప్రాంతానికి మూడు రేడియో, స్టేషన్స్ ఉన్నాయి. కాని తెలంగాణాకి ఒక్కటే ఉంది.... ఇక తెలంగాణా వారు ఎలా ముందుకి రాగలరు?'' అన్నారు. ఎందుకు రాలేరు? ఒకే రాష్ట్రంలో ఉన్న తెలుగువాళ్ళని [ఆంధ్రావాళ్ళని] కనీసం రాజధానిలో కూడా ఉండనివ్వక గెంటివేయాలంటున్నారుగా? మరి ముందుకి రాకపోవటం ఏమిటి ? ఆంధ్ర రాజధానిలో ఆంధ్రావాళ్ళు ఉండకూడదు! కాని కేరళీయులు, తమిళియన్స్ ఉండవచ్చును! ఎంత జాతీయతా భావం.

హైదరాబాద్‌ని, విజయవాడతో కాదు పోల్చుకోవలసింది. మద్రాస్‌తో పోల్చండి, బొంబాయితో పోల్చండి! ఆంధ్రాలో కరువులకు అవకాశం లేదు. ఎప్పుడూ సస్యశ్యామలంగా ఉంటుంది. 'అన్నపూర్ణ' అని పేరు ఉంది. దేశంలో అన్ని ప్రాంతాలకంటే హైదరాబాద్ మాత్రమే సంవత్సరంలో ఎక్కువ కాలం సమశీతోష్ణ స్థితిలో ఉంటుంది. చారిత్రాత్మకంగా హైదరాబాద్‌కి తక్కువ చరిత్రేమీ లేదు. మరి ఎందుకు అభివృద్ధి చెందలేదు. ఒక్కటే కారణం! అది ఆంధ్రాలో ఉంది గనుక, ఆంధ్రులు ఆరంభ శూరత్వం గలవారు మాత్రమే గనుక! మద్రాస్ రేడియో స్టేషన్, బొంబాయి స్టేషన్ దేశంలో ఎక్కడయినా వినవచ్చును. కాని మన హైదరాబాద్, విజయవాడలను వినగలమా? అంటే, లేం! అని చెప్పుకోటానికి సిగ్గుపడాలి! ఆంధ్ర సరిహద్దులు దాటితే తెలుగు మాటకి నీళ్ళు వదులుకోవాలి! బ్రదర్స్! ఎన్నయినా రాయండి, ఎంత అయినా అలజడి చేయండి, కాని వెనుకబడి ఉన్నది తెలంగాణా కాదు, దక్షిణాది రాష్ట్రాల్తో పోలిస్తే మొత్తం 'ఆంధ్రాప్రదేశ్'

# ఉత్తరాలు

వెనుకబడి ఉంది. తెలంగాణా గొడవల్లో జరిగిన ఉక్కు కర్మాగారాన్ని మూడు ముక్కలు చేసి, మూడో ముక్క 'ముష్టి'గా పడవేస్తే పోరాత్తిన ఆంధ్రుడు లేడు! ఇక ఆంధ్ర ప్రభుత్వం సరేసరి!

నెక్కంటి సూర్యనారాయణ, [జామ్‌నగర్] గుజరాత్.

## సీరియల్

జానకీలక్ష్మిగారి కలంనుండి వెలువడుతున్న 'ఆరాధన' సీరియల్ బాగుంది. ఇక పోతే 'అపరాజిత' నవల చాల బాగున్నది. 'రాధ' పాత్ర చాల రమ్యంగా చిత్రీకరించేరు.

రచయిత్రి విజయలక్ష్మిగారి క్రొత్త సీరియల్ 'అచరణలో అభ్యుదయం' మొదటిలోనే మా అందరికీ నచ్చింది. ప్రతీవారం పత్రిక పాఠకులను యీ విధంగానే నవ్విస్తూ ఉండాలని కోరుతూ—

కుంచం సుబ్బలక్ష్మి, కుంచం నాగమణి, పి. కృష్ణ [యలమంచిలి.]

* * *

'క్రితం వారం పత్రికలో మాధవిలత అరుణగార్ల లేఖను చూచి ఈ లేఖ రాయాలనుకున్నాను. రచయితలు ఎప్పుడు ఒకే స్టైలులో రాయాలని కోరు రాయరు కూడానూ, ముఖ్యంగా, యలమంచి జానకీలక్ష్మిగారు యింతకుముందు మంచి ఇతివృత్తములు గల కథలనే అందించారు. కథ రాయడమంటే మనమనుకున్నంత సులభం కాదు సుమండీ. విమర్శ అవసరమే నేను కాదనను. అంత మాత్రాన రచయిత్రి నా అభిమానులు అని చెప్పలేము. కాని జానకీలక్ష్మిగారి 'ఆరాధన' మాత్రం కథావస్తువు కొత్తదని అందులోను 'కళకు' సంబంధించినదని యింతకు పూర్వం నేను ఈలాంటి కథ ఆవిడ రచించింది చదవలేదని రూఢిగా చెప్పగలను. 'ఆరాధన' చాల బాగుంది. ఆదిలోనే మమ్ములను ఆకర్షించింది. ఇలానే కథ బిగువు సడలకుండా నడవాలని ఆశిస్తాను. రచయిత్రి జానకీలక్ష్మిగార్కి నా అభినందనలు. మాధవి లతగారు మాత్రం ఏకీభవించక పోయినా పర్వాలేదు.

రాధకృష్ణ రాణి [బెంగుళూరు.]

## కార్టూన్లు

ది.17—7—70 వారపత్రికలో ''జయదేవ్'' 'బాబు'గార్ల ''మొగుడూపెళ్ళాం'' కార్టూన్సు [ధర్మకాలి] చూడడం తటస్థించింది! కార్టూన్సు చాలా బాగున్నాయ్!...ఏమైనా మగవాళ్ళే చవట దద్దమ్మలా తీర్చిదిద్దటానికి—కార్టూన్ [ధ]కర్తలు వారికి వారేసాటి!!!

—టి. పీటర్‌సింగ్. [గుజరాం]

## శ్రీ లక్ష్మీ విజ్ఞాన పజిల్ నెం. 13 ఫలితములు

సీలు తీయబడిన కీ సొల్యూషను

| | | | |
|---|---|---|---|
| 15 | 29 | 26 | 16 |
| 21 | 24 | 23 | 18 |
| 22 | 19 | 20 | 25 |
| 28 | 14 | 17 | 27 |

విజేతలు:

డి. ఎస్. ప్రకాశ రావు,

ఏలూరు.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 21—8—'70
శ్రీసాధారణనామ సం॥ శ్రావణ మా॥ శుద్ధ పంచమి

సంపుటము : 63 సంచిక ; 49

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక


త దేశం మీద మీ అభియోగాన్ని ఆమోదిస్తున్నాం. మీ మీద మా అభియోగాన్ని ఆమోదించండి

చూడండి. అతనికి బలం వస్తున్నది
ప్రతిపక్షం
ప్రతిసంవత్సరం మూడువందలకోట్ల పన్నుల ఎగవేత
ప్రతిసంవత్సరం
నాలుగు
కోట్లు


ఎంత అసభ్యతగా ప్రవర్తిస్తున్నావ్? ఈ అమ్మాయి నాది
యస్.యస్.
సంఘటిత ప్రణాళిక

# వోట్లకోసం పాట్లు - రాజధాని చరిత్ర

'ఒక గుర్రం చాలు నా రాజ్యం నిలువు కొనటానికి?'' అంటారు షేక్స్పియర్ నాటకంలో ఒక పాత్ర. అది ఆ ఇంగ్లీషు కవి వాడిన మాటలు.

'ఒక వోటు చాలు నా రాజ్యం నిలుపుకొనటానికి' అనే నినాదం నేడు న్యూఢిల్లీలో వినిపిస్తూ ఉంటోంది. కొన్ని ఉదాహరణలు చెప్తాను.

అస్సాంలో రెండవ నూనె శుద్ధి కర్మాగారం పెట్టాలనే ఉద్యమం ఒక దానిని అక్కడివారు కొందరు లేవదీశారు. పెట్రోలియమ్ శాఖ మంత్రి డాక్టర్ త్రిగుణ్ సేన్‌కి అస్సాం సంగతి బాగా తెలుసు. ఎందరో అస్సాం మంత్రులకన్నా అస్సాం గురించి ఆయనకి ఎక్కువే తెలుసునేమో! ఏమయితేనేమి ఆయన పార్లమెంటులో మాట్లాడుతూ, తమకి అస్సాం ప్రజలపట్ల అపరిమితమయిన సానుభూతి ఉన్నప్పటికీ ఈ కోరికని తీర్చటం కష్టం అన్నారు. దీనికి కారణం, అస్సాంలో ముడి నూనె లేకపోవటమే అన్నారు. కాని, కొంతకాలం తర్వాత ప్రధాన మంత్రి మేడమ్ గాంధిగారు అలజడి చేసేవారిని సమాధానపరచటానికని అస్సాంలోని కర్మాగారం శక్తిని ఏడాదికి పది లక్షల టన్నులదాకా పెంచదలచినట్లు వెల్లడించారు. అప్పుడు ఆమె భారత దేశానికి ఆర్థిక మంత్రి కూడా.

బరవుని కర్మాగారాన్ని మయినం ఆధారంగా కలి ముడి నూనె శుద్ధి చెయ్యటానికి కట్టారు. ఇప్పుడు దాన్ని నల్పర్ కల ముడినూనె విశుద్ధీకరణానికి సరిపోయేట్లు మార్చాలి. అస్సాంలో అలజడి తగ్గిపోయిందికాని వోట్లు ఎటు పడ్తాయో చూడాలి.

## ఒక్కొక్కరికీ ఒకటి . . .

మేడమ్ ఇందిరాగాంధి ప్రభుత్వం నిలవటానికి శ్రీ డాంగేగారి కమ్యూనిస్టుపార్టీ ఎంత అవసరమో ద్రావిడ మున్నేట్ర కళగమ్ కూడా అంత అవసరం. తమిళనాడు ముఖ్యమంత్రి ప్రణాళికా సంఘం సమావేశంనుంచి 'వాకవుట్' చేశారు, ఉక్కు మిల్లు కోసం., మైసూరు ఇంకా 'శత్రు శిబిరం'లో ఉంది కాబట్టి ఆ రాష్ట్రానికి కొం 'తాయిలం' ఇవ్వవలసి వచ్చింది. దీని ఫలితం ఏమిటంటే అప్పటి ఆర్థిక మంత్రిగా కూడా ఉంటున్న మేడమ్ ఇందిరాగాంధి గారు తొణుకూ బెణుకూ లేకుండా మూడు రాష్ట్రాలకి మూడు ఉక్కు కర్మాగారాలు ఇస్తామని ప్రకటించారు.

పంత్ వంశానికి చెందిన పండిత కృష్ణకాంత్ పంత్‌గారు తమ పేరు ప్రతిష్ఠలు పెరగటానికి తమ ప్రకటన ఒకటి చేశారు—ప్రతి ఏడూ 10 లక్షల టన్నుల ఉక్కు తయారుచేసే కర్మాగారం ఒకటి నెలకొల్పటం జరుగుతుందని అన్నారు. ఈ ప్రకటనతో తమ అధికారం పెరుగుతుందని ఆయన ఆశ పడ్డారు.

'నేషనల్ కవున్సిల్ ఫార్ ఎప్లయిడ్ ఎకనామిక్ రిసర్చ్' అనే సంస్థ ఉంది. ఆ సంస్థ వారు ఉక్కు ఉత్పత్తిని గురించి పరిశోధన జరిపి పంత్ నిర్ణయానికి విరుద్ధంగా ఉండే సూచనలు చేశారు.

## డాంగె, ద్రా. ము. క.

ఇటీవలే కేంద్ర ప్రభుత్వంమీద విశ్వాసరహిత తీర్మానం ఒకటి వచ్చి పోయింది. అది వోడిపోవటానికి సాయపడ్డవారిలో శ్రీ డాంగేగారి కమ్యూనిస్టులు, ద్రావిడ మున్నేట్ర కళగంవారు ఉన్నారు. ఇరు తెగలవారూ దేశ భక్తులే. ద్రా. ము. క. భారతదేశం నుంచి తమిళనాడు విడిపోవాలనే పార్టీ—

కాంగ్రెసు చీలిక తర్వాత శ్రీమతి అరుణా అసఫాలీ మేడమ్ ఇందిరాగాంధికోసం ఒక వేదికని సృష్టించారు. విద్యావంతులయిన కూలీపనివారు, రిక్షావారు వీరందరితోబాటు కేంద్ర ప్రభుత్వోద్యోగులుకూడా ప్రధానమంత్రిని అభినందించటం ప్రారంభించారు. బాంకుల జాతీయం సోషలిజానికి ఎంత దోహదకారి అయినదో గ్రహించి మేడమ్ గాంధిగారిని అభినందించారు.

శ్రీమతి అసఫాలీ హిందూ—మహమ్మదీయ ఐక్యతకి ఒక చిహ్నం. ఆమె పుట్టినది బెంగాలీ హిందువుగా, ఆమె పెళ్లి చేసుకున్నది ఒక ముసల్మానుని. దీనికి తోడు ఆమె కమ్యూనిస్టు కూడా.

కొంతకాలంగా జనసంఘీయులు, కమ్యూనిస్టులు కేంద్రప్రభుత్వోద్యోగులని లోబరుచుకోవాలని ప్రయత్నిస్తున్నారు. ఈ కమ్యూనిస్టులతోటి నాయకుడు శ్రీ ఎస్. ఎమ్. బెనర్జీ ఎప్పుడు కేంద్ర ప్రభుత్వోద్యోగుల ఉద్యమాలలో ఎప్పుడూ ప్రముఖ పాత్రే వహిస్తూ ఉంటారు.

## వోటు అధికారం

మేడమ్ ఇందిరాగాంధిగారికి వోట్లు కావాలి. శ్రీమతి అసఫాలీకి ప్రభుత్వోద్యోగులమీద అధికారం కావాలి. మూడవ 'పే కమిషన్' అక్కరలేదని మేడమ్ గాంధి ప్రధాన మంత్రిత్వంకింద శ్రీయుతులు చవాన్, మొరార్జిదేశాయిలు నిర్ణయించారు. దీనికి మేడమ్ గాంధి బాధ్యత కూడా ఉంది. కాని, ఒకనాడు హఠాత్తుగా మూడవ పే కమిషన్ ఏర్పడబోతుందనే ప్రకటన వచ్చింది. దానికి 'నేనే కారకుడు'నని జనసంఘ సభ్యుడు శ్రీ ఎమ్. ఎల్. సోంధీ అన్నారు కాని శ్రీడాంగే 'అవసరాలని బట్టి వేతనాలు' అన్న నినాదాలు లేవదియ్యటంతో ఆయనదే పయి చెయ్యి అయింది—వోట్లు వేసేది ఆయనేకాని శ్రీ సోంధీ కాదుకదా!

## హిమాచల్‌ప్రదేశ్ కథ

ఈ వారం కొత్త రాష్ట్రం ఒకటి పుట్టింది. దీని వెనుక చాలా పెద్ద కథే ఉంది. ముఖ్యమంత్రి శ్రీ పార్మార్, మేడమ్ ఇందిరాగాంధి వీరిద్దరి కుటుంబాల మధ్యా ఎంతో కాలంగా స్నేహం ఉంది. ఫజలాలీ కమిషన్ సభ్యులు అందరూ బతికి లేరు. అయినా నిజం ఎప్పుడూ బయటపడి తీరాలి. ఫజలాలీసంఘం అధ్యక్షునితో కొందరు 'హిమాచల్ ప్రదేశ్' విడిగా ఉంటే ప్రధానమంత్రి నెహ్రూ కుమార్తె అయిన శ్రీమతి ఇందిరాగాంధికి సంతోషంగా ఉంటుంది అని చెప్పారు. అప్పటినుంచి హిమాచల్‌ప్రదేశ్ విడిగా ఉండిపోయింది. ఇప్పుడు అది రాష్ట్రం అయిపోయింది. పంజాబు ఇంతకిముందే చీలిపోయింది. భారతదేశంలో పరిపాలన సవ్యంగా లేని రాష్ట్రాలు ఏవంటే ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, పంజాబ్, హిమాచల్‌ప్రదేశ్, హర్యానా. చివరి మూడూ రాష్ట్రాలూ పరిహాస్య రాష్ట్రాలు.

ఇదంతా చూసిన ఢిల్లీవారు కొందరు తమకీ విడి రాష్ట్రం కావాలంటున్నారు. ఈ 'కొందరు' ఎవరు? ఉద్యోగాలని వేటాడేవారు, స్నేహాలని కోరేవారు......

ఢిల్లీకి రాష్ట్ర స్థాయి ఇస్తారా? ఇవ్వరు. ఎందుకంటే, ఇక్కడ జనసంఘం బలం ఎక్కువ.

రాజకీయాల మాట అలా ఉంచి న్యాయాన్యాయాలు చూస్తే అప్పుడూ రాష్ట్ర స్థాయి కూడదనే అనిపిస్తుంది.

## భారత రాజధాని

ఢిల్లీ భారతదేశం అంతటికీ రాజధాని. దాని కింద కొన్ని చుట్టుపక్కల గ్రామాలని చేర్చినంత మాత్రాన అది పెద్ద రాష్ట్రం అయిపోదు.

ఇది స్పష్టంగా అర్థం చేసుకున్న సర్దార్ పటేల్ ఢిల్లీకి రాష్ట్ర స్థాయి ఉండరాదన్నారు. ఆయన చనిపోయారు. ఆయన చేసినది ప్రతిదీ తప్పు అన్న సిద్ధాంతాన్ని అవలంబించిన పండిత నెహ్రూ ఢిల్లీ రాష్ట్రాన్ని సృష్టించారు.

అప్పట్లో ఢిల్లీకి చీఫ్‌కమీషనర్ శ్రీ శంకర్ ప్రసాద్. ఆయనకి కీర్తి కండూతి హెచ్చు. అప్పటి దేశీయాంగ వ్యవహారాలమంత్రి పండిత కట్జూ. ఆయనకి వాచాలత్వం హెచ్చు. ఢిల్లీ రాష్ట్రానికి సంబంధించిన పదవీ స్వీకారం ఒక పందిరి కింద జరిగింది. పండిత కట్జూ ఎంతో గంభీరంగా 'ఢిల్లీకి రిజర్వేషన్లు ఉంటాయి. అది 'ఏ' తరగతి రాష్ట్రం అవుతుంది.' అన్నారు.

## మాయం అయిన మంత్రి

కొంతకాలం అంతా సరదాగా గడిచింది. ఆ తర్వాత పేచీలు మొదలయ్యాయి. మంత్రులు వాగ్వివాదాలలో మునిగిపోయి దేనినీ జరగనిచ్చేవారు కారు. ఈ గొడవకంతా కారకులయిన పండిత నెహ్రూ ఒక నెల రోజులు విశ్వ ప్రయత్నాలు చేసి తమవల్ల వీలుకాదని సంస్కరణ ప్రయత్నాలు వదులుకున్నారు. ఒకనాడు ఉదయం, 'ఆరోగ్యశాఖామంత్రి డా.సుశీలా నయ్యర్ ఎక్కడికో వెళ్లారు, జాడ తెలియటం లేదు, అనే వార్త ఢిల్లీలో వినిపించింది. ఆమె కోసం ఎందరో వెతకటం ప్రారంభించారు. చివరికి వెతికి పట్టుకుని వెనక్కి తీసుకు వచ్చారు. ఆపయిన ఒక పెద్ద వింత జరిగింది. సభాపతిగా ఉంటున్న శ్రీ సింగ్ ముఖ్యమంత్రి అయ్యారు, ఆరోగ్యశాఖ మంత్రిగా ఉంటున్న డా. నయ్యర్ 'సభాపతి' అయ్యారు, ముఖ్యమంత్రిగా ఉంటున్న శ్రీ బ్రహ్మ ప్రకాష్ మామూలు మంత్రి అయ్యారు. శ్రీ బ్రహ్మ ప్రకాష్‌కి తమ బాధ్యతలు బాగా తెలుసు కాబట్టి ఈ చివరి గౌరవం జరిగి ఉండవచ్చు.

ఇంతలో శ్రీ నెహ్రూకి ఈ విషయం మీద ఆసక్తి పోయింది. ఢిల్లీ రాజకీయ వ్యవహారాలని పట్టించుకొనటం తగ్గించారు. ఇంచుమించు అందరూ రాష్ట్రపునర్నిర్మాణ సంఘంవారు ఢిల్లీ రాష్ట్రం ఉండరాదన్నారు. ఆ ప్రకారంగానే పంత్ వంశ స్థాపకులు పండిత గోవిందవల్లభ్ పంత్‌గారు ఢిల్లీ రాష్ట్రాన్ని రద్దుచేసి ఢిల్లీ మున్సిపల్ కార్పొరేషన్ అనే రాక్షస సృష్టి చేశారు. ఢిల్లీ నగరాన్ని, పరిసరాలని దీని కిందకి తీసుకు వచ్చారు. పాత మునిసిపల్ పరిపాలన సవ్యంగా నడిచి ఉంటే ఈ రాక్షస సృష్టి కూడా తగ్గేదే...

## లాలాజీ

పండిత పంత్ తర్వాత గుల్జారీలాల్ నందాగారు వచ్చారు. వారు అన్నిటిలోనూ ఎంతో విజయవంతంగా ఓడిపోతూ ఉంటారు. వారి ఆలోచన మట్టి కలిపిన నీరువలె సుస్పష్టంగా ఉంటుంది. అందువలనే వారు ఢిల్లీకి 'మూడు అంచెలు' కల పద్ధతిని ప్రవేశ పెట్టారు. దీనినే ఢిల్లీ మెట్రోపాలిటన్ కౌన్సిల్ అన్నారు. ఢిల్లీలో వివిధ మున్సిపాలిటీలు సవ్యంగా పని చెయ్యటానికి తగ్గ ఏర్పాటు చేసే బదులు ఆ ప్రాంతానికి అనవసరంగా రాష్ట్ర స్థాయి కల్పించారు..

ఇదంతా అవగాహన చేసుకున్న డా. ఎ. ఎస్. ఘా ఢిల్లీ మున్సిపల్ కార్పొరేషన్‌ని రద్దు చెయ్యాలని సూచించారు. ఇది సరయిన సూచన.

ఢిల్లీ రాష్ట్రానికి సంబంధించిన పేచీలు పోవాలంటే ఒకటే మార్గం— ఉత్తరప్రదేశ్, హర్యానాల నుంచి తీసుకున్న గ్రామాలని వాటికి తిరిగి ఇచ్చేసి పాత, కొత్త ఢిల్లీలో మంచి పురపరిపాలనని కల్పించటమే. ●

ముగ్గురు మూర్ఖులు

# అయిదో ఉపాయం




'లౌక్యంగా మాట్లాడడం అనేది మొదటినుంచీ రావాలి' అన్నాడు చిదంబరం.

'అవును. మధ్యను నేర్చుకొన్నట్లయితే, బావయ్యవలె దొరికిపోతారు' అన్నాడు చూడామణి.

'బావయ్య విషయం యేమిటి?' అని చంద్రరావు ప్రశ్నించగా, చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

ఒక జమీందారువద్ద బావయ్య అనే బంట్రోతు ఉండేవాడు. 'బావయ్య తెలివి తక్కువగా మాట్లాడతాడు' అని అతన్ని అందరూ హేళన చేసేవారు.

'అందరూ హేళన చేస్తుండడం వలన బావయ్యకు లౌక్యంగా మాట్లాడాలని బుద్ధి పుట్టింది. ఆ ఊళ్లోనే బావయ్య బంధువు వెంకయ్య అనే అతను ఉన్నాడు. 'వెంకయ్య చాలా లౌక్యంగా మాట్లాడతాడు' అని అందరూ అనేవారు. అందుచేత బావయ్య వెంకయ్య వద్దకు వెళ్లి 'లౌక్యంగా మాట్లాడే సూత్రాన్ని చెప్ప'మని కోరాడు.

'లౌక్యంగా మాట్లాడ్డానికి ఒక సూత్రం అంటూ యేమీ లేదు. సమయానికి అనుకూలంగా మాట్లాడుతుండాలి' అన్నాడు వెంకయ్య.

'అలాగ కాదు. లౌక్యంగా మాట్లాడడానికి మూలసూత్రం యేమిటో చెప్పాలి' అని బావయ్య పట్టు పట్టాడు.

బావయ్య వెంకయ్యకు బంధువు కాబట్టి బావయ్యకు వచ్చేలాగున సమాధానం చెప్పవలసిన అవసరం వెంకయ్యకు ఉంది. అందుచేత వెంకయ్య బావయ్యకు యిలాగ చెప్పాడు.

'లౌక్యంగా మాట్లాడడానికి కావలసిన మూలసూత్రం యేమిటి అంటే, యే విషయమూ ఖచ్చితంగా చెప్పకూడదు. ఏ విషయాన్నైనా తరువాత మనకు కావలసిన విధంగా మార్చుకోవడానికి వీలుగా ఉండేలాగున మొదటినుంచీ మాట్లాడాలి. ఉదాహరణకు ఫలానా రామయ్య మంచివాడా? చెడ్డవాడా? అని ప్రశ్నించారనుకో. రామయ్య మంచివాడు అని కాని చెడ్డవాడు అని కాని ఖచ్చితంగా చెప్పకూడదు. 'అంత మంచివాడూ కాదు అంత చెడ్డవాడూ కాదు' అని చెప్పాలి. అలాగ చెప్పినట్లయితే ఆ మాటను తరువాత మనకు కావలసిన విధంగా మార్చుకోవచ్చును.'

'హాఁ! ఇంతేనా? ఇటుపైని మన లౌక్యం చూసుకో.' అంటూ బావయ్య వెంకయ్య వద్దనుంచి బయల్దేరాడు.

మర్నాడు ఆ ఊళ్లోకి గుర్రాలు అమ్మకానికి వచ్చాయి. 'ఆ గుర్రాల సంగతి కనుక్కొని రమ్మ'నమని జమీందారు బావయ్యను పంపించాడు. బావయ్య గుర్రాల వద్దకు వెళ్లి తిరిగివచ్చాడు.

'గుర్రాలు భారీగా ఉన్నాయా? నాసిగా ఉన్నాయా?' అని ప్రశ్నించాడు జమీందారు.

'అంత భారీగానూ లేవండి. అంత నాసిగానూ లేవండి' అని సమాధానం యిచ్చాడు బావయ్య లౌక్యంగా మాట్లాడవలసిన సూత్రాన్ని గుర్తులో ఉంచుకొని.

'ధరలు గిరాకీగా ఉన్నాయా? చౌకగా ఉన్నాయా?'

'అంత గిరాకీగానూ లేవండి. అంత చౌకగానూ లేవండి.'

— 'అయితే యింతకూ అవి ఆడా మగా?'

'అంత ఆశా కావండి. అంతా మగా కావండి' అని సమాధానం యిచ్చాడు బాపయ్య.

బాపయ్య సమాధానం విని జమీందారుతోసహా అక్కడ ఉన్న అందరూ గొల్లుమని నవ్వారు. ఈ సమాధానంతో బాపయ్య లౌక్యం దొరకిపోయింది. అతని తెలివి తక్కువతనం బయట పడింది' అని చెప్పాడు చూడామణి.

'ఇటువంటి 'లౌక్యం' వల్లనే కదా సోమయ్య దెబ్బలు కూడా తిన్నాడు' అని చిదంబరం అన్నాడు.

'సోమయ్య కథ యేమిటి ?' అని చూడామణి ప్రశ్నించగా చిదంబరం చెప్పడం ప్రారంభించాడు.

ఒక ఊళ్లో భీమయ్య అనే రైతు ఉండేవాడు. అతను బాగా మాట్లాడతాడు, అని అందరూ అనుకొనేవారు. ఈ సంగతి పక్క ఊళ్లో ఉన్న సోమయ్య చెవిని పడింది. 'భీమయ్యలాగనే తనుకూడా బాగా మాట్లాడాలి' అని అనుకున్నాడు సోమయ్య.

'భీమయ్య మాట్లాడడంలోగల విధానం యేమిటో ? తెలుసుకోవాలి' అని సోమయ్య భీమయ్య ఊరు వెళ్లాడు. ఆ దినం ఆ ఊరి కరణంగారి తల్లి చనిపోయింది.

'కరణంగారి తల్లి చనిపోయిన వార్త భీమయ్యకు తెలిసింది. అప్పుడు భీమయ్య కూడా యేడవడం ప్రారంభించాడు.

కరణంగారి తల్లి చనిపోయిందంటే మా అందరకూ చాలా బాధగా ఉంది. ఆమె కేవలం కరణంగారికే కాదు. మా అందరకూ కూడా తల్లిలాగ ఉండేది' అని భీమయ్య యేడ్చాడు.

'భీమయ్య యేడ్పు విని ఊళ్లోవాళ్లు వచ్చి అతని వోదార్చారు. సోమయ్య దీనినంతా దూరంనుంచి చూశాడు. భీమయ్య బాగా మాట్లాడడంలోగల రహస్యం అంతా తెలిసిపోయిందని అనుకొన్నాడు సోమయ్య.

'సోమయ్య తిరిగి వాళ్ల ఊరు వచ్చాడు. రెండు రోజులు పోయిన తరువాత ఆ ఊరి మునసబుగారి భార్య నరసమ్మ చనిపోయింది. ఆ వార్త విని సోమయ్య యేడవడం ప్రారంభించాడు.

'నరసమ్మ చనిపోయిందంటే మా అందరికీ చాలా విచారంగా ఉంది. నరసమ్మ కేవలం మునసబుగారికే భార్య కాదు. మా అందరికీ కూడా భార్యలాగ ఉండేది ఊరందరికీ కూడా భార్యలాగ ఉండేది.' అంటూ సోమయ్య బిగ్గరగా యేడ్వడం ప్రారంభించాడు. భీమయ్యను వోదార్చినట్లుగా తననుకూడా వోదార్చడానికి జనం వస్తారని యెదురు చూశాడు సోమయ్య. సోమయ్య యేడుపు వార్త విని మునసబుగారి బంధువులు వచ్చి అతను యేడుపు మానే వరకూ కొట్టారు.' అని చిదంబరం సోమయ్య కథను చెప్పాడు.

'అవును తెలివిలేక పోవడంవలన సోమయ్య దెబ్బలు తిన్నాడు. తెలివిగా వెంటనే సమాధానం చెప్పడంవలన అడిదం సూరకవి ఒక కొంటెవానిని తిరిగి మాట్లాడకుండా చేయగల్గాడు' అన్నాడు చూడామణి.

'అడిదం సూరకవి తెలివి యేమిటి ?' అని చంద్రలావు ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'తాటాకుల మీద గంటంతో రాసే రోజులు అవి. ఆ రోజుల్లో కవులు చంకలో తాటాకులు పెట్టుకొని చేతిలో గంటం పట్టుకొని తిరుగుతుండేవారు.'

'ఒకనాడు అడిదం సూరకవి తాటాకులు గంటం లేకుండా ఒక వీధిలోనుంచి వెడుతున్నాడు. అప్పుడు ఒక కొంటెవాడు సూరకవికి యెదురుగా వచ్చి 'మీరు యెవరు? అని ప్రశ్నించాడు 'నేను అడిదం సూరకవిని' అని సూరకవి సమాధానం యిచ్చాడు.

'వోహో! కవులా? అయితే చంకనాకేది' అన్నాడు ఆ కొంటెవాడు.

'చంకనాకేది' అన్నమాటకు రెండు అర్థాలు వస్తాయి.'

ఆమాట విని సూరకవి యిలాగే అన్నాడు 'చంకనాకే చూశావా? చేతిలో గంటంకూడా చూశావా?'

'దీనితో ఆ కొంటెవాడు తిరిగి సమాధానం యివ్వలేక తలవంచుకొని వెళ్లిపోయాడు.'

'ఇలాగే సమయస్ఫూర్తి వలన ఒక ముసలమ్మ పోయిన బంగారపు గొలుసును తిరిగి సంపాదించ గలిగింది' అన్నాడు చూడామణి.

'ముసలమ్మ కథయేమిటి? అని చంద్రలావు ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'అరవైయేళ్ల ముసలమ్మ ఆరేళ్ల మనుమరాలు కలిసి ఒకప్పుడు ఒక దారిగుండా వెడుతున్నారు. అప్పుడు ఆ చుట్టుపక్కల జనం యెవరూ లేరు. ఆ సమయంలో మనుమరాలి మెడలో ఉన్న బంగారపు గొలుసును ఒక దొంగ తీసికొని పారిపోబోయాడు.

'మామ్మా! మామ్మా! దొంగ గొలుసు పట్టుకుపోతున్నాడు' అని మనుమరాలు కేకలు వేసింది.

అప్పుడు కొంచెం వెనుకను నడుస్తున్న ముసలమ్మ మనుమరాలితో గట్టిగా యిలా అంది. 'పోలే, పోనీలే, ఆదివారం సంతలో మళ్లీ నీకు గొలుసు కొంటానులే.'

'దొంగ ఆ మాటలను విన్నాడు. 'వోహో! ఇది గిల్టు గొలుసు కాబోలు'అని దొంగ అనుకొని ఆ గొలుసును అక్కడే పారవేసి వెళ్లిపోయాడు. ముసలమ్మ ఆ గొలుసును తీసి మనుమరాలికి యిచ్చింది.

'చూశావా? ఇక్కడ ముసలమ్మ కర్ర, కత్తి వగైరా యేమీ ఉపయోగించకుండానే దొంగ వద్దనుంచి తిరిగి గొలుసును సంపాదించగలిగింది. ఇటువంటి సమయస్ఫూర్తి చాలా కొద్దిమంది వద్దనే ఉంటుంది' అన్నాడు చూడామణి.

'దీనికి నువ్వు ఆ ముసలమ్మనే అంతగా పొగడనక్కరలేదు. ఈ రకం తెలివి మన ప్రభుత్వంవద్ద కూడా చాలా ఉంది' అన్నాడు చంద్రలావు.

'ఈ రకం తెలివి మన ప్రభుత్వంవద్ద కూడా ఉంది' అని నువ్వు యెలాగ చెప్పగలవు?' అని ప్రశ్నించాడు చూడామణి.

'1969 వ సంవత్సరం డిశంబరు 8 వ తేదీని లోక్‌సభలో జరిగిన చర్చలో కొన్ని విషయాలు బయటపడ్డాయి.

'సెంట్రల్ సైంటిఫిక్ యిన్‌స్ట్రుమెంట్సు ఆర్గనైజేషను అనబడే సంస్థ ఒకటి చండీఘర్‌లో ఉంది. టాంకులకు సంబంధించిన డిజైను పత్రాలు కొన్ని ఆ సంస్థకు పంపబడ్డాయి. ఆ పత్రాలను అక్కడ యెవరో దొంగిలించారు. ఈ విషయాన్ని ప్రతిపక్ష సభ్యులు లోక్‌సభలో ప్రశ్నించారు.

'పోయిన పత్రాలు రహస్యమైనవి కావు'

అని విదేశాంగమంత్రి వి. కె. ఆర్. వి. రావు సమాధానం యిచ్చాడు.

ఆ సందర్భంలో ప్రతిపక్ష సభ్యుడు పొంది కొన్ని వివరాలను వెల్లడించాడు.

'సైన్యానికి చెందిన ఒక బ్రిగేడియర్, ఒక కల్నలు ప్రత్యేకంగా విమానంలో ఢిల్లీ వెళ్లి సదరు పత్రాలను అక్కడ అప్పగించారు. ఆ పత్రాల యొక్క ప్రాముఖ్యాన్ని, రహస్యాన్ని ఈ సంఘటన తెలియజేస్తుంది' అని ఆయన అన్నాడు.

'అయినా మంత్రి మాత్రం ఆ పత్రాలు యెంతమాత్రం రహస్య పత్రాలు కావని ఉద్ఘాటించాడు.

'మాశావా మన ప్రభుత్వంయొక్క సమయస్ఫూర్తిని?' ఆ పత్రాలు రహస్య పత్రాలు' అని అంగీకరిస్తే దానిమీద పెద్ద రభస జరిగివుండేది 'ఆ పత్రాలు రహస్యపత్రాలు కావు' అని ప్రభుత్వం ప్రకటించడం వలన ఆ సమస్య వెంటనే తేలిపోయింది. ఇక్కడ మన ప్రభుత్వంయొక్క తెలివి నీవు చెప్పిన ముసలమ్మ తెలివికి తీసిపోతుందా?' అని తిరిగి ప్రశ్నించాడు చంద్రరావు.

'మన ప్రభుత్వానికి యిటువంటి విషయాల్లో తెలివికి లోపం ఏమీలేదు అయినా, నేను చెప్పిన ముసలమ్మ తెలివికి మన ప్రభుత్వంయొక్క తెలివికి ఒక ముఖ్యమైన తేడా ఉంది.

'అక్కడ ముసలమ్మ తన తెలివితో దొంగను మోసంచేసి, తన గొలుసును తిరిగి సంపాదించుకొంది.'

'ఇక్కడ ప్రభుత్వంయొక్క తెలివివలన పోయిన పత్రాలు తిరిగి దొరకలేదు. అంతే కాదు. పోయిన పత్రాలయొక్క ప్రాముఖ్యాన్ని తగ్గించడం ద్వారా ప్రభుత్వం యిక్కడ ప్రజలనే మోసం చేస్తున్నది. అదీ తేడా.

'సమస్యలను యీ విధంగా పరిష్కరించడంలో మన ప్రభుత్వానికి ప్రత్యేకమైన నేర్పు ఉంది. తాను కనిపెట్టిన అయిదో ఉపాయాన్ని ప్రయోగించి మన ప్రభుత్వం చాలా సమస్యలను పరిష్కరించింది' అన్నాడు చూడామణి.

'ఆ అయిదో ఉపాయం యేమిటి?' అని చిదంబరం ప్రశ్నించాడు.

# ముగ్గురుమూర్ఖులు

'సామ దాన భేద దండోపాయాలు' అని మన శాస్త్రాల్లో నాలుగు ఉపాయాలు ఉన్నాయి.

'మంచితనంవలన కార్యాన్ని సాధించడానికి 'సామం' అనిపేరు.

'డబ్బుయిచ్చి కార్యాన్ని సాధించుకొనడానికి 'దానం' అని పేరు.

'ఎదుటివారిలో చీలికలను కల్పించి తన కార్యాన్ని నెరవేర్చుకొనడానికి 'భేదం' అనిపేరు.

'బల ప్రయోగంవలన తన కార్యాన్ని నెరవేర్చుకొనడానికి 'దండం' అనిపేరు.

ఈ నాలుగు ఉపాయాలు కాకుండా ప్రభుత్వం అయిదో ఉపాయాన్ని కనిపెట్టింది. అదే కాలయాపన.

'ఏదైనా ఒక విషయాన్ని పరిష్కరించకుండా చాలా కాలాన్ని గడిపివేసినట్లయితే, ప్రజలు ఆ విషయాన్ని మరచిపోతారు. మనది ప్రజాప్రభుత్వం కాబట్టి ప్రజలు మరచిపోయిన విషయాన్నిగురించి ప్రభుత్వంకూడా పట్టించుకో నక్కరలేదు'

'ఈ అయిదో ఉపాయాన్ని ప్రయోగించే కాదా మన ప్రభుత్వం పాకిస్థాన్ మనదేశానికి యివ్వవలసిన కోట్లాది రూపాయల బాకీ విషయంలో ప్రజలను యేమార్చ గలిగింది' అన్నాడు చూడామణి.

'అవును మనదేశానికి పాకిస్థాన్ కోట్లాది రూపాయలను బాకీఉంది' అని యిదివరకుకూడా ఒకసారి నువ్వు చెప్పావు. అప్పుడు నాకు ఒక సందేహం కలిగింది. దేశవిభజన సమయంలో మనదేశమే పాకిస్థానుకు 55 కోట్ల రూపాయలు బాకీ ఉంది. మనదేశం ఆ డబ్బును పాకిస్థానుకు యివ్వకపోవడంవలన మహాత్మాగాంధి నిరశనవ్రతం చేశాడు. అప్పుడు మన ప్రభుత్వం ఆ డబ్బును పాకిస్థానుకు యిచ్చివేసింది. ఈ సంగతి అందరకూ జ్ఞాపకం ఉంది. మనదేశానికి పాకిస్థాన్ బాకీ ఉన్నట్లయితే, మనదేశమే పాకిస్థాన్‌కు యెందుకు డబ్బును యిచ్చింది? ఈ విషయాన్ని నువ్వు వివరించవలసిన అవసరం చాలా ఉంది.' అని చిదంబరం అనగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'దేశవిభజన సందర్భంలో భారతదేశానికి పాకిస్థానుకు మధ్య జరిగిన ఆర్థిక ఒడంబడికను 12-12-1947దీని భారత దేశపు ఉపప్రధానమంత్రి సర్దార్ పటేల్ రాజ్యాంగ సభలో వెల్లడించాడు.

నగ్దు నిల్వలు మిగిలిన ఆస్తులు భారత పాకిస్థానులు పంచుకోవడానికి తగిన సూత్రాలు అందులో వివరించబడ్డాయి.

దేశ విభజన సమయానికి అవిభక్త భారతదేశం చెల్లించవలసిన అప్పులనన్నిటినీ చెల్లించడానికి భారతదేశం అంగీకరించింది. అయితే యీ అప్పులో పాకిస్థాన్ వాటాను నిర్ణయించడానికి తగిన సూత్రాలు కూడా అందులో వివరించబడ్డాయి.

ఈ అప్పును పాకిస్థాన్ తీర్చవలసిన విధానం యీ విధంగా వివరించబడింది.

(1) సంవత్సరానికి ఒకసారి చొప్పున యాభై సంవత్సరాల్లో ఈబాకీని తీర్చాలి.

(2) ప్రతి సంవత్సరం ఆగస్టు 15 వ తేదీని ఆ సంవత్సరపు వాయిదా మొత్తాన్ని వడ్డీతోసహా చెల్లించాలి.

(3) దేశ విభజన జరిగిన తరువాత నాలుగు సంవత్సరాలు గడచిన పిమ్మట ఈబాకీని చెల్లించడం ప్రారంభం కావాలి.

'అవిభక్త భారతదేశం చెల్లించవలసిన అప్పులనన్నిటినీ దేశవిభజన తరువాత భారతదేశం చెల్లించింది. ఈ అప్పుల్లో తన వాటాను పాకిస్థాన్ భారతదేశానికి ముదరా యివ్వవలసి ఉంది. కాని యింతవరకూ పాకిస్థాన్ వద్దనుంచి మన ప్రభుత్వం ఒక్క పైసానుకూడా రాబట్టలేకపోయింది. పాకిస్థాన్ వంటి దేశమే ఈ మొత్తాన్ని యాభై సంవత్సరాల్లో తీర్చుకోవచ్చును అనే షరతు ఉంది కాబట్టి ఈమొత్తం కనీసం యాభైకోట్ల రూపాయలు ఉంటుంది.

25-5-1951 దీని భారత దేశపు ఆర్థిక మంత్రి అయిన గుళాం మహమ్మద్ న్యూఢిల్లీలో సమావేశం అయి భారత పాకిస్థాన్ ఆర్థిక వివాదాలను గురించి చర్చించారు కాని ఒప్పందం యేమీ కుదరలేదు.

'1959 వ సంవత్సరం జూలై 31—ఆగస్టు 2 తేదీల మధ్య భారతదేశపు

# అలసటా?
# గ్లాక్సోస్-డి
## మీకు శక్తి నిస్తుంది నిమిషాల్లో!



నేను రోజూ అలిసిపోయి
నప్పుడు గ్లాక్సోస్-డీ తీసుకుంటాను

ప్రతి రోజూ మీరు ఎందుకు అలిసి పోతారు?
శారీరకంగాను, మానసికంగాను,
శ్రమించినప్పుడు మీ శరీరంలోని గ్లూకోజ్
ఖర్చు అవుతుంది. దానిని తక్షణమే
పూరించుటకు గ్లాక్సోస్-డి సేవించండి.
పాలు, నీళ్లు, పళ్ల రసాలతోగాని,
పట్టిగానే గాని తీసుకో వచ్చు. కొద్ది
నిమిషాల్లో మీరు తాజాగా, చైతన్య
వంతంగా తయారవుతారు.

నేడే
అలిసినప్పుడు
తీసుకోండి
గ్లాక్సోస్-డి—
చప్పకలో
తక్షణ శక్తి నిచ్చే
ఆహారం

CA/GL/11 Tel

ఆర్థికమంత్రి అయిన మొరార్జీదేశాయి, పాకిస్థాను ఆర్థికమంత్రి సాయమ వ్యాఖ్యలతో సమావేశం అయ్యారు. దేశ విభజన సందర్భంలో భారతదేశానికి పాకిస్థాను యివ్వవలసిన బాకీ వగైరాలను గురించి చర్చించారు.

'నగదు బాకీ విషయంలో ఒక ఒప్పం దానికి రావడానికి యింకా కొన్ని వివరాలు కావాలని పాకిస్థాను ఆర్థికమంత్రి కోరాడు. 'వివరాలను కొన్ని సంవత్సరాలకు ముందు గానే భారతదేశం పాకిస్థానుకు యిచ్చింది' అని ఆర్థికమంత్రి మొరార్జీదేశాయి 6—8—1959 దీని లోక్ సభలో ప్రకటించాడు.

'ఈ బాకీనే భారతదేశం పాకిస్థాను నుంచి వసూలు చేయలేక పోయింది' అని నేను అంటున్నాను' అన్నాడు మూఢామణి.

'అయితే మహాత్మాగాంధి ఉపవాస సందర్భంలో మనదేశం పాకిస్థానుకు 55 కోట్ల రూపాయలను యెందుకు యిచ్చింది?' అని చిదంబరం ప్రశ్నించగా మూఢామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'దేశవిభజన సమయానికి ఉన్న రొక్కపు నిల్వ 400 కోట్ల రూపాయల్లో పాకిస్థానుకు 75 కోట్ల రూపాయల మినహా 20 కోట్ల రూపాయలను అప్పటికే చెల్లించివేయడమైనది. ఈ విషయం కూడా భారత పాకిస్థానులమధ్య జరిగిన ఆర్థిక ఒడంబడికలో ఉంది.

1—1—1948 దీని పాకిస్థాను విదేశాంగమంత్రి భారతదేశం పాకిస్థానుకు యివ్వవలసిన 55కోట్ల రూపాయలను వెంటనే చెల్లించకపోవడాన్ని నిరసించాడు.

8—1—1948 దీని పాకిస్థాను ఆర్థిక మంత్రి గులాం మహమ్మద్ 'భారతదేశం తాను చెల్లించవలసిన బాకీని నిలిపివేయడం ద్వారా పాకిస్థానుకు ఎదురు తిన్నున్నది' అని ప్రకటించాడు.

12—1—1948 దీని భారతదేశపు ఉపప్రధాన మంత్రి సర్దార్ పటేల్, ఆర్థికమంత్రి షణ్ముగంచెట్టి పాకిస్థాను వాదాన్ని ఖండించారు. కాశ్మీరు సమస్యతో సహా భారత పాకిస్థానుల మధ్య ఉన్న వివాదాలు అన్నీ పరిష్కారం అయి నప్పుడే ఆర్థిక ఒడంబడిక అమలులోనికి వస్తుంది, ఈ విషయాన్ని ఆర్థిక

# ముగ్గురుమూర్ఖులు

ఒడంబడిక జరిగిన సమయంలో పాకిస్థాను ప్రతినిధులకు స్పష్టంగా చెప్పడం జరిగింది భారత పాకిస్థానుల మధ్య పరిష్కారం కావలసిన సమస్యలు చాలా ఉన్నాయి కాబట్టి వెంటనే భారతదేశం పాకిస్థానుకు 55కోట్ల రూపాయలను యివ్వవలసిన అవసరం లేదు.

13—1—1948 దీని హిందూ ముస్లిం సుహృద్భావాన్ని కోరుతూ మహాత్మాగాంధి ఉపవాసం ప్రారంభించాడు

15—1—1948దీని ప్రధాన మంత్రి నెహ్రూ, 'భారత పాకిస్థానుల మధ్య యేర్పడిన ఉద్రిక్తతను తగ్గించడానికి, మహాత్మగాంధి ఉపవాస విరమణకు భారతదేశం తక్షణమే 55కోట్ల రూపాయలను పాకిస్థానుకు చెల్లించి వేస్తుంది' అని ప్రకటించాడు.

'భారత పాకిస్థానుల మధ్యనున్న సమస్యలు పూర్తిగా పరిష్కారం కానంతవరకు మనదేశం పాకిస్థానుకు ఆ 55 కోట్ల రూపాయలను యివ్వవలసిన అవసరం లేదు' అయినా మనదేశంయొక్క 'మంచి'తనాన్ని ప్రపంచానికి చాటడంకోసం, మహాత్మా



"ఏమండోయ్! మీారింటోలేరని ఎంత చెప్పినా ఈయన వినటంలేదూ—మీారైనావచ్చి చెప్పండి—అప్పుడైనా నమ్ముతాడేమో!"

గాంధి ఉపవాసవు ఒత్తిడివల్ల 55 కోట్ల రూపాయలను మనదేశం పాకిస్థానుకు చెల్లించివేసింది.'

'పాకిస్థాను భారతదేశానికి చెల్లించవలసిన మొత్తం నేను మీకు చెప్పిన 50 కోట్ల రూపాయలు మాత్రమే కాదు' అంటూ మూఢామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

18—12—1950దీని మంత్రి గోపాలస్వామి అయ్యంగార్ యిలాగ ప్రకటించాడు. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ కరాచీ బ్రాంచిలో ఉన్న రొక్కం రూ. 20,000,000 లను భారతదేశానికి అప్పగించడానికి పాకిస్థాను నిరాకరించింది. హైదరాబాద్ సంస్థానం భారతదేశంలో అంతర్భాగమని పాకిస్థాన్ గుర్తించకపోవడమే దీనికి కారణం.

6—8—1968దీని బాబూరావు పటేల్ వేసిన ప్రశ్నకు వాణిజ్యమంత్రి దినేష్‌సింగ్ లోక్‌సభలో ఈ విధంగా సమాధానం యిచ్చాడు.

'1965లో భారత పాకిస్థానుల మధ్య జరిగిన సంఘర్షణ సందర్భంలో పాకిస్థానులో ఉన్న భారతదేశపు ఆస్తులను పాకిస్థాను స్వాధీనం చేసికొన్నది. నాటి విలువ రూ. 1,01,26,32,797.

ఈ విధంగా మనదేశానికి రావలసిన కోట్లాది రూపాయల బాకీని మన ప్రభుత్వం పాకిస్థానునుంచి వసూలు చేయలేకపోయింది' అన్నాడు మూఢామణి.

'అవును మనదేశానికి పాకిస్థాను బాకీ ఉంది. కాని ఆ బాకీని పాకిస్థాను చెల్లించనప్పుడు మన ప్రభుత్వం యేమిటి చేయగలదు? అని ప్రశ్నించాడు చంద్రరావు.

'మనదేశం పాకిస్థానుతో యెన్నో ఒడంబడికలను చేసికొంది. కాని ప్రతి ఒడంబడిక వల్లనూ పాకిస్థానుకే యేదో ఒక లాభం కలిగింది. ఉదాహరణకు తాష్కెంటు ఒడంబడిక తీసికో! ఆ ఒడంబడికవల్లనూ, ముందుకు వెళ్ళిన మన సైన్యాలను వెనుకకు పిలిపించుకోవలసి వచ్చింది.'

'1960వ సంవత్సరం ఆగస్టు నెలలో భారత పాకిస్థానుదేశాలు సింధునదీతీర ప్రాంతాల అభివృద్ధిని గురించి

ఒక ఒడంబడికకు వచ్చాయి. తూర్పు నదులైన రావి, బియాస్, సట్లెజ్ నదులు ఇండియాకు వచ్చాయి. పశ్చిమ ప్రాంతపు నదులైన సింధు జీలం చెనాబ్ నదులు పాకిస్తానుకు వచ్చాయి. పాకిస్తాను వాటాకు వచ్చిన నదులమీద ఆనకట్టలు కట్టుకోవడానికి మనదేశం పాకిస్తానుకు సుమారు 80 కోట్ల రూపాయలు యివ్వవలసి వచ్చింది.'

ఇటువంటి ఒడంబడికలను చేసికొనేటప్పుడు, మన ప్రభుత్వం మనకు రావలసిన బాకీలను గురించి యెందుకు పట్టు పట్టలేదు?

'మనదేశం, పాకిస్తానుకూడా యెన్నో అంతర్జాతీయ సమావేశాల్లో పాల్గొంటున్నాయి. అటువంటి సమావేశాల్లో మన ప్రభుత్వం ఈ సమస్యను యెందుకు చర్చకు తీసికొనిరాలేదు?

'దేశానికి చెందిన రహస్యాలను యితరులకు చేరవెయ్యడం, రైళ్ళను పడగొట్టడం మాత్రమే దేశద్రోహం కాదు. దేశానికి రావలసిన కోట్లాది రూపాయల బాకీని వసూలు చేయడంలో ప్రభుత్వం నిర్లక్ష్యం వహించడం దేశద్రోహం కాదా ?

'ఇరవైమూడు సంవత్సరాలు గడచిపోయినా మనదేశానికి రావలసిన కోట్లాది రూపాయల బాకీలో ఒక్క పైసాను కూడా మన ప్రభుత్వం పాకిస్తాను వద్ద వసూలు చేయలేకపోయింది. ఇది మన ప్రభుత్వం యొక్క అసమర్థతను తెలియజెయ్యడం లేదా? ఇటువంటి అసమర్థులకు దేశాన్ని పరిపాలించే హక్కు ఉన్నదా ?'

'ఇతరదేశాలనుంచి రావలసిన బాకీలను వసూలు చేయలేకపోయిన ప్రభుత్వానికి, ప్రజలకు పొదుపును గురించి బోధించే అర్హత ఉన్నదా ?'

'ఈ విషయాలను గురించి ప్రజలు తీవ్రంగా ఆలోచించవలసి ఉన్నది' అన్నాడు చూడామణి.

'ఇప్పటికే చాలా ఆలస్యం అయింది' అంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●

## జోక్స్

ఒక నాటకం గురించి ఒక విమర్శకుని అభిప్రాయం: —'ఆ నాటకం ఛండాలంగా ఉంది అని నేననను— కాని ఒక సీనుకి తెరపడగానే నేను సిగరెట్టు కాల్చుకుందామని పరుగెత్తుకుని బయటకు వచ్చిన మాట నిజం; నేను సిగరెట్టు కాల్చను అన్న సంగతికూడా మర్చిపోయి!'

* * *

ఒకసారి ఒక కోటీశ్వరుడి కారులో పొరుగూరు వెళ్లడం తటస్థించింది నాకు. కారులో ఆయనా, నేనూ మాత్రం ఉన్నాము. ఆయన డ్రైవ్ చేస్తున్నారు. నేను ఆయన పక్కనే కూర్చున్నాను. రోడ్డు కొంచెం నిర్జనంగా ఉంది. కారు అరవై, డెబ్భై మైళ్ల వేగంతో దూసుకు పోతోంది.

ఇంతలో నేను యథాలాపంగా వెనక్కి చూసాను. బాక్‌సీట్‌మీద ఒక కళ్ళజోడు, చాలా ఖరీదైనది కనిపించింది. అది చేతిలోకి తీసుకొని చూసాను. అద్దాలు చాలా దళసరిగా ఉన్నాయి. నేను ఆయనకేసి చూసాను. ఆయన కళ్ళకు జోడుపెట్టుకునే గుర్తులున్నాయే గాని, జోడు లేదు. కారు అద్దంలోంచి కళ్ళు చిట్లించుకుని చూస్తూ ఇంకా స్పీడు హెచ్చించేస్తున్నారాయన !

నాకు గుండె ఆగిపోయినంత పనైంది. 'ఏమండి' ఈ కళ్ళజోడు మీదేనా ?' అన్నాను.

'హా నాదే ! అది లేకపోతే నా కసలు కళ్లే కనిపించవు. గుడ్డివాణ్ణి అయిపోయినట్టే' అంటూ నాకేసి తిరిగారు. అంత దగ్గరలో ఉన్న నేనే ఆయన కళ్ళకు సరిగా అనడం లేదన్నట్టు ఆయన చికిలించిన కళ్ళు తెలుపుతున్నాయి. నేను ఈ పరిణామానికి ఎంతో వణికిపోతూ 'మరి...మరి...'

ఆయన నా ఆందోళన, భయమూ, కంగారు కనిపెట్టి నట్టున్నారు. ఒకసారి పకపకా నవ్వేసి 'హో అదా ! అర్థమైంది. భయపడకోయ్ ! ఎప్పుడూ కళ్ళజోడు తగిలించుకోడం బోర్‌గా ఉంటుందని, ఈ కారు అద్దాలనే నా కళ్ళకు కావలసిన కొలతల్లో తయారు చేయించాను' అన్నారాయన.

* * *

మొదటిసారి బ్రాందీ రుచిచూసిన ఒక ఆవిడ :—'ఇది బ్రాందీయా ? గత రెండేళ్లనుంచీ మా ఆయన సేవిస్తున్న మందులాగానే ఉందే !'

* * *

మద్యపానం ఎంత చెడ్డదో నిరూపించడానికి ఒక మతగురువు ఒక సభలో, బల్లమీద ఒ గ్లాసులో నీరు, ఒ గ్లాసులో విస్కీ పోసి, నీళ్ల గ్లాసులో ఒక వానపాములాంటిదాన్ని వదిలారు. అది ఆ నీళ్లలో ఈదసాగింది. అప్పుడు దాన్ని తీసి విస్కీ గ్లాసులో వదిలారు. అది వెంటనే గిలగిలా తన్నుకుని చచ్చిపోయింది. ఒక్క నిముషం సేపు నిశ్శబ్దం తాండవం చేసింది ఆ సభలో. ఇంతలో ఒక వృద్ధురాలు లేచి 'చాలా బాగుందండీ. ఆ రెండో గ్లాసులోది ఏమిటోగాని ఓ రెండు సీసాలు నా కిప్పించండి. క్రిముల బాధతో చాలా సతమతమై పోతున్నాను' అంది.

—కె. యస్. రావు.




కదుపయినా మాన్పుకుని సినిమాలు చూస్తున్నట్టుగానే — పిల్లలయినా పెద్దలయినా ట్రాన్సిస్టర్లు సంపాదించుకుంటున్న రోజులివి!

'వినోదం' అన్నప్పుడు సినిమాల తర్వాత రేడియోని చెప్పక తప్పదు. (ఈ రేడియోనే ఆకాశవాణి అంటున్నారు!)

### ఓర్పుకి పరీక్ష...

తెలుగు కార్యక్రమం ప్రసారమవుతున్న రేడియో దగ్గర ఎవరూ పట్టుమని పది నిమిషాలు కూర్చోలేకపోతున్నారు. ఓర్పుని పరీక్షించే కార్యక్రమాలు ఎక్కువగా వుండటమే అందుకు కారణం.

సినిమాల్లో ఒక పాట వచ్చినప్పుడు సిగరెట్టు కాల్చుకోడానికి లేచిపోతున్నట్టుగానే ఆకాశవాణి కార్యక్రమాల్లో సినిమా పాటయిపోగానే — ఆ రేడియో ప్రచారం చేసే పొదుపు ఉద్యమాన్నే అక్షరాలా అమలు జరుపుతూ కరెంటు లేదా బ్యాటరీ ఆదా చేసుకుంటున్నారు ప్రజలు!

### తప్పనిసరి కార్యక్రమాలు

రేడియోలని పలికిస్తూ వుండమని ఆకాశవాణికి ప్రభుత్వం ఆదేశం. ఆకాశవాణి కొన్ని కార్యక్రమాలని ఏర్పరచాలి. తప్పదు. లెక్కలకోసం ఏవేవో ప్రోగ్రాములు తయారు చేస్తారు. ఆ ప్రోగ్రాములు 'నిలయ విద్వాంసుల' (అసలర్థంలో కాదు) ద్వారా ప్రసారమవుతూ వుంటాయి. ఇది పద్ధతి. కార్యక్రమాలకి లోటు లేదు కాని, వాటిలో జీవమూ సహజత్వమూ మాత్రమే లోపిస్తున్నాయి. ప్రేక్షకులు [illegible] తలు భయపడతారు. శ్రోతలు కార్యక్రమాలు వినమూ — అంటే అది రేడియో స్టేషన్ సౌండ్ ప్రూఫ్ గదుల్లోకి చొరబడదు!

### దురదృష్టవంతులు...

దేశం మొత్తంమీద అదృష్టవంతులైన శ్రోతలూ లేకపోలేదు. ఈ అదృష్టవంతులు తెలుగువారు మాత్రం కాదు.

తమిళ కార్యక్రమాలతో మన కార్యక్రమాలని పోల్చి చూస్తే చాలు మన ఆకాశవాణి ఎంత ఆశాజనకంగా పని చేస్తున్నదీ తెలిసిపోతుంది.

### రేడియోలు పాఠం పుస్తకాలా?

మనకున్న కేంద్రాలు రెండే రెండు హైదరాబాదు, విజయవాడ. అందులో ప్రసార సమయమంతా ప్రచారానికి పోగా ప్రజల అభిరుచికి మిగిలేది సున్నా. జనాన్ని మంచి మార్గంలో నడిపించాలని తాపత్రయ పడుతున్న ఆకాశవాణి ధ్యేయాన్ని మెచ్చుకోక పోతే ఎలా?

విద్యార్థులకి పాఠం పుస్తకాల్లా వుంటున్నాయి తప్పితే ఆకాశవాణి కార్యక్రమాలు జనాన్ని ఆకర్షించ లేకపోతున్నాయి. కార్యక్రమాలని ముచ్చటగా ఎలా ప్రసారం చెయ్యాలో తోటివారిని చూసయినా మనవారు నేర్చుకుంటే ఎంత బాగుండును?

### సినిమాపాటల సవతి తల్లి

సినిమా పాటలంటే అందరూ చెవి కోసుకుంటారు. కోసుకోని వారు శ్రీరంగనీతులు చెప్పేవాళ్ళు మాత్రమే! ఆంధ్ర ఆకాశవాణి సినిమా పాటలకి సవతి తల్లి. రేడియో తిప్పినప్పుడల్లా అరవపాటలొస్తాయి. మన ఆకాశవాణిది ఇంత చీప్ టేస్టు కాదు...!

### హిందీ భారతి

అందుకే వివిధ భారతికీ రేడియో సిలోన్‌కీ గిరాకీ పెరిగింది. వివిధ భారతి పేరుకు మాత్రమే. అది కేవలం హిందీ భారతి! (హిందీ జాతీయ భాష కావచ్చు!) అందులో తక్కిన భాషలకిచ్చినంత ప్రాధాన్యత కూడా తెలుక్కి ఇవ్వడం లేదు. ఒక్కోసారి ఒకటిన్నర పాటతోనే 'ఏ వివిధ్ భారతీ హై ఆకాశవాణీకా పంచరంగీ కార్యక్రమ్...' అంటూ మంగళం పాడేస్తున్నారు.

### పాడింది పాడరా...

మన కేంద్రాల నుంచి మారుమోగుతున్న దేమిటి? పాటల మంచి చెడ్డల మాట దేవుడెరుగు! ఈ పాటల కోసం కేటాయించిన ఆ కొన్ని నిముషాల్లోనే పాడింది పాడరా... అంటూ జనానికి సినిమా పాటల మీద వున్న మోజుని కాస్తా పూర్తిగా చంపేస్తున్నారు. మన ఆంధ్ర ఆకాశవాణి కంటే తెలుగువారి అభిరుచి సిలోన్ వారికి బాగా తెలుసు. అందుకు వారిని అభినందించి తీరాలి!

### ఆంధ్రుడు అల్ప సంతోషి

విజయవాడ, హైదరాబాదుల నుంచి కూడా వివిధ భారతిలో వ్యాపార ప్రకటనలు త్వరలో మొదలు పెడతారట. తెలుగు పాటలకి నోచుకోక పోయినా కనీసం తెలుగులో వ్యాపార ప్రకటనలన్నా విని సంతృప్తి పడవచ్చు. అంతే చాలు... ఆంధ్రుడు అల్ప సంతోషి! ●



# ఒక వారం విపరీతం

## ఫాలాక్షుడు

ఆగస్టు 1 నాడు, బొంబాయిలో, సోవియట్ దౌత్యవర్గంవారి కారు ఒకటి [అంకె సి. సి. 447, డ్రయివరు పేరు మాబ్యాని కోలాయి విచ్ట] విషన్‌దేవి లీలారామ్ మఖీజా అనే సింధి వృద్ధ వనితని ఢీకొని ఆమె చనిపోయిందిట. ఈ ప్రమాదం పెద్దర్ రోడ్డుమీద జరిగిందిట. సోవియట్ కారు అక్కడే నిలిపిఉన్న ఒక అంబాసిడర్ కారుకి కూడా ఢీకొన్నదిట.

'అతను [సోవియట్ అధికారి] ప్రేగ్ వీధిలో టాంకు నడుపుతున్నాడనుకున్నాడా ఏమిటి? అన్నారుట అటుపక్క నడిచివెడుతున్న వారిలో ఒకరు. ఈ వార్త 8—8—1970 కరెంట్ పత్రికలో పడింది...

## టీలో విషం!

రామనాథపురానికి చెందిన ఒక గ్రామ పంచాయితీ ఎన్నికలలో గెలిచిన ఆరుముగం అనే ఆయన్ను ఆనందర్షంగా వూరేగించారట. వూరేగింపయ్యాక ఆయన




యింటికి వెళ్ళి నిద్రపోయాడట. తెల్లవారి లేవలేదేమా అని చూస్తే చనిపోయి వున్నాడట. వూరేగింపు అనంతరం ఎవరో ఆయనకు టీ యిచ్చినట్టు, ఆ టీలో విషం కలపబడినట్టు పోలీసు పరిశోధనలో తేలిందట.

## స్వాతంత్ర్యానికి అడ్డుగోడ!

కామన్‌వెల్త్ ఆటలకు ఎడింబర్గ్ వచ్చిన యువతీయువకులకు అక్కడి అధికారులు వేరే వేరే వసతి భవనాలు యివ్వడమే గాక, ఆ రెండు భవనాల మధ్య వో పెద్ద గోడ, అదీ గాక, ఎనిమిది అడుగుల తీగ కంచె వేశారట. అంతటోనూ ఆగక, రక్షక భటులు కూడా ఆడవారి భవనం చుట్టూ కాపలా కాస్తున్నారట. వీటితో తమ స్వేచ్ఛ దెబ్బతిందని తమ బాధలు ఎదుటి భవనంతో చెప్పకోడానికో వవీన పద్ధతి కనిపెట్టారట యువకులు. సెక్సు పరీక్ష లిచ్చట యివ్వబడును అనీ, సెక్సు అప్పీలు— దయతో సహకరించండనీ విన్నపాలు చేస్తూ కేక లెడుతున్నారట. ఈ విన్నపాలు విన్న అటు భవనంలోని ఆడవారు "చాకులాంటి కుర్రాళ్ళకు సదవకాశ"మనీ, 'యుద్ధము కాదిదీ ప్రేమ..సెక్సు. యస్సు" అనీ అరుస్తున్నారట. అంతేగాక మగవారి మాటలు, అశ్లీలపు పలుకులు— అబ్బబ్బ నా నోటితో నే చెప్పలేనని రక్షణ అధికారుల్లో ఒకాయనన్నారట. ఈ రెండు భవనాలమధ్యా యువతీ యువకుల స్వాతంత్ర్యానికి, ఆనందానికి అడ్డుగా నిలిచిన ఆ గోడను కసిగా "బెర్లిను రెండో గోడ" అని తిడుతున్నారట పేరు —నాచురల్!

## అన్నకి విషం పెట్టిన తమ్ముడు

తనో వ్యాపారం చేయాలని నిశ్చయించుకుని, దానికి అవసరమైన డబ్బును వుమ్మడి స్థలం అమ్మి సేకరించాలని దామోదరన్ అనే అతను తీర్మానించుకున్నాడట. ఈ తీర్మానానికి అతని అన్న అర్జునన్ ఒప్పుకోక పోయేసరికి పాలలో విషం కలిపి, అవి అన్నగారి కిచ్చాడట. ఆ పాలు త్రాగిన అర్జునన్ వెంటనే చనిపోయాడట. ఈ దారుణం గుడియాత్తానికి చెందిన కోరప్పట్టరై అనే గ్రామంలో జరిగింది.

## నిద్రపోతూండగా కుటుంబం హత్య

గోహాటికి చెందిన ఒక వూళ్ళో, నిద్రపోతున్న వో కుటుంబానికి చెందిన నలుగురు వ్యక్తుల నెవరో దారుణంగా హత్య చేశారట. భార్యా, భర్తా, ఇద్దరు పిల్లలూ— మొత్తం యీ నలుగురి పీకలూ తెగ్గోసేశారట. ఆ యిల్లాలు నిండు చూలాలట కూడాను. ఈ దారుణానికి కర్త లెవరని పోలీసులు విచారిస్తున్నారు.

## బంగారంవంటి మట్టి!

మట్టిలో బంగారం వుందన్న సంగతి మనకు తెలిసినా, మన్నే బంగారమన్న సంగతంతగా తెలీదు. ఆంధ్రా [!] కు చెందిన హైదరాబాదు, కడప, కోడూరు, మార్కాపూరుల్లోనూ, రాజస్థాన్‌కి చెందిన కోటకూ ప్రాంతంలోనూ దొరికే ఒక రకం తెల్లటి బంకమన్నును విదేశాలవారు కొంద వెగబడి కొంటున్నారట. కువైట్, దుబాయ్, నైజీరియా దేశాలు యీ తెల్లమన్నును ఎంతైనా కొనడానికి సిద్ధంగా వున్నాయట. ఈ మన్నును శుభ్రంచేసి ఆనక ఎండపెట్టి, పొడరుగా చేసి ఎగుమతి చేస్తోందట మన దేశం. ఈ ఎగుమతివల్ల దేశానికియేడ 45 లక్షలవరకూ విదేశ ద్రవ్యం లభ్యమవుతోందట

## సన్యాసాశ్రమం కోరుతున్న జోహాన్స్‌బర్గ్ వనిత!

జోహాన్స్‌బర్గ్‌లో 31 ఏళ్ళ మిసెస్. కెలాయిజుడిత్‌పేన్ అనే ఆమె తన భర్తను 14 ఏళ్ళ వైవాహిక జీవితాన్ని, తత్ఫలితమైన ఇద్దరు పిల్లలని త్యజించి సన్యసించడానికి నిశ్చయించుకున్నట్టు కోర్టుకు తెలియజేసిందట. ఒక అయిదు వారాలపాటు తనో ఆశ్రమంలో వున్నట్టు, అక్కడే తన మద్యపానీయాన్నీ, మాంసాహారాన్నీ విసర్జించినట్టూ చెప్పి, తను పవిత్ర భారతదేశానికి వెళ్ళి సన్యాసం స్వీకరించనున్నట్టు ప్రకటించిందట. ఈ విషయం మీద అధికంగా మాట్లాడడానికి యిష్టపడక ఆమె, 'భర్తను కవన్నపిల్లల్ని వదలి సన్యాసులో కలిసిపోవడం వల్ల మంచి పని చేస్తున్నానని దేశానికి చెప్పకపోయినా, అది మంచి పని కాకపోయినా నా మనస్సుకు నచ్చిన పని అని మాత్రం చెప్పగలను." అన్నదట— టిన్‌ట్రూ.



# ఒకవారం విపరీతం




## టు విూలు :

పూనా వైద్యకళాశాలలో శస్త్రచికిత్స నిపుణుల బృందం వో 38 ఏళ్ళ వ్యక్తికి కిడ్నీ మార్పిడి చేసి ఆపరేషన్ జయప్రదంగా ముగించారట. ఈ కిడ్నీ అతని భార్యే దానం చేసిందట. మరామెనో! *సేవా గ్రామ్‌లోని గాంధి కుటీరంలో నుంచి మహాత్మా గాంధి వుపయోగించిన రెండు ఇత్తడి గ్లాసులు అంతర్ధానమై పోయాయట! ఎటులా! *కుటుంబపు గొడవను భరించలేక ఢిల్లీ సిలావ్‌పూర్‌కు చెందిన 30 ఏళ్ళ గజానంద్ అనే అతను విూద కిరసనాయిలు పోసుకు నిప్పంటించుకున్నాడట. సమయానికి వచ్చిన భార్య అతన్ని రక్షిస్తే, పోలీసులు వచ్చి అతన్ని ఆసుపత్రిలో చేర్చి ఆత్మహత్యా ప్రయత్న నేరం ఆరోపించారట— ఇంతా భార్య వల్లనే కదా, దేనికైనా భార్య అవసరం తప్పదు కదా! *నాయకన్ కొట్టై అనే గ్రామంలో నిద్రపోతున్న పళని గవుండర్ అనే లక్షాధికారిని ఎవరో కొడవలితో నరికి చంపివేశారట—అప్పులు తీసుకున్నవారా *ఢిల్లీలో జూలై 27 వ తేదీన కమల్ మార్కెట్టు పోలీసు పదకొండు మంది ఆడవారిని వ్యభిచారం చేస్తున్నందుకు, అరెస్టు చేసి, ఈ పదకొండు మంది తారుస్తున్నందుకు, జి. బి. రోడ్డులో ఒక వైశ్యా గృహం నడుపుతున్నందుకూ ఒకతన్ని కూడా అరెస్టు చేశారట. నాట్యం పేర వ్యభిచారాన్ని చేస్తున్న ఏడుగురు స్త్రీలను జి. బి. రోడ్డులో పోలీసు పట్టుకుందట. ఇది ఢిల్లీకి పరిపాటే కదా! *కోలారులో విడిది చేసిన సర్కసు కంపెనీ పెద్దపులులను చూడ్డానికి వెళ్ళిన కుర్రాళ్ళలో వో బుద్ధిమంతుడు ఊనప రిగెతో బోనులోని పెద్దపులితో వేళాకోళం ఆడాడట. దాంతో ఆ పులి ఎగిరి పంజా పెట్టి అతన్ని కన్ను ఎగిరేలా కొట్టిందట.

## వరద భీభత్సం

బదరీనాథ్ యాత్ర పూర్తిచేసుకుని భక్తులంతా 25 బస్సులలో తిరిగి వస్తున్నారట. వారు బెలాకూచీ— ఛామోలీ అనే వూళ్ళ మధ్యనుండగా వున్నట్టుండి అలకనందానది పొంగి, ఆ వరదల్లో సుమారు అయిదు వందల మంది ప్రయాణికులు కొట్టుకుపోయారట. ఈవరద ప్రమాదాన్ని ముందేపసిగట్టి, ప్రయాణికులను ఎత్తయిన ప్రదేశాలకు వెళ్ళిపొమ్మని హెచ్చరిక చేసినా, వారు దాని వుధృతం తెలీక బస్సుల్లోనే కొంతమంది, బస్సుల విూద కొంతమందీ వుండిపోయారట. కాని విచిత్ర మేమిటంటే అన్ని బస్సుల డ్రయివర్లు, కండక్టర మాత్రం ప్రాణాలతో బయటపడ్డారట.

* * *

అహ్మదాబాదు మున్సిపల్ కార్పొరేషన్‌కు చెందిన ఒక హాస్పిటలు డాక్టరు స్టీఫెన్‌వార్డ్ తన హాస్పిటల్లోని ముగ్గురు నర్సులను తనింటికో పార్టీకి 19 వ తేదీన పిలిచి, వారిని బలవంతంచేసి, వారిచే త్రాగించి, అంతతో ఆగక, వారిని ఆయన, ఆయన స్నేహితులూ కలిసి డ్యాన్సు— స్ట్రిప్టీజ [వంటివిూద ఒక్కొక్క బట్టా విప్పేస్తూ చేసే నృత్యం— చివరికి నగ్నంగా అవుతారు] డ్యాన్సు చేయమని నిర్బంధించారట. అదే హాస్పిటలులో తన రోగిష్టి తల్లిని చూసి, వెళుతున్న వో వయస్సుపిల్లను ఆ హాస్పిటలు లిఫ్టు నడిపే వ్యక్తి చెరచాడట.

* * *

మాదయ్య అనే వో ఎలక్ట్రిసిటీ కార్మికుడు బెంగుళూరు శేషాద్రి పురంలో వోలాంతరు స్తంభం ఎక్కి దాన్ని రిపేరు చేస్తుండగా, కరెంటు షాకు తగలి, అంతెత్తునుంచి పడి, అక్కడికక్కడే చచ్చిపోయాడట. ●



# నేను విద్యార్థి కాను

(వల్లూరి విజయకుమార్

'నెక్స్ట్'

ఉలిక్కిపడ్డాడు సుధాకర్. పక్కకి చూసాడు. అతని పక్కనున్న కుర్రాడు లోపలికి వెళ్ళాడు. అతని తర్వాతి వంతు తనదే. పక్కన పెట్టిన ఫైలు చేతి లోకి తీసుకున్నాడు సుధాకర్. ఆ ఫయిల్లో అతని డిగ్రీ కాయితం, మరెన్నో సర్టిఫికెట్లు వున్నాయి. గర్వంగా ఫీలయ్యాడు సుధాకర్ వాటివైపు చూస్తూ.

లోపలనుంచి నవ్వులు వినిపిస్తున్నాయి.

మరో ఐదు నిముషాల్లో తననీ పిలుస్తారు. వాళ్ళడిగిన ప్రశ్నలకి సరిగ్గా సమాధానం యివ్వాలి. తడబడకూడదు. నిశ్చయించుకున్నాడు సుధాకర్. గది ముందు కూర్చున్న ప్యూన్ సుధాకర్ని తదేకంగా చూస్తున్నాడు.

సుధాకర్ యిదేం పట్టించుకోనట్లు యిటూ అటూ దిక్కులు చూస్తున్నాడు. అతని తర్వాత యింకా పదిమంది దాకా వున్నారు. అందరూ యిటో అటో సుధాకర్ వయసువాళ్ళే. వయసువాళ్ళే అనే కన్నా లాంటివాళ్ళే అంటే బావుంటుంది. ఎందుకంటే అందరూ ఉద్యోగాన్వేషణ కోసం ప్రయత్నిస్తున్నవాళ్ళే.

సుధాకర్ బి. యస్. సి. పాసయాడు. ఇందులో యేమాత్రం ఆశ్చర్యం లేదు. ఎందుకంటే ప్రతి యేడాదీ చాలామంది పాసవుతూనే వుంటారు. డిగ్రీ పుచ్చుకుని రెండునెలలు కూడా కాలేదు. మెడికల్ రెప్రిసెన్‌టెటివ్స్ కావాలని పత్రికలో ప్రకటిస్తే సుధాకర్ ఎప్లయ్ చేసాడు. ఇంటర్వ్యూకి రమ్మని పిలిచారు.

సుధాకర్ స్ఫురద్రూపి. నల్లటి మీసాలు అతని ముఖానికి అందం తెస్తుంటాయి. సుధాకర్‌కి అతని పర్సనలిటీ మీద చాలా నమ్మకం!

దూరంగా యేదో కలకలం వినిపించింది. మరికొన్ని క్షణాల్లో కలకలం మరింత యెక్కువయింది. నాల్గయిదు పోలీస్‌వాన్‌లు రంయ్‌మంటూ దూసుకు వెళ్ళాయి. వాటిలోంచి పోలీసులుబిలబిలాడుతూ దిగుతున్నారు.

సుధాకర్ యెదురుగా వున్న కిటికీ లోంచి చూసాడు. అదొక విద్యార్థుల బృందం, గట్టిగా కేకలువేస్తూ రోడ్డంతా ఆక్రమించేసి నడుస్తున్నారు. వాళ్ళ మధ్య నల్లజెండాలు యెగురుతున్నాయి.

'డౌన్‌విత్ ప్రిన్సిపాల్! ప్రిన్సిపాల్ మారాలి!' గట్టిగా గుక్క తిప్పుకోకుండా అరుస్తున్నారు. పోలీసులు ఆ గుంపుని అదుపులో పెట్టటానికి చాలా ప్రయత్నిస్తున్నారు. అందరికన్న ముందు నడుస్తున్న బుర్రమీసాలవ్యక్తి సుధాకర్ని ఆకర్షించాడు. అతనే ఆయేటి స్టూడెంట్ లీడర్. చెబితేకానీ అతనూ వో విద్యార్థని తెలీదు యెవరికీ. సినిమాలో విలన్‌లా వున్నాడు.

'అరే, వీళ్ళు నేను చదివిన కాలేజి స్టూడెంట్లే సుమా!' విద్యార్థి నాయకుడిని గుర్తుపట్టాడు సుధాకర్.

మరోక్షణంలో అతనిలో బాధలాంటిది ప్రవేశించింది. ఈ యేడాది నేనూ కాలేజిలో చేరివుంటే యిలాగే వీళ్ళతో చేరి సరదాపాటికి హాయిగా తిరుగుతూ వుండేవాడిని కదా! అనుకున్నాడు.

విద్యార్థి జీవితం యెంత ఆనందమయిందో! అందరూ విద్యార్థులకి అదో రకమయిన గౌరవం యిస్తారు, ఇంట్లో పెద్దవాళ్ళు తప్ప! కిందటిసారి తను సమ్మెలో పాల్గొన్నప్పుడు చూళ్ళేదూ, ప్రజలంతా యెలా భయపడ్డారో! సినిమా హాళ్ళలో తమకి టికెట్ లేదని యెవరయినా చెప్పడమే! గవర్నమెంట్ కాలేజీ స్టూడెంట్‌ని అని చెప్పడం తరవాయి, హవుస్‌ఫుల్ అయినా కుర్చీలు వేసి కూర్చోపెట్టేవారు. మరి స్టూడెంట్స్ అంటే మజాకావా! విప్లవాలు లేవదియ్యరూ!

'ప్రిన్సిపాల్ డవున్ డవున్'

# నేను విద్యార్థి కాను

అరుస్తున్నారు గుంపులోంచి. సుధాకర్‌కి ఆనందంగా వుంది. అసలు లేచి ఆ గుంపు వైపు పరిగెత్తాలనే వుంది. కష్టంమీద కోర్కెని అణచుకున్నాడు. తనిప్పుడొక గ్రాడ్యుయేట్.

అయినా ఆ ప్రిన్సిపాల్‌కి కావల్సిందే. అసలు యెవ్వరినీ లెక్కచెయ్యడే! సెలక్షన్లలో యెంత కఠినంగా వుంటాడో. సెలక్షన్సవుతూంటే స్వయంగా సూపర్ వైజ్ చేస్తాడు. పబ్లిక్ పరీక్షలో తన కాలేజివాళ్లనే యిద్దరు ముగ్గురిని కాపీ చేస్తూంటే పట్టుకున్నాడు. అసలు అతనికి జాలి, దయ, లేనే లేవు. తన కాలేజి వాళ్లేకదా కాపీ చేస్తున్నది. వదిలేస్తే యేం?

సుధాకర్ యిలా ఆలోచిస్తూండగా 'నెక్స్ట్' అన్న పిలుపు వినిపించింది. ఉలిక్కిపడి ఫైలు పట్టుకుని గదిలోకి నడిచాడు గబగబా.

గదిలో వో పెద్ద బల్లముందు ముగ్గురు కూర్చున్నారు. యెదురుగా కుర్చీ ఖాళీగా వుంది. 'గుడ్‌మార్నింగ్' సుధాకర్ విష్ చేసాడు. కంఠం కొద్దిగా వణికినట్లు అనుమానం వేసింది సుధాకర్‌కి. వణికే చేతులని బలవంతాన అదుపులో పెట్టుకున్నాడు.

'కూర్చోండి' ఒకతను కుర్చీ చూపించాడు.

'ఫర్లేదు. అండీ అంటున్నారు.' తృప్తిపడ్డాడు సుధాకర్. కూర్చున్నాడు.

కానీ తను అనుకున్నట్టుగా వాళ్లేం ప్రశ్నించలేదు. అందరికన్న ముందు ఒకతను 'మీ సర్టిఫికెట్లు?' అన్నాడు సుధాకర్ ఫైలు చూపుతూ.

'అవునండీ'

'ఇలా యివ్వండి.' అతను ఫైలందుకుని తెరిచాడు.

రెండో అతను కిటికీలోంచి చూస్తున్నాడు.

'డౌన్‌విత్ ప్రిన్సిపాల్' అరుపులు గదిలోకే వినిపిస్తున్నాయి. సుధాకర్‌కి కేకలు వింటూంటే అదోలాంటి భయం కలిగింది. 'మును పెన్నడూ లేనిదీ యెందుకీ జంకునాలో?' ప్రశ్నించుకున్నాడు. జవాబు రాలేదు. ఏమన్నా అడుగుతారేమో అని మనసులోనే యెదురు చూస్తున్నాడు. తను చదివిన కెమిస్ట్రీ అంతా యీ క్షణంలో జ్ఞాపకం తెచ్చుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. చదివిన కెమిస్ట్రీ అంతా అతనికిప్పుడొక మిస్టరీగా మారింది.

అంతవరకు కిటికీలోంచి బయటకి చూస్తున్న అతను సుధాకర్ వైపు తిరిగాడు. 'మీ విద్యార్థులు' అన్నాడు నవ్వుతూ.

సుధాకర్‌కి నవ్వాలో మానాలో తెలీలేదు. బిర్రబిగుసుకు కూర్చున్నాడు.

'మిస్టర్ రావ్, చూసావా, యీ విద్యార్థిలోకం నాశనం అయిపోతున్నది' కుర్చీలో జారబడి విచిత్రంగా నవ్వాడు అతను. రావ్ అనబడే వ్యక్తి నవ్వుతో శ్రుతి కలిపాడు.

'వాళ్ల హక్కులకోసం పోరాడుతూంటే మధ్య వీళ్లకెందుకో?' సుధాకర్‌కి కోపం వచ్చింది. కానీ కష్టంమీద అణచుకున్నాడు. వీళ్లు చదువుకునేప్పుడు యింత స్వేచ్ఛ వుండేదికాదు. అవును, అందుకే యీ యీర్ష్య,' సరి చెప్పుకున్నాడు సుధాకర్.

సుధాకర్ యిచ్చిన ఫైలు చూస్తున్న లావుపాటాయన ఫైలు మూసి సుధాకర్ ముందుకి తోసాడు. 'అయితే మీరింతకీ గవర్నమెంట్ కాలేజి విద్యార్థన్నమాట' అన్నాడు.

సుధాకర్ తలూపాడు.

'వీళ్లా మీవాళ్లే అనుకుంటాను?' అంతవరకు యేం మాట్లాడని మూడో అతడు అడిగాడు కిటికీలోంచి చూపిస్తూ.

'అవును' సుధాకర్ నోట్లోంచి అతి కష్టంమీద వెలువడ్డాయీ మాటలు. ఎందుకో అతనికి నిజం వొప్పుకోవాలంటే బెదురుగావుంది.

'డౌన్‌విత్ ప్రిన్సిపాల్!' మొదటతను మెల్లగా గొణిగాడు.

'ఏం విద్యార్థులో! యింతకీ ప్రిన్సిపాల్ యెందుకు డవునవాలిట?' తమాషాగా అడిగాడు రెండో ఆయన సుధాకర్‌ని ఉద్దేశించి.

'తెలీదండీ' నూతిలోంచి వచ్చినట్టుందీ పారి జవాబు.

'ఏం, మీ ప్రిన్సిపాల్ మంచివాడు కాదా?'

'లేదు లేదు. మంచివాడే!' సుధాకర్‌ని ఈ జవాబు చాలా ఆశ్చర్యం కలిగించింది. యెంతలో యెంత మార్పు.

'ఈ రోజుల్లో స్టూడెంట్ కమ్యూనిటీ యెలా తయారయిందంటే...' అందుకున్నాడు ముగ్గురిలో వొకతను.

సుధాకర్‌కి ఆ మాటలు వినాలంటే



శాంతి...గాంధీగారు ప్రారంభించిన సత్యాగ్రహం, ...' రాజకీయంలోకి దిగబోయాడొకడు.

'హాల్లోబోయ్, కోతికి కొబ్బరికాయ దొరికితే యేం చేస్తుందో తెలీదూ? గుళ్ళో తీసుకెళ్ళి దేవుడిముందు పగల గొడుతుందా? అయితే తప్పెవరిది? కోతిదా, కొబ్బరికాయదా?' హాస్యంగా రాజకీయాలని సమర్థించాడు మొదటి వ్యక్తి. అంతా ముసిముసిగా నవ్వటంతో గాంధీని రచ్చకీడ్చబోయిన మనిషి మరి నోరు మెదపలేదు.

'నువ్వే కాలేజిలో చదువుతున్నావు నాయనా?' చూస్తూ వూర్కోలేని వో పెద్దమనిషి సుధాకర్‌ని ప్రశ్నించాడు. అందరికళ్ళూ సుధాకర్‌వైపు తిరిగాయి.

'లేదండీ చదువయిపోయి'

ప్రశ్నించిన వ్యక్తికి సమాధానం రుచించలేదు కాబోలు ప్ప్, యింక ఉద్యోగ ప్రయత్నమన్నమాట...గొణుక్కున్నాడు. సుధాకర్‌కి పీకెలదాకా కోపంగావుంది. కానీ యెవరిమీదో తెలీదు. అదే తమాషా!

'ఈకాలంలో ఆడవాళ్ళనయం 'సుమా!' ఆడపిల్ల తండ్రి బుర్ర వూపుతూ అన్నాడు. చకోరాక్షి నయనాలు మెరిసాయి.

'మరేం' అన్నాయి మరో రెండు గొంతులు. 'అన్నింటా వాళ్ళే ఫస్టుకదూ.'

బుర్రతిరిగి పోతూంది సుధాకర్‌కి యీ సంభాషణ వింటూంటే. ఇన్‌ఫీరియారిటీ ఫీలవుతున్నాడు.

## నేను విద్యార్థి కాను

'ఏం నయమో! నా బొందనయం. వాళ్ళు చేసే అల్లరి వాళ్ళూ చేస్తున్నారు. ఎటొచ్చీ కనిపించటంలేదు. వాళ్ళుమాత్రం కాపీలు కొట్టటంలేదని వొట్టేసుకు చెప్పగలరూ? ఆ వాచరుగాళ్ళు అందానికి కరిగిపోయి నాల్గు మార్కులు యెక్కువ వేసేస్తూంటే వాళ్ళుమాత్రం అన్నింటా ఫస్టురారూ ఫస్టు.' అనుకున్నాడు మనసులో.

సుధాకర్‌కి మాత్రం లోలోపల బాధగానే వుంది. మర్చిపోదామన్నా మరవలేని మాటలు గింగురు మంటున్నాయి. 'మీ వాళ్ళు విసరిన రాళ్ళే...' అతని మాటల్లో నిజం వున్నట్టే అనిపిస్తూన్నాది సుధాకర్‌కి.

అతని మనసులో యిప్పుడొక్కటే మెదులుతున్నాది. తను తన చుట్టూ ప్రపంచంతో హాయిగా మెలగాలి. ఎవరూ తనని వేలెత్తి చూపకూడదు. కానీ అదెలా సాధ్యం? తనని చూసిన ప్రతివ్యక్తీ తననొక విద్యార్థిగానే భావిస్తూంటే! విద్యార్థి కావటం తప్పా? యేమో!

మనశ్శాంతికోసం సినిమా హాలువైపు నడిచాడు సుధాకర్. సరిగ్గా కౌంటర్ చేరేసరికి హౌస్‌ఫుల్ బోర్డు వేసాడు. దగ్గరికి వెళ్ళి 'ఒక్క టికెట్టు కూడా లేదా?' అడిగాడు సుధాకర్.

అతను నవ్వుతూ చూసాడు. 'బయట బోర్డు వేసారు. చూసారా?' యెదురు ప్రశ్న వేసాడు.

సుధాకర్ యిప్పుడు ఒంటరిగా వున్నాడు. ఇటువంటి జవాబు గుంపుగా వున్నప్పుడొచ్చుంటే యేమయ్యేదో? ఏమయేది? స్థానబలిమి గెలిచేది.

'నేను గవర్నమెంట్ కాలేజీ స్టూడెంట్‌ని' యీ మాటలు సుధాకర్ గొంతులోనే యిమిడిపోయాయి. మాట పెగల్లేదు. అతని కిప్పుడామాట అనాలనిపించటం లేదు.

* * *

మరో మందుల కంపెనీవాళ్ళు యింటర్వ్యూకి పిలిచారు సుధాకర్‌ని. వెళ్ళాడు. వెళ్ళాక వెళ్ళకపోతేనే బాగుండు ననిపించింది. వెళ్ళగానే ప్రశ్నలు వేసి పీక్కుతింటానికి ముగ్గురు డైరక్టర్లు కూర్చున్నారు.

పాతపాటే పాడుతూ (గుడ్‌మార్నింగ్) కూర్చున్నాడు సుధాకర్. కూర్చున్నాక యెదురుగా వున్నవ్యక్తిని చూసాడు. ఒళ్ళు జలదరించింది. జలజ గుర్తుకొచ్చింది. అతనెవరో కాదు. జలజ నాన్న?

సుధాకర్ కాలేజిలో చదివేటప్పుడు వోసారి పుస్తకంలో కాయితం ఖాళీగా వుంటే నోటికదాని తన పెన్నులో యింకు లేకపోయినా (అసలు వుండదెప్పుడూ) పక్కవాడి పెన్ను తీసుకుని జలజ అనే అమ్మాయికి ప్రేమలేఖ రాసాడు.

ఆ పిల్ల తనకి రాసిందాన్ని తెలివి తక్కువగా ప్రిన్సిపాల్‌కి, అతను ఆ వుత్తరం తనది కాదంటే, వాళ్ళనాన్నకీ చూపించింది. ఆమట్నే యిద్దరూ సుధాకర్‌మీద విరుచుకు పడిపోయి నానా గొడవా చేసేసి కావల్సినన్ని వార్నింగు లిచ్చేసారు.

సుధాకర్‌కి వాళ్ళ నాన్నమీద, జలజ మీద, యింకా ప్రిన్సిపాల్‌మీదా కోపం వచ్చినా, యేం చెయ్యలేక 'పోనీ వీళ్ళెవరూ తెలుగు సినిమాలు చూళ్ళేదులా వుంది.' అని సర్ది చెప్పుకున్నాడు. ఇదీ ఆనాటి జలజకథ.

ఇలా సుధాకర్ ఆలోచిస్తూ బెదిరి పోతూంటే ఆ బొర్రమీసాలాయన చటుక్కున 'విద్యార్థులు ప్రేమించొచ్చా?' అన్నాడు. ముందు తనని కాదేమో అని అనుకున్నా, అతను రెట్టించి అడిగేసరికి



వాళ్ళ మండింది.

'ఇన్ఫ్, జనరల్ నాలెడ్జికోసం అడిగాను. మరేం అనుకోపోతే చెప్పు' అన్నాడాయన.

ఏదో గొణిగాడు సుధాకర్.

'ఏం చదివావ్' అన్నాడాయన.

'బి. యస్.సి.'

'ఏం క్లాసు?'

'థర్డ్'

'హూ' అన్నాడత నొక్కసారి.

'ఏం విద్యార్థులో. వీళ్ళకి చదువుమీద తప్ప మరన్నిటిమీదా ధ్యాసే' పక్కవాడితో అని విట్టువేసినట్టు గట్టిగా నవ్వాడాయన.

'డామ్విత్ ప్రిన్సిపాల్'

అదిరిపడ్డాడు సుధాకర్. బయట మళ్ళీ కలకలం. విద్యార్థులు సమ్మె కొనసాగిస్తున్నారు. ఇది మూడోరోజు సమ్మె! మరో రోజు చేస్తే హాయిగా పదిహేను రోజులదాకా కాలేజీ తెరవరు. అదీ వాళ్ళ గొడవ. అందుకే ఈ సమ్మెలూ అవీను. వీటిని గురించి పెద్దాళ్ళకేం తెల్సు? సుధాకర్‌లాంటి వాళ్ళకి తెలుస్తుంది కానీ.

'పిళ్ళు చదువులకి నామంవేసి రోడ్లంబట తిరుగుతున్నారే. ఆర్ దే స్టూడెంట్స్? వీళ్ళు విద్యార్థులా?' తన విచారాన్నంతా వెళ్ళబోసుకున్నాడొకతను.

వెధవలు. ఏ మూలకో వెళ్ళి అరుచుకో రాదూ. పిళ్ళమూలంగా తను తలెత్తుకు తిరగలేక పోతున్నాడు. అయినా ఎప్పుడో నేను చదువుకున్నానని. నన్ను యిప్పుడూ వీళ్ళలో జమకట్టేస్తున్నారేం? నేను విద్యార్థిని కానే! జవాబు దొరక్క సుధాకర్ సతమత మవుతున్నాడు మనసులో.

ఇంటర్వ్యూలో వాళ్ళేదో అడిగారు. తనేదో జవాబులు చెప్పాడు. మరోక్షణంలో బయటపడి హాయిరి పీల్చుకున్నాడు.

'హమ్మయ్య'

బస్‌స్టాండ్‌వైపు నడకసాగించాడు. జబజ వాళ్ళనాన్నే దీనికి డైరక్టరని తెల్సుంటే చెప్పివా ఎవ్వయ్ చెయ్యకపోదును కదా! ఫీలయ్యాడు సుధాకర్.

విద్యార్థులు చేస్తేగొడవ ఎక్కువయింది. పోలీసులు లాఠీలు వూపుతున్నారు. ట్రాఫిక్ బందయిపోయిరేది.

డౌన్విత్ ప్రిన్సిపాల్...

కేకలు యెక్కువయ్యాయి. రాళ్ళు గాల్లోకి లేస్తున్నాయి, అద్దాలు తప్పు మంటూ పగులుతున్నాయి. అద్దాలు విరక్కొడితే వాళ్ళకి కావల్సింది లభిస్తుందా? రాళ్ళు గాల్లోకి లేస్తే ప్రిన్సిపాల్‌కేం నష్టం? అతను గాల్లో వుంటాడా? దుకాణాల్లో అద్దాల వెనకాల వుంటాడా?

వైరిమూక అర్థం పర్థం లేదు.

'సేవ్ అవర్ డెమాక్రసీ' బస్‌స్టాప్‌లో ఒకతను అంటున్నాడు.

'వీళ్ళంతా చదువుకునే వాళ్ళేనా?' ఆశ్చర్య పోతున్నారంతా. ఆశ్చర్యం వెనకాల దాగిన జుగుప్స, బాధ, అసహ్యం గుంపులోని వాళ్ళకెలా అర్థమవుతాయి.

సుధాకర్‌కి చుట్టూవున్న వాళ్ళని చూసే ధైర్యం లేకపోతూంది. అంతా తననే చూసి నవ్వుతున్నట్టుంది. 'నేను విద్యార్థిని కాను నేను విద్యార్థిని కాను. నన్నలా చూడకండి' అంటూ అరవాలనిపించింది. మాట పెగల్లేదు. హృదయాన్ని దాటి రాలేదు పలుకులు.

ఎక్కడినుంచో ఓ రాయి సుధాకర్‌కి తగిలింది. నెప్పి! మొదటిసారిగా నెప్పంటే యెలా వుంటుందో తెల్సింది.

'వెధవలు మరీ తెగులు మీరి పోతున్నారు. నేను చదువుకునే రోజుల్లో అయితేనా...' యీమాటలు అనుకోకుండా పైకే అనేసాడు సుధాకర్. అందరూ అతనివైపు చూసారు.

ఆ చూపులు సుధాకర్‌ని బాధించటం లేదిప్పుడు. అతనన్నమాటలు అతనికే విచిత్రంగా వున్నాయి.

'విద్యార్థులు చెడిపోతున్నారు' గొణిగాడు సుధాకర్. ఈ మాటలన్నాక చాలా మటుకు బరువు దిగిపోయినట్టుంది.

'నేను విద్యార్థికాను' గట్టిగా అరిచి అందరితో చెప్పాలనిపిస్తున్నాది సుధాకర్‌కి. అప్పుడు తనకి లభించే గౌరవం వేరు.

నిజమే, యీనాడు విద్యార్థులు తమకున్న గౌరవాన్ని స్వయాన నాశనం చేసుకుంటున్నారు అనిపించింది సుధాకర్‌కి.

గుంపు గమ్యం లేకుండా అలా ముందుకి సాగిపోతూనే వుంది. ఎవరు విద్యార్థులు? ఎవరు కారు? నిజమే నా మటుకు నేను విద్యార్థిని కాను. తృప్తిగా నిట్టూర్చాడు అసలు జీవితాన్ని చవిచూస్తున్న ఒకనాటి విద్యార్థి సుధాకర్. ●



# తెలుగు రాసే పద్ధతులు - కొన్ని అభిప్రాయాలు

**ఇటీవల జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలనిబట్టి ఆంధ్ర పత్రిక వార పత్రిక తే. 26-1-68 సంచికలో పడిన ఆర్, విజయవాడ రాసిన ఉత్తరాన్ని, దాని మీద ఒక భాషా సేవకుడు, మదరాసు తే. 29-3-68 సంచికలో రాసిన ఉత్తరాన్ని ఈ దిగువ వేస్తున్నాము. -సం॥**

### ఒక సూచన

ఇటీవలే శ్రీ పి. డి. దేశముఖ్ దేవనాగరిలిపిని సంస్కరించటం అవసరం అన్నారు. తెలుగు లిపి కూడా దేవనాగరి వంటిదే కాబట్టి మన లిపిలో వత్తులు, కొమ్ములు వగయిరా ఇంకా ఎక్కువ ఉన్నాయి కాబట్టి సంస్కరణ యిక్కడకూడా అవసరం. 'క్ర', 'స్మ' వంటివి రాయటమే కష్టం అనిపిస్తే, 'క్ష్మ', 'స్త్రీ' ఇంకా కష్టం! అచ్చు వెయ్యటానికి వచ్చేసరికి ఇవన్నీ పెద్ద సమస్యలయి పోతాయి! అక్షరాలు, వత్తులు విరిగిపోవటం మనం చూస్తూనే ఉంటాము. శ్రీ దేశముఖ్ మూడు 'అక్షరాలు' కలిపిన అక్షరాలు ముందు తీసెయ్యాలని సూచించారు. అసలు భారతీయ భాషలన్నిటికీ, కొన్నిమార్పులతో రోమన్ లిపిని వాడితే బాగుంటుంది; కానీ యిది అంత తేలికగా జరిగే పనికాదు కాబట్టి ప్రస్తుతం తెలుగులో వాడుతున్న అక్షరాలనే కొంచెం మార్చి వాడితే ఒక అడుగు ముందుకు వేసినట్లవుతుంది. శ్రీ దేశముఖ్ చెప్పినట్లు రెండు అక్షరాలు కలిపి ఉన్నవి మాత్రం వాడవచ్చు; లేదా కేవలం ఒక అక్షరం ఒకహల్లు లేక ఒకహల్లు, ఒక అచ్చు కలిపిన శబ్దాన్ని సూచించేట్లు వాడవచ్చు.

ఉదాహరణకి మొదటిపద్ధతి ప్రకారం మనం యిప్పుడు 'రాష్ట్రం' అని రాసే మాటని 'రాష్ట్రటం' అని రాయవచ్చు.

ఇంకా ముందుకి వెళ్ళాలంటే 'రాష్ట్రటం' బదులు 'రాష్టరం' అని రాయవచ్చు.

ఇలా రాస్తే అసలు వత్తు అక్షరాలే ఉండ నవసరంలేదు! ఇంగ్లీషులో ఉన్నట్టే హల్లు గుర్తులు అంకె పెరుగుతుంది. కానీ లిపి మనకి పరిచితమైనదే అవుతుంది. (ఇంకొక సంగతి గమనించాలి, ప్రస్తుతం 'ఐ' బదులు 'అయి', 'ఔ' బదులు 'అఉ' లేక 'అవు' అనిగానీ రాయాలి!)

శబ్ద రత్నాకరంలోని మొదటి ఉదాహరణం 'కుల ప్రయుక్త మగుచున్న సనాతనధర్మమిత్తెఱంగ' అని ఉంది. శకట రేఫం బదులు మామూలుది వాడి మొదటి పద్ధతి ప్రకారం రాస్తే ఈ పద్యభాగాన్ని అసలు మార్చనే అక్కరలేదు. రెండవ రకంగా రాస్తే,

'కులప్రయుక్తమగు చున్న సనా తన ధర్మ మిత్ తెరంగ'

అని కనిపిస్తుంది.

ఇది అంత ఎబ్బెట్టుగా కనిపించదని నా అభిప్రాయం, నమ్మకం కూడాను!!

— ఆర్ (విజయవాడ)

### తెలుగు ఒత్తులు

ఆర్యా,

ఆంధ్రపత్రిక వారపత్రిక 26-1-68 సంచికలో ఉత్తరాలలో 'ఒక సూచన' అనే శీర్షికక్రింద శ్రీ ఆర్. గారు చేసిన సూచనలు చదివాను. ప్రస్తుతం తెలుగు ముద్రణలో మోనోటైపు పద్ధతి, లైనోటయిపు పద్ధతి వచ్చాయి గనుక వారి సూచనలు నాకు చాలా మంచివని పించాయి. కానీ జనంలో యివి అలవాటు కావడానికి కొంతకాలం పడుతుంది. కారణమేమంటే జనం కొన్నిటికి అలవాటు పడతారు, అవి తప్పయినా, ఒప్పయినా, కొంతకాలానికి ఎవరైనావచ్చి, అవి తప్పు అని చెప్పినా వారు వినరు, మొదట ఉపేక్షిస్తారు, తర్వాత ప్రతిఘటిస్తారు, పిదప ఒప్పుకుంటారు. ఇదీ జనతా పద్ధతి. ఉదాహరణకు 'సవ్యం' అనే పదం ప్రయోగం తీసుకుందాం. సవ్యం అంటే సంస్కృతంలో ఎడమ. అపసవ్యం అంటే కుడి. 'వామం శరీరే సవ్యం స్యాత్ అపసవ్యం తు దక్షిణం' అని అమరకారుడు అన్నాడు. సవ్యసాచి అంటే, ఎడమ చేతితోనూ బాణాలు వదిలేవాడు కదా! మరి నేడు వ్యవహారంలో సవ్యం అంటే మంచికీ, అపసవ్యం అంటే వ్యతిరేకానికి అసంబద్ధానికీ వాడుతున్నాము.

అలాగే మన ఒత్తులపద్ధతి కూడా. మన దేశంలోని లిపులలో ఎన్నోకారణాల వల్ల నిలువుకత్తు, గుండ్రకత్తు, వాకకత్తు, తలకట్లు, ఒత్తులు మొదలైనవి ఏర్పడ్డాయి; లేఖన సాధనాలుబట్టి, లేఖన వేగాన్నిబట్టి, ఒత్తు అంటే నొక్కడం, ఊది పలకడం. దీనికి సంస్కృతంలో ద్విత్వం అని సంకేతం. ఈ ఒత్తులు తెలుపడానికి పూర్వం అక్షరంక్రింద మరొక అక్షరం పెట్టడమో లేక అక్షరం పక్కన మరొక అక్షరం పెట్టడమో ఉండేది, నేటికీ ఉంది. దేవనాగరి లిపిలోనూ, తమిళంలోనూ నేటికీ పక్కన పక్కన పెడుతున్నారు. పూర్వం అశోక శాసనాలలో ద్విత్వాక్షర పదం వచ్చినప్పుడు అక్షరంకింద అక్షరం చెక్కారు. వ్యం అన్నప్పుడు వ కింద య అంటి పెట్టుకుని చెక్కారు. ఈ అక్షరాలలో రెండవది కిందదీ ప్రధానం, దానికే గుణింతాలు యివ్వాలి. కానీ, పైన కనిపించే అక్షరానికే యివ్వడం ప్రారంభించారు. ఈ పద్ధతి శాస్త్రీయంకాదని కొంత కాలానికి గ్రహించారు కాబోలు ప్రధానాక్షరమైన పక్క అక్షరానికీ, కింద అక్షరానికి గుణింతాలు చెక్కసాగారు. నిజానికి యిదే శాస్త్రీయమైన పద్ధతి. కానీ శిల్పులు అంతా ఈ పద్ధతి పాటించక అస్తవ్యస్తంగా చెక్కేవారు. నన్నయకాలం నాటికుకూడా ఈ గుణింతాల విషయంలో ఒక వ్యవస్థ అంటూ ఏర్పడలేదు. అప్పటికి తలకట్టు పద్ధతి స్థిరపడింది. ఒత్తుగా పెట్టిన కిందివరుస అక్షరాలకు గుణింతాలు యివ్వడంవల్ల చదివేటప్పుడు రెండు సార్లు చూసి తడుముకొనే చిక్కు, అన్యాయ

చదివే ప్రమాదం ఏర్పడే ఉంటాయి. పైన తలకట్టుతో పూర్ణంగా కనిపించే అక్షరాలలో మార్పులు లేక ఒత్తుగా యిచ్చిన కిందివరుస (లేక హాఫ్ డెక్‌లో కింది) అక్షరానికి గుణింతాలు యిస్తే, సామాన్య పాఠకుడు పై వరుసలో మాత్రమే చదివి కింద మరిచిపోయే ప్రమాదం ఉంది. కనుక అప్రధానమైన, పై అక్షరానికే గుణింతాలు యివ్వడం చదవడానికి సౌకర్యమని భావించి ఉంటారు. నన్నయ కాలానికి ఈ పద్ధతి స్థిరపడి పోయింది. కాని, పూర్వపు వాసనవల్ల య ఒత్తు, వ ఒత్తువంటి వాటికి మాత్రం గుణింతాలు యివ్వడం తర్వాత శ్రీనాథుని కాలంవరకూ కనిపిస్తుంది. అప్పటి ఒత్తులవద్దతే మనకి నేడూ అలవాటులో ఉంది. ఈ ఒత్తులన్నీ రెండువేల ఏండ్ల నాటి అక్షరాల స్వరూపావశేషాలే. (వివరాలకు శ్రీ తిరుమలరామచంద్ర 'మన లిపి పుట్టు పూర్వోత్తరాలు' చూడండి)

కాని, నేడు ముద్రణలో ఈ ఒత్తుల అలవాటు చిక్కులు తెస్తున్నది. దేవనాగరిలోని పద్ధతి నిజంగా శాస్త్రీయ పద్ధతి. దాని ప్రకారం మనమూ నేడు మన ద్విత్వాక్షర పద్ధతిని మార్చుకోడం ఉచితం.

మన అలవాటు సరైనదికాదని మనకు స్పష్టమైనప్పుడు, ముద్రణాభివృద్ధికి అడ్డు తగులుతున్నప్పుడు, మార్చుకోడం వివేకుల లక్షణం. కన్నడం లైనో టైపులో కొన్ని కావ్యాలు ఈ విధంగా ముద్రించారు. అవి జనాదరం పొందాయి.

రెండుమూడు ఒత్తులున్న అక్షరాలు సంస్కృతంలో తప్ప మనకు లేవు. కార్త్స్న్యం వంటివి సంస్కృతంలోను సకృత్తు కనుక శ్రీ 'ఆర్'గారి సూచనను ముద్రణలో అనుసరించడం ఉచితమని భావిస్తున్నాను.

చివరగా ఒక మనవి: భాష భావ ప్రకటనకు సాధనం. లిపి భాషాభివ్యక్తికి సాధనం. మనం కేవలం సాధనాలకోసం పోరాడుకోడం మాని, సాధ్యం ఏదో, దాని అభివృద్ధి ఏదో, తత్ ప్రయత్నం ఏదో వాటికోసం పాటుపడదాము.

**—భాషాసేవకుడు (మద్రాసు)** ●

**కూరలూ గుణాలూ:**

# కాకరకాయ

పొడుగువి, పొట్టివి అని కాకర కాయలు రెండు రకాలు. పొడుగ్గా తెల్లగా వుండే కాకరకాయలు శ్రేష్ఠమయినవి. చిరుచేదుగా వుంటాయి. వీనికూర సులభంగా జీర్ణమవుతుంది. కళ్లకు చలవ చేస్తుంది. మేహం, వాతం, జ్వరం, కాస, శ్వాస, కుష్ఠు ఈ రోగాలు కలవారికిది పథ్యమయిన కూర.

ఈ కూర వీర్యస్తంభన చేసి రతి సౌఖ్యాన్ని చేకూరుస్తుంది. అతిసారాన్ని, శ్లేష్మాన్ని, క్రిమిరోగాన్ని తగ్గించడానికి తోడ్పడుతుంది. వీనిని మజ్జిగలో ఉడికించి వార్చి పొగిచి తినడం ఆరోగ్యకరం. లేతకాయ త్రిదోషహరమైనది. ముదిరినది విరేచనకారి. పైత్యం చేస్తుంది. కాకరపండు కఫాన్ని గొట్టును. పైత్యం, వాతం, గురుత్వం చేస్తుంది. ఉష్ణతత్వం కలవారు కాకరకాయ కూర తినడం అంత మంచిది కాదు.

దీని దుర్గుణాలకు విరుగుళ్లు: 1. నెయ్యి, 2 పులుసు, 3. ఆవగుండ, 4. ఆగాకరకాయలు, 5. దోసకాయ, 6. మోదుగక్షారము.

పొట్టి కాకరకాయ చేదుగా వుంటుంది. త్రిదోషాల్ని హరిస్తుంది. మేహం, దద్దుర్లు, కుష్ఠు, కఫం, వాతం, క్రిమిరోగం గలవారికిది మేలు చేస్తుంది. జీర్ణశక్తి నిస్తుంది, కొద్దిగా వేడి పైత్యం చేస్తుంది.

ఎండించిన కాకరకాయ ముక్కలు (వరుగు) నేతిలో వేయించినా, కూర వండినా చిరుచేదుగ బాగా వుంటాయి. త్రిదోషహరమై ఆరోగ్యకరంగా వుంటాయి.

కాకరాకురసం వెగటుగ చేదుగా వుంటుంది. వేడి చేస్తుంది. శీత వాత జ్వరాల్ని, చర్మరోగాన్ని, క్రిమి రోగాన్ని తగ్గింపజేస్తుంది. కుక్క, నక్క యివి కరచినట్లయిన — ఆ గాయాలపై ఈ రసం పిండితే ఆ గాయాలు శీఘ్రంగా మానుతాయి. ఈ రసం జీర్ణశక్తిని అభివృద్ధి చేసి ఆకలి పుట్టిస్తుంది. మోతాదు పూటకు ఒకటి మొదలు రెండు తులాల వరకూ రెండు పూటలూ యివ్వాలి.

కాకరాకుకూర చేదుగా వుంటుంది. క్షయ, పైత్యం, కడుపుబ్బు, మేహం, క్రిమిరోగం గలవారికిది మిక్కిలి పథ్యమయిన కూర.

# నక్కదోసకాయ

జ్వరం మొదలగు కారణాలచేత కలిగెడి అరుచిని నక్కదోసకాయకూర పోగొడుతుంది. చలవ చేస్తుంది. మూత్రాన్ని బాగా జారీ అయేటట్లు చేస్తుంది. ఇది విరేచనకారి.

శ్లేష్మ వాతాలను ప్రకోపింపజేస్తుంది. గురుత్వంగా వుంటుంది. సాధారణంగా చాలామంది దీనిని ఊరగాయగా పెట్టి ఉపయోగిస్తూ వుంటారు.

దీని దుర్గుణాలకు విరుగుళ్లు: 1. సొంఠి 2. సోపు 3. ఉప్పు 4. తేనె 5. మిరియాల చూర్ణం.

సేకరణ:—ఆకుండి నారాయణమూర్తి




### జ రి గి న క థ

అనూరాధ తల్లి అన్నపూర్ణమ్మ తమ్ముడు రాజా. అన్నపూర్ణమ్మ కన్నబిడ్డల చదువుకోసం ఎంతో కష్టపడుతూవుంటుంది. ఒకనాడు అనూరాధ డాన్సు చూచి బహుమతినీయడానికి ఆగంతుకుడుగా వచ్చి డా. హరికృష్ణ పరిచయమవుతాడు. ఇంతలో మద్రాసులో ఒక నాటక సమాజం వారి పిలుపుతో నాట్యప్రదర్శన యివ్వటానికి మద్రాసు బయలుదేరుతుంది. స్టేషనులో హరికృష్ణ కలుసుకు. మద్రాసుకు ఆమెను తీసుకెళ్తాడు. హరికృష్ణ ఆమెని ఆకర్షించాడు. శారద గురించి తెలుసుకోవాలని ఆమెకి ఆసక్తి కలిగింది. శారదకీ తనకీ వున్న సంబంధాన్ని ఉత్తరం ద్వారా ఆమెకి తెలియపర్చాడు హరికృష్ణ. దానితో శారద అనూరాధకి మరింత సన్నిహితురాలవుతుంది.

---

## 6

హరికృష్ణ లే వస్తూనే 'రాధా!' అన్నాడు పెద్దగా.

'వస్తున్నాను!' అంటూ పాలగ్లాసు చేత బట్టుకుని వెళ్ళింది వెంటనే.

'త్రాగండి! తియ్యగా వున్నాయి!' అంటూ అందించింది.

అతడు గ్లాసువంక చూస్తూ నవ్వాడు విరక్తిగా.

'తీయగా వుండొచ్చు. కానీ తీయగా వున్నదేదీ నాకు అందకూడదు, రాధా! ఓ మాట చెప్పనా! దేవుడికూడా పిచ్చి పట్టిందట. పాపం పిచ్చిమూలానే గబోలు మంచివాళ్ళందరినీ శిక్షించుతూంటాడు.'

అతనిమాటలు నిజమేనని పించిందామెకు. తాను పెదవి కదిపితే యింకా వుపన్యాసం కురుస్తుందని మౌనంగా వుండిపోయింది. ఆరాత్రి పాలుతాగిన తరువాత అతడు ఎంతో సేపటికిగాని నిదురబోలేదు.

కిటికీలోనుంచి కన్పించుతూన్న దేవాలయ శిఖరాన్ని చూపించి అన్నాడు—

'చూడు! రాధా! దేవుడు గుళ్లో బంధించబడి ఎలా నిట్టూరుస్తున్నాడో! ఒక్కసారి పెన్ను తీసుకురావూ! మంచి పాట వ్రాస్తాను.' అనూరాధ పెన్ అందించింది. అతని పిచ్చిధోరణి చూస్తోంటే ఆమె గుండెల్లో ఆవేదన సెగలు జిమ్ముతోంది.

పెన్ తీసికొన్నాడు. డైరీ తెమ్మన్నాడు. దానిలో వ్రాసివున్నది చదవనారంభించాడు పెద్దగా.

'ఇదిగో వింటున్నావా! రాధా! డాక్టరు హరికృష్ణ! ఎవరో ఈ మహానుభావుడు—' అంటూ వో పేజీ తెరిచాడు.

'అంబరాన మెరిసే తారకలా—నవ్వుతోంది. చీకటితప్ప మరేదీ లేని ఈ జీవితంలో కూడా నవ్వులు రువ్వగూడదా? అనూరాధ! పేరుకూడా అందంగా వుంది. నాట్యమయూరి ఆమె. ఒయ్యారా లొలికించే సెలయేరులా నడుస్తుంది. తోడుగా నడిచి రాగూడదా? నీడలా నన్ను ఆదుకోగల దామె! కానీ...'

మరో పేజీ తిరిగింది—

'కృష్ణవిగ్రహం అందించాను. ఆ విశాల నయనాలలో వెన్నెల మల్లియలు కురిపించింది. ఎంత అందంగా నవ్వింది!! ఆ కంఠాన కోయిలమ్మ కుహూ మంటోంది. 'హరీ!' అని తీయగా ఆ బంగరు పెదవులతో పిలిస్తే ఎంత బావుంటుందో! అనూరాధ హృదినిండుగా విరిసిన మమతలలోని మాధుర్యం అందుకోవాలి!'

'భలే! చాలా బావుంది! అనూరాధను ప్రేమించాట్ట! ఈ హరికృష్ణగారు. ప్రేమించడంకూడా వో వ్యాపారమైపోయింది.' అతడు చప్పట్లుకొడుతూ పెద్దగా నవ్వసాగాడు. ఆ డైరీలోని వాక్యాలు వినగానే అనూరాధ హృదయాన వింతైన సందడి విద్యుత్తులా పాకిపోయింది. కనులు దించుకుని వింటూండిపోయింది. మళ్ళీ వో పేజీ త్రిప్పబోతూంటే ఆపివేసింది కావాలనే. కానీ అతడు పసివాడిలా హఠం పట్టుక్కూర్చున్నాడు. చేసేదేమీలేక మరో గదిలోకి

వెళ్ళిపోయిం దామె.

కానీ అతనిస్వరం వీనులకు విందు చేస్తూనే వుంది. మధ్యలో నవ్వుతున్నాడు. వ్యాఖ్యానిసు తున్నాడు. ప్రశంసల్ని రువ్వుతున్నాడు.

'అనూరాధ—నా హృదయాన వెలసిన అనురాగ వీణియ.' ఆ వాక్యం వినగానే ఆమె చెక్కిళ్ళు ఎర్రబారాయి. మనస్సున కోటి భావనలు గుబాళించాయి.

అతని స్వరం మృదు మ ధు రం గా విన్పించుతూనే వుంది. న వ్వు లు హృద యాన పండుగ చే స్తూ నే వున్నాయి. మధురోహలు అందమైన కలల నల్లుకుంటూనే వున్నాయి. ఆ తీయని తలపులలో తేలిపోతూనే నిదురలోకి తూలిపోయిందామె.

*    *    *

ఉదయాన లేవగానే రాత్రి జరిగినదంతా గుర్తుకు వచ్చింది. సన్నని మంద హాస రేఖ మెరిసిందామె పెదవులపైన. హరికృష్ణవున్న గదిలో అడుగు వేయగానే ఆమెకు నవ్వొ వచ్చింది, బాధా కలిగింది.

చేతిలో పెన్ అలాగే వుంది. డైరీ తెరిచే వుంది. కిటికీలో తలవుంచుకుని పడుకుని వున్నాడు. అతని ముఖాన అలసట పొరాడుతోంది. భావాల బరువుతో కనురెప్పలు అ పు డ పు డు కదులుతూనే వున్నాయి.

చల్లనిగాలి మృదువుగా పలుకరించి పోతోంది. అతడు మై మ ర చి నిదుర పోతున్నాడింకా.

చప్పుడు చేయకుండా 'డైరీ, పెన్', తీసిందామె. ఏం వ్రాశాడా అన్న కుతూహలంతో తెరిచిన పేజీవంక చూసింది—

'అందంగా—మెరుస్తోంది — అనురాగం అనూరాధలా — అపరంజి బొమ్మలా— వెంపాన — కురుస్తోంది — విరివాన — అందంగా—ఆనందంగా —మందారంలా— మధువులా—మత్తులా— ఎర్రగా — తీయగా —కలలా—అలలా—అల్లుకు పోతోంది— బ్రతుకంతా—తానై—అనురాగ బంధం!'

మృదువైన ఆ భావాల నిండుగా మధురిమ హాయిగా వేయికలలు గంటోంది ఆ వూహాజగత్తులో అనూరాధ ఓదేవత. ఆమె అనురాగమే ఆ పూజారి కోరుకున్న వరం. అతనికి అనూరాధ అప్పుడే పరిచయమైన వ్యక్తిగా కన్పించుతోంది. తానామెను అంకితం చూసిన సంగతి గుర్తుకు రావడంలేదు. కానీ 'అనూరాధ' అన్న పేరు మాత్రం ఎక్కడో ఎప్పుడో విన్నట్లు అన్పించుతోంది అతనికి. ఆ మధుర భావాల్ని చదవగానే అనూరాధ హృదిలో పులకింత చెలరేగింది. అతను తనను ప్రేమించు తున్నాడని గ్రహించింది. కానీ యింతగా ఆరాధించు తున్నాడని వూహించనైనా వూహించలేదామె!

డైరీ మూసి అలమారులో వుంచింది. ప్రశాంతంగా, పసిబిడ్డలా నిదురబోతూన్న అతనివంక చూడగానే ఆమె మనస్సున ఎన్నో వూహలు వూయలలూగాయి. నిద్రా భంగం కాకుండా నిశ్శబ్దంగా ఆ గదిలోని వస్తువులన్నింటినీ సర్ది వెళ్ళిపోయింది.

రాజును తల్లికోసం పంపించానని శారదకు తెలియజేసిందా సాయంత్రం



కొన్నిరోజులు గడిచిపోయాయి. రాజా 'మేము రావడం కొంచెం ఆలస్యమౌతుంది.' అని వ్రాశాడు. పనిమనిషి, పార్వతమ్మ బంధువుల యింట్లో పెళ్ళికని వెళ్ళింది. వంట దగ్గరనుంచి అన్నిపనులూ అనూరాధే చూసుకోవలసి వస్తోంది. హరికృష్ణ ధోరణి మరింతగా మారిపోతోంది నానాటికీ. ప్రతిదానికీ పెద్దగా అరిచి గొడవ పెడుతున్నాడు. అనుక్షణం, అనూరాధ ఎదుటే వుండాలని పట్టుబడుతున్నాడు.

శారద ప్రతిరోజూ వచ్చి రెండు మూడు గంటలుండి వెళ్ళిపోతోంది. ఆనాడు శారద వచ్చేసరికి అనూరాధ క్రింది భాగంలో వున్న రెండుగదుల్ని శుభ్రం చేయించి, సామానేమీ లేకుండా ఖాళీ చేయిస్తోంది.

'అదేమిటి ? అనూ ! ఇప్పుడా గదులతో ఏం పని?' అన్నది శారద.

'అద్దెకు యిద్దామని' అన్నది. ఎవరికని ప్రశ్నించింది శారద.

'అమ్మా, రాజా, నేనూ వుంటాం !'

'ఏమిటీ ?! అమ్మా, మీరూ వుంటారా ?! ఇంకా పరాయిమనిషిగానే వుండిపోదా మనుకుంటున్నావా ? అనూ రాధా ?!'

'ఎలా వున్నా అంతస్సుని విస్మరించలేక పోతున్నానక్కా ! దీనిమూలాన భేద భావం మాత్రం రాబోదని హామీ యిస్తున్నాను...'

ఆపైన నోరెత్తలేక పోయిందా అక్క. విచిత్రంగా చూస్తూండి పోయింది. శారద వెళ్ళిన పదినిమిషాలకే గేటులో నుంచి ఓ కారు దూసుకు వచ్చింది.

అనూరాధ వరండాలోకి వచ్చి చూసింది. ఓ యాభైయేళ్ళ వ్యక్తి కళ్ళద్దాల్ని సవరించుకుంటూ కారు దిగాడు. ఆయింటి యజమానిలా నలువైపులా అధికారం మెరిసేట్టు చూశాడు. ఓ నౌకరు పరుగునవచ్చి నమస్కరించాడు.

'ఊ ! ఏరా ! జోగులూ ! డాక్టరిగారికి పిచ్చెక్కిందటగా ! ఇపుడు ఎక్కడున్నారు ?'

'ఇక్కడే వుండారు బాబుగోరూ !'

'మరి...మందూ మాకూ ఎవరిస్తున్నారు ?'

'అనూరాధమ్మగారు !'

'ఆహా ! నిజమేనన్నమాట! ఆసంగతి. ఆల్‌రైట్ ! మకుటంలేని ఆ మహారాణిని ఎవరు ఆహ్వానించార్రా ?' వ్యంగ్యం దూసుకు వచ్చిందాయన గొంతునుంచి.

'అమ్మగారు దేవతలాంటోరు బాబయ్యా ! అందుకే, అయ్యగోరికి...'

'ఆ దేవత ఆరోప్రాణం అంటావు ! అంతేగా ?' మధ్యలోనే అందుకుంది ఆగ్రహం.

'పిత్తం ! అంతేనండి !'

వివరాల్ని వోపికగా సేకరించుతూన్న ఆ వ్యక్తి హరికృష్ణ మేనమామ, 'రామనాథం' అని నౌకరు మాటల్నిబట్టి తెలుసుకుంది అనూరాధ. శారదకు ఫోను చేద్దామనుకున్నది. కాని అంతలోనే లోనికి ప్రవేశించాడా పెద్దమనిషి.

ఎదురుగా వున్న అనూరాధను చూసీ చూడనట్లే ముందుకి వెళ్ళిపోయాడు. హరికృష్ణ 'రాధా! ఎవరో వచ్చారు చూడు! కొంచెం తొందరగా వెళ్ళమని చెప్పిపో. ఇంకా పెద్దమనిషికి !' అంటూ కేకలు వేయసాగాడు.

'నేనురా! హరీ ! రామనాథం మామయ్యనిరా !' నెత్తీ నోరూ బాదుకుంటున్నాడా వ్యక్తి.

'ఆల్‌రైట్ ! ఒప్పుకుంటున్నానోయ్ మామగారూ ! నీపేరు ఏ నాథం అయినా నా కనవసరం ! ముందు నీకేం కావలసి వచ్చావో చెప్పు !' అది హరికృష్ణ స్వరం.

'అలాగే ! నీదగ్గర పుచ్చుకున్న ఆయిదువేలూ తెచ్చాను !'

'వేలు నా కనవసరం ! తీసికొని వెళ్ళిపో !'

హరికృష్ణ ఆ మాట అనగానే అనూరాధ గది ముందుకువచ్చి నిలబడింది. ఆ పెద్దమనిషి ఏదో 'ప్లాను.' వేసికొని వచ్చినట్లు బోధపడిందామెకు.

'అలాగా ! అయితే యిదిగో చెక్‌బుక్! ఓ పదివేలకు చెక్కు వ్రాయి ! మంచి అవసరంగా వుంది. పెద్దవాణ్ణి అమెరికా పంపించు తున్నాను.'

హరికృష్ణ చేతికి అలమారులో వున్న చెక్‌బుక్‌ను తీసి అందించాడాయన. పెన్ కూడా అందించ బోతూండగా అన్నది అనూరాధ.

'ఆగండి ! బాబాయిగారూ! ఇపుడాయన సంతకం చెల్లదు. అకౌంటంతా శారదక్కయ్యపేరన వుంది. అదీగాక చెక్కు అందుకుని వెళ్ళడానికి అందరికీ అర్హత వుండదు.' సౌమ్యంగానే వుందామె స్వరం.

ఆయన కనులలో క్రోధం పరుపులు పెట్టిందోక్షణం. అనూరాధవంక పరీక్షగా చూశాడు. మీసాల్ని సవరించుకున్నాడు విలాసంగా.

'అమ్మాయ్ ! ఈ రామనాథం ఎదుట నిలబడి మాట్లాడ్డానికికూడా అర్హత వుండాలని తెలుసుకో !' గర్వం వెల్లివిరిసిం దతని మాటల్లో.

'అర్హతల ప్రసక్తి యిపుడు అనవసర మనుకుంటాను రామనాథంగారూ ! పూవులా నిర్మలంగా వున్న మనస్సులకు వేరే అర్హత లెందుకింకా ?' వ్యంగ్యం దూసుకువచ్చింది బాణంలా.

కళ్ళజోడులోనుంచి అనూరాధ వంక చూశాడో క్షణంసేపు. హరికృష్ణవైపు తిరిగి అన్నాడు—

'నాయనా! హరీ ! ఈ యింటికేదో గ్రహం పట్టుకుందిరా ! మీ అత్తయ్య నీమాట విన్నప్పటినుంచి 'యిదేదో శని గ్రహం బాబో!' అని మొత్తుకుంటోంది. కానీ నిజమే నన్పిస్తోం దిపుడు.'

ఆ మాటలు తనపైనే విసరబడ్డాయని గ్రహించింది అనూరాధ—కావాలనే మౌనం వహించింది. హరికృష్ణ ఏదో బొమ్మగీస్తూ కూర్చున్నా డంతసేపూ. పిచ్చిగీత లెన్నోగీసి వాటి నన్నింటినీ తలగా, కాళ్ళుగా మార్చి క్రింద 'రామనాథంగారు—పెద్దమనిషి' అని వ్రాశాడు.

'ఏరా ! బాబూ ! కాస్త తలెత్తరా ?' అనురాగం వంకరలు తిరిగిందా స్వరాన.

'ఇదిగో ! ఎలావుంది ఈ బొమ్మ ! పొట్ట చూశావా? ఎంత వుందో! కొండలా వుందిగదూ ! రాధా ! అచ్చు 'రామనాథం మామయ్యలా లేదూ ?' అన్నాడు హరికృష్ణ ఆ బొమ్మను అనూరాధకు చూపించుతూ.

ఆ పెద్దమనిషికి తలకొట్టేసినంత పనయ్యింది.

'వీడికి కాదు పిచ్చి. నాకు ఎక్కుతుంది

మరికొంచెంసేపు వుంటే !' అనుకున్నాడు లోలోన. పైకిమాత్రం నవ్వు పులుముకున్నాడు. తన పాచిక పారనందుకు వుడికిపోతున్నాడు. అయిదువేలు ఎరగా పెట్టి పదివేలు సంగ్రహించవచ్చు ననుకున్నాడు. కానీ అనూరాధ సమయానికివచ్చి అడ్డు పెట్టింది.

'అత్తయ్యను పంపించుతాను! జోగుల్ని వెంట తీసుకునివెళ్ళి.' అని హరికృష్ణ ఏదో అంటున్నా విన్పించుకోకుండానే వరండాలోకి వెళ్ళిపోయాడాయన.

అనూరాధ వెనుకే వస్తోందని గ్రహించాడు.

'ఇదిగో! అమ్మాయ్! హరికృష్ణ నా మేనల్లుడని గుర్తుంచుకుని మాట్లాడ్డం మంచిది. వాళ్ళ అత్తయ్య వస్తుంది. నెల్లూరు వెంటబెట్టుకుని వస్తుంది. తర్వాత మీ యింటికి వెళ్ళిపోవచ్చు నువ్వు — నాకసలు యిలాంటి వ్యవహారాలు చూస్తూంటే అరికాలిమంట నెత్తికెక్కుతుంది — ఆ !'

'మీరు వినేవుంటారేమో బహుశా! స్నేహం ముందు కృత్రిమ బంధుత్వం రంగులు వెలిసిన బొమ్మలా వుంటుంది. డాక్టరుగారికి మతిచెడిన మాట నిజమే. కానీ ఆయన ప్రాణప్రదంగా ఎంచుకునే మధురమైన స్నేహబంధం ఆయన చుట్టూరా అభేద్యమైన కంచుకోటని నిర్మించింది.' మృదువుగా వుందామె స్వరం. కానీ ఆ మాటల్లోని వ్యంగ్యం నిప్పులా చురుక్కుమంది ఆ పెద్దమనిషికి.

క్షణమాత్రం నోరు మెదపలేకపోయాడు. ఎదుట నిలబడి ఏ ఆడంబరమూ ప్రదర్శింపకుండా, గర్వం అన్న మాటే లేకుండా వున్న నగ్న సత్యాన్ని అరటిపండు వొలిచి చేతిలో వుంచినట్లు మృదువుగా విప్పిచెప్పిన ఆమె సంభాషణా సమర్థ్యానికాయనెంతగానో విభ్రాంతుడయ్యాడు.

అయినా ఆయన బాణాలు విసరడం మానలేదు. ఆయన తూణీరంలోనుంచి అతివేగంగా దూసుకు వస్తూనే వున్నాయి.

'వినడానికి యింపుగానే వున్నాయి మాటలు. కానీ 'హరి', అత్తయ్య ముందు కంచుకోట కాదుగదా, ఉక్కుకోట అయినా ఉఫ్ అనగానే ఎగిరి చక్కాపోతుంది. ఎవరు ఎక్కడ వుండాలో అక్కడే వుంటే మంచిది.' ఆ మాటల్లో దాగివున్న భావాన్ని గ్రహించింది అనూరాధ.

ఎదుటిమనిషి హృదయాన్ని తూట్లు పొడిచి వినోదం చూస్తూండడం ఆయనకు అలవాటు అని తెలుసుకుంది.

అంతలో హరికృష్ణ లేచి వచ్చాడు అక్కడికి.

'అరే! రాహువు యింకా వెళ్ళలేదేమిటి? రాధా! చంద్రుణ్ణి పూర్తిగా మింగివేసేట్టున్నాడే?!' అన్నాడు రామనాథంగారి వంకచూస్తూ.

ఆయన అవమానభారంతో వూగిపోతున్నాడు. హరి వంకచూసి విషపునవ్వు నవ్వి అన్నాడు —

'నీకు మతిపోయిందా లేక పోగొట్టబడిందో అర్థంగావడం లేదురా హరీ!'

అనూరాధ కనులలో ఆగ్రహం మెరుపులా మెరిసింది. కానీ పెదవులు కదలనే లేదెంతసేపటికీ. తానాశించినట్లు ఆగ్రహం విరుచుకు పడుతుందనుకున్న ఆ వ్యక్తి కామె మౌనం ఆశాభంగాన్ని కలిగించింది. ఇంకా యింతకన్నా పెద్ద నిష్ఠూరాలనే వినవలసి వస్తుందని, అందుకిది నాంది అని అనుకున్నదా అనురాగమయి.

'సరే! నేను వెళ్తున్నాను హరీ!' అని సెలవు తీసికొన్నాడాయన. హరికృష్ణ ఆయన వెళ్ళగానే లోనికి వెళ్ళిపోయాడు 'పాపం, పారిపోయాడు,' అంటూ. అనూరాధ ఎంతోసేపు అలాగే నిల్చుండి పోయింది.

శారదవచ్చి 'అనూ! అలా వున్నావేమిటి?' అని ప్రశ్నించేవరకూ అలాగే వుందామె.

'ఏమీ లేదక్కా! ఇంతకుముందు వో క్షణం క్రింద పవిత్రమైన స్నేహాన్ని ఘోరంగా పరాభవించి నవ్వుకుంటూ వెళ్ళిపోయాడో పెద్దమనిషి'. గంభీరత వెనుక వ్యథ అలలా కదిలింది.

అంతలో జోగులు వచ్చి 'రామనాదంగారు వచ్చారమ్మా,' అని చెప్పాడు. శారద జరిగిన దేమిటో వూహించ గలిగింది. బరువుగా నిశ్వసించింది.

'చూడు! అనూ! ఈ నీ అక్కయ్య వుండగా నిన్నెవరూ ఏమీ చేయలేరు. మొరిగేకుక్కలు కరవవు' అని గుర్తుంచుకో — బావ జీవితాన వెలిగిన ఆశాకిరణానివి — నువ్వు! ఏవో అర్థంలేని మాటల్ని విని మనస్సును రాయిగా మార్చుకోకు. మంచితనానికి పరీక్ష ఎప్పుడూ వుంటుంది. నిజమైన స్నేహం



విషయాలకు లొంగడు.' అన్నది శారద.

అనూరాధ 'నిజమే ! కాని తుఫాను ఆరంభమైందక్కా! డాక్టరుగారి అత్తయ్య వస్తుందట.' అన్నది.

'ఎవరూ ? శకుంతల అత్తయ్య వస్తుందా ? బహో ! ఆవిడ నిజంగా శనిగ్రహమే అనూ ! సరే ! కానివ్వు ! ఆ ! నీరజ కబురంపించిందమ్మా ! అన్నయ్య రాలేదేందుకని' అంటూ. మరి నో సారి వెళ్ళి యీమాట చెప్పకుండా

# ఆరాధన

పూరడించి రావాలి ! లేకపోతే మరో వ్యధతో కుమిలిపోతుంది. అన్నయ్య కేమైందో నన్నభయంతో.'

అనూరాధా, శారదలా సాయంత్రమే బయల్దేరారు. హరికృష్ణను చూస్తుండ మని నౌకరు జోగులుకు పదిసార్లు చెప్పింది అనూరాధ. శారద నో నర్సును రప్పించింది, వాళ్ళు తిరిగి వచ్చేంతవరకు హరికృష్ణ దగ్గర వుండడానికని.

నీరజ ముఖాన ఆనందరేఖలు పరుచు లెత్తాయి అనూరాధను చూడగానే. ఆమెకు అన్నకు జరిగిన ఘోరమైన ప్రమాదం సంగతి తెలియదు. అనూరాధ వచ్చి అప్పటికి పదిహేనురోజులైందనీ ఎరుగదు. అన్న హరికృష్ణ, అన్నాళ్ళ రానందుకు కోపం వచ్చింది. 'అన్నయ్య రాలేదా ?' అని అడిగింది.

అబద్ధం ఆడక తప్పలేదు శారదకు. హరికృష్ణ ఏదో పనిమీద బొంబాయి వెళ్ళాడనీ, తిరిగి రావడానికి నో నెల పడుతుందనీ చెప్పింది, నీరజ నిజమేనను కుంది. ఆమె ఆరోగ్యం నానాటికి దిగజారి పోతోందని గ్రహించారా అక్కా చెల్లెళ్ళు.

ఆ తరువాత నీరజను వప్పించుకొని మరో అరగంట గడిపారు, అనూరాధను మళ్ళీ రమ్మని ప్రోదించిందామె.—

'అనూరాధ యిక వెళ్ళలేదమ్మా ! మీ అన్నాచెల్లెళ్ళు కలిసి బంధించివేశారు.' అన్నది శారద ఉదారాన్ని పరిహాసంతో జోడించి. నీరజ అది పరిహాసమే అను కుంది. అందుకే 'మరి దానుతోనే వుండి పోకూడదా! నాకోసమైనా?' అని అడిగింది అనూరాధను.

'ఉంటాను నీరజా ! తప్పకుండా వుంటాను!' అంది అనూరాధ నీరజ చేతుల్ని ఆప్యాయంగా నవరించుతూ. ఆ సమా ధానం ఆ శాపగ్రస్తురాలి హృదయానికి ఎంతో ఆహ్లాదాన్ని కలిగించింది.

చీకట్లు అలుముకుంటూండగా బయలు దేరారు అక్కా చెల్లెళ్ళు. వాళ్ళు యిల్లు చేరేసరికి హరికృష్ణ మేడపైన పెద్దగా అరిచి గొడవజేయడం విన్పించింది.

'పూజారికి పూనకం వచ్చిందనుకుం టానే! అనూ! తొందరగా వెళు తల్లీ! నతీల్ ఎదురు చూస్తుంటారు నా కోసం. ఇంకా వంట నే చూడ వెళ్ళి! ప్రొద్దు బోయింది.' అంటూ శారద సెలవు దీసి కొంది.




ఆఫ్రికా గుర్రాలు జీబ్రాలు. జీబ్రాకి గుర్రానికి వర్ణ విశేషం తప్పిస్తే తేడా లేదు. జీబ్రా శరీరంమీద ప్రస్ఫుటంగా, నలుపు, తెలుపు చారలు కన్పిస్తాయి. జీబ్రాల్లో కూడా కొన్ని జాతులున్నాయి. శరీరం మొత్తం మీద, చెవులు పరిమాణం, గిరల పద్ధతి ఇందుకు సహాయపడుతాయి. మన వేలి ముద్రలు ఒకరివి మరొకరివి ఎలా పోలవో, అలాగే వీటి శరీరంమీద చారలు కూడా వ్యక్తిగతంగా భిన్నత్వం కొంచెమయినా కల్గి ఉంటాయి.

జీబ్రా శరీరవర్ణం అంత గంభీరంగా ఉన్నా తగు సమాయాల్లో అస్పష్టంగా ఉండి రక్ష ణకు ఆస్కారం ఇస్తుంది. రోడ్ల అంచుల మలుపుల్లో, రహదారి శాఖవారు తెలుపు నలుపు రంగులు వేసిన రాళ్లను పాతి ఉంచు తారు. ఒక విధమైన నిరాకృతిని, నిర్జీవత్వాన్ని అక్కడ రూపొందిస్తాయి. ఈ చారలు వెనక ఉండే దృశ్యాన్ని చీలుస్తాయి. మంచి వెన్నె లలో కూడా నిశ్చలంగా ఉండే జీబ్రా దగ్గరనే ఉన్నా చూపుకు ఆనదని, ఎత్తైన గడ్డి మొక్కలలో అసలే కనపడదని వేటగాళ్ళు, ప్రకృతి దర్శకులు అంటారు.

పులితోలు కప్పిన గాడిద కథ వినే ఉం టారు. జీబ్రాని అక్షరాలా వ్యాఘ్రాశ్వము అంటారు అక్కడి వాళ్ళు. దాని గీలలు పులి ఆకారాన్ని, శరీరంగుర్రం ఆకారాన్ని కల్గి ఉండడమే దీనికి కారణం. జీబ్రాలు సాధార ణంగా గిరాఫీ, ఉష్ట్రపక్షి, సింటిలోపు, మొదలైన సాధుజంతువులతో కలిసి జీవిస్తూ ఉంటాయి. గుంపులో సంచరిస్తూ ఉండే వీటికి ఒకటి కాకపోతే వేరొకటి అయినా జాతిది శత్రువుల ఉనికిని కనిపెట్ట గల్గుతాయి రక్షణకే ఈ వసుపాయాన్ని కల్పించు కొంటాయి.

క్వాగ్గా అనేది ఒక జాతి జీబ్రా. సుమారు వంద సంవత్సరాల క్రితం నిశ్శేషమయింది. దాని మాంసం రుచిగా ఉంటుందని పూర్తిగా దాన్ని వేటాడి చంపి వేశారు. దాని శరీరం దృఢంగా ఉండేది. దాని శరీరంముందు భాగాన మాత్రమే చారలుండేవిట. ఇప్పుడు దాని చర్మం కాని, ఫోటోలు కాని, దొరకడం లేదు.

అనూరాధ లోన అడుగు పెట్టగానే హరికృష్ణ బుంగమూతి పెట్టుకుని కూర్చున్నాడో మూల. అంతవరకూ అరిచి గోలచేస్తున్నా వాడల్లా ఆగిపోయి. నర్సు సెలవుదీసికొని వెళ్ళిపోయింది. జోగులు 'నిదరొస్తోందంటూ క్రిందికి వెళ్ళిపోయాడు. అనూరాధ హరికి కోపం వచ్చిందని గ్రహించింది.

క్రింద విసిరివేయబడిన పుస్తకాలనూ' తలగడలనూ, తీసి ఎప్పటిలా సర్దింది. అంతవరకూ నోరు విప్పనేలేదా డాక్టరు.

అమ్మకోసం అలిగిన పసిబిడ్డలా ముఖం ముడుచుకుని కూర్చున్నాడు మంచ మీద ఓ మూల. అనూరాధ కూడా అతని నేమీ మాట్లాడించనేలేదు. భోజనం తెచ్చి టేబిల్ మీద వుంచి 'రండి', అన్నది.

'రాను. ఏం చేస్తావేమిటి! నువ్వంటే నాకేం భయం లేదు. తెలుసా? నీ మాట వినను! ఆ! అంతే!' కోపం తో మెట్టు దిగబోతోంది.

'వినక్కర్లేదండి! ఆకలివేసినప్పుడు అన్నం తినకపోతే ఆరోగ్యం చెడిపోతుంది. మీరు అన్నం తినకపోతే నేనిక్కడ నుంచి వెళ్ళిపోతాను.'

ఆ మాట అనగానే లేచి వచ్చాడు హరికృష్ణ. ఏం తింటున్నాడో తెలియడమే లేదతనికి. అయిదు నిమిషాల్లో భోజనం పూర్తయిందనిపించాడు. మధ్యలో మాట్లాడించితే మళ్ళీ ఏం గొడవ వస్తుందోనని మౌనంగానే వుండిపోయింది అనూరాధ అంతసేపూ.

ఆ రాత్రి అతనాపైన ఎక్కువగా విసిగించకుండానే నిదురపోయాడెందుకనో. వంటయిల్లు సర్ది తాళం వేసి వచ్చేసరికి పది గంటలు కొట్టింది గడియారం. అలసిన ఆ అనురాగమయి హృదయం విశ్రాంతిలో విలీనమై పోయింది నడుం వాల్చగానే.

(ఇంకా ఉంది)

# వారఫలం

## 21-8-1970 శుక్రవారం మొదలు 27-8-1970 గురువారం వరకు

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృషభం:** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన శ్రమ కలుగుతుంది. అధికవ్యయం జరుగుతుంది. వారంమధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారంమధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. వారం ఆఖరులో మీరు ప్రయోజనంలేని శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు—సాటివారిలో గౌరవం లభించగలదు. అధికవ్యయం జరుగుతుంది.

**సింహం:** అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**కన్య:** నమ్మిన వారివల్ల శ్రమకు గురి కాగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**తుల:** ప్రయత్నించిన ప్రతి పని సులువుగా నెరవేరుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. వారంమధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**వృశ్చికం:** వ్యాపారంలో సాటివారితో పోటీ పెరుగుతుంది. అనవసరం కోసం వ్యయం చేస్తారు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. వారం ఆఖరులో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండక పోవచ్చును.

స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:** వృత్తిలో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మకరం:** కొన్ని వ్యవహారాల్లో ఆదాయం కన్న ఖర్చులు అధికంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువులకు సహాయం చేయగలరు.

**కుంభం:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. నిజమైన సాంగత్యం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం:** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు—ప్రయాణాలోచనలు చేస్తారు. సాటివారితో గౌరవం లభిస్తుంది.

—మహేష్

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## కొత్తరకం పోటీ!

# 1970 దీపావళి కథలపోటీ!!

# రు. 5000 బహుమతులు

## ఇంకా ఇతర ప్రత్యేక బహుమతులు!!

**ఈ ఏడు దీపావళి కథలపోటీని సరికొత్తరకంగా నడపటానికి నిశ్చయించుకున్నాము!**

**ప్రతి సంవత్సరం మూడు కథలకి మూడు బహుమతులు ఇస్తున్నాము.**

**ఏ కథలు ఉత్తమమయినవో మేమే నిర్ణయిస్తున్నాము.**

ఈ ఏడు ఈ పద్ధతులని మార్చివేస్తున్నాము! ఈ ఏడు దీపావళి కథలపోటీకి వచ్చిన కథలలో పదింటిని (10ని) ఉత్తమ కథలుగా ఎన్నుకుంటాము. ఈ కథలలో ఒక్కొక్కదానికి రు. 500 బహుమతి చొప్పున ఇస్తాము. ఈ బహుమతుల పంపిణీ బాలట్ నిర్వహణకి ముందే జరుగుతుంది. ఉత్తమకథలుగా ఎన్నికఅయిన 10 కథలనీ దీపావళి ప్రత్యేకసంచికలో మొదలుపెట్టి వరుసగా ప్రచురిస్తాము. వీలునిబట్టి సంచికకి మూడు నాలుగు కథలు వేస్తాము. ఈ 10 కథలు ప్రచురించే వరుసని లాటరీద్వారా నిర్ణయిస్తాము. అంటే ఒక కథ ముందు పడినంత మాత్రాన అది తర్వాతపడిన కథలకన్నా ఉత్తమమయినదనే సూచన ఉండటానికి అవకాశం ఉండదన్నమాట.

## *పాఠకుల నిర్ణయం : బాలట్*

పయిన చెప్పిన విధంగా అచ్చుఅయిన 10 కథలలో ఏవి ఉత్తమమయినవో పాఠకులే నిర్ణయించటానికి ఒక బాలట్‌ని ఏర్పాటు చేస్తాము. పాఠకులకి ఈ బాలట్ ఆసక్తికరంగా ఉండేందుకు, బాలట్—పోటీని ఒకదానిని కూడా నెలకొల్పుతాము. ఈ పోటీ వివరాలు బాలట్ ప్రకటనతోబాటు; 10 కథల ప్రచురణ పూర్తి అయిన తర్వాత, ప్రచురిస్తాము! పాఠకుల ఎన్నిక ప్రకారం మొదటి మూడు ఉత్తమకథలుగా నిర్ణయింపబడ్డ కథలకి మళ్ళీ ప్రత్యేక బహుమతులని ఏర్పాటు చేస్తాము. ఈ బహుమతుల వివరాలు బాలట్ ఫలితాలతోబాటు వెల్లడిస్తాము. రచయితలందరూ మాతో సహకరించి ఎప్పటిలాగే ఈ సంవత్సరం దీపావళి కథలపోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

## నిబంధనలు

1. కథలు ఇంతకుముందు ప్రచురణకాని స్వంతరచనలై ఉండాలి. ప్రతికథతోనూ రచయిత అది తన స్వంతరచనేనని, దేనికీ అనువాదం కానీ, అనుసరణకానీ కాదని హామీ రాసి పంపాలి. ఈ హామీలు వేరే కాగితంమీద కాకుండా కథ వ్రాతప్రతిమీదే రాసి ఉంచాలి.

2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3. వ్రాతప్రతిమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒకవైపుమాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు, పూర్తి చిరునామాకూడా వ్రాతప్రతిమీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సైజు నోట్‌బుక్‌కి రెండురెట్లు) పేజీలకి మించరాదు.

4. కవరుమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్రవారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1'కి పంపాలి

5. పోటీ గడువుతేది 31-8-'70. ఆ తర్వాత మా కార్యాలయానికి చేరిన కథలను మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా వెలువడే 30—10—70 తేదీగల ఆంధ్ర సచిత్రవారపత్రికలో ప్రారంభించి వరుసగా ప్రచురిస్తాము.

7. 10 ఉత్తమ కథల ఎన్నికకి సంబంధించిన తుది నిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకునిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపటానికీ వీలు ఉండదు.

8. బాలట్‌తోబాటు ఎటువంటి పోటీ నెలకొల్పబడినా ఆ పోటీకి సంబంధించిన తుది నిర్ణయాలన్నీ ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకునివే. ఈ విషయమై ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలు జరుపటానికీ వీలు ఉండదు.

9. కథల వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపటానికి సాధ్యంకాదు. (అందుచేత కథలపోటీలో పాల్గొనే వారు తపాలాబిళ్ళలు అతికించిన స్వంత చిరునామాగల కవర్లు పంప నవసరంలేదు.)

10. పోటీలకి సంబంధించిన ఏ విషయం గురించీ ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించేముందు తెలుపుతాము.

# నేనేం చేయ్యగలిగాను!



త ప్పులు చేయటం మానవ సహజం, తరువాత పశ్చాత్తాప పడటమూ, మానవ సహజమే! అలా అని అందరూ తప్పులు చేస్తారా? చేయరు. సాధారణంగా నేరం చేసిన ప్రతి వ్యక్తి శిక్షింపబడతాడు. విచిత్రం— ఏ నేరమూ చేయకుండానే కొందరు వ్యక్తులు శిక్షింపబడటం కద్దు.

నా కళ్లెదుట జరిగిన ఒకానొక సంఘటన నా హృదయంలో చెరగని ముద్ర వేసుకుపోయింది.

ఆ రోజు నాకు బాగా గుర్తు!

సాయంకాలం అయిదయింది. అయిదయిందంటే నాకెందుకో చాలా సంతోషం వేస్తుంది. అంతవరకు అణిగిమణిగి వున్న నా ఆనందం, వెల్లువలాగ విజృంభించాలని చూస్తుంది. మళ్లీ రేపు పదింటిదాక, యిక్కడ బంధింపబడను కదా అని!

టేబుల్‌మీద చిందర వందరగా పడున్న ఫైళ్లన్నీ సర్ది డ్రాయర్లో పెట్టి ముఖ్యమైన ఫైలొకటి తీసుకొని డ్రాయరు తాళంవేసి, ఆఫీసరుగారితో చెప్పి బయల్దేరేను.

ఆయనంటారు కదా, 'ఏమయ్యా వాసూ ... సెక్షను ఆఫీసరువి కదా — అంత తొందరగా వెళ్లకపోతే యేం?'

నేను నవ్వి వూరుకొంటాను.

అలా అని ఆయన అన్నప్పుడల్లా నా మనసు మధురమైన తలపులతో నిండిపోతుంది. ఆ తీయని స్మృతుల వెనుక మాధవి మనోహర రూపం తళుకు తీనుతూంటుంది. ఆఫీసునుంచి అలసిపోయి వచ్చే నన్ను, లాలించి మురిపించే అందాల రాశి.

నవ్వొచ్చింది. నా భార్యని నేనే పొగడుకుంటున్నాను. అంతలోనే సర్దుకొన్నాను. అవును—ఆ హక్కు నాకు భగవంతుడూ, మాధవీ ఇద్దరూ యిచ్చేరు.

ఆలోచనల నణచుకొని బస్సుస్టాపులో వచ్చి నిలబడ్డాను. ఈ భాగ్య నగరంలోని సిటీ బస్సులతో మహాచెడ్డ చిరాకు. ఎప్పుడూ రద్దీగానే వుంటాయి. అందులో ప్రొద్దునా సాయంకాలమూ మరీ! విద్యార్థులు లెక్కలేనంతమంది ఎక్కుతారు. ఎక్కటానికీ, కూర్చోటానికీ, చివరకు

దిగటానికి కూడ స్థలం వుండదు. అయిదు నిముషాలు గడిచింది. బస్సు వచ్చింది. నా అదృష్టమో అన్నట్లు అది కొంచెం ఖాళీగానే వుంది. తొందర తొందరగా బస్సెక్కి ముందరి సీట్లలో కిటికీ దగ్గరగా కూర్చున్నాను. బహుశా నా సీటు డ్రైవరు కాబిన్ దగ్గరనుంచి నాలుగోది అనుకొంటాను. నా వెనకాల యింకా కొంతమంది బస్సెక్కేరు. నా ముందరి సీట్లో ఇద్దరు విద్యార్థులు కూర్చుని వున్నారు.

బస్సు మెల్లగా కదిలింది గర్భిణి స్త్రీలాగా.

కిటికీలోనుంచి బయటకు చూస్తూ... కూర్చున్నాను. నాలుగుకోట్ల ప్రజల రాజధానీ నగరమైన, ఈ ముచ్చటైన భాగ్యనగరం వివిధ సంస్కృతులకు, భాషలకు, జాతులకు నిలయమై వింత వింత సోయగాలను సంతరించుకొంటోంది నేడు.

సాయంకాలాలలో అందంగా అలంకరించుకొని ప్రియతముడికోసం ఎదురు చూసే పడతి మనసు ఎంత చల్లగా హాయిగా మధురంగా వుంటుందో — అలా వుంటుందీ హైదరాబాదు.

మాధవి ఏం చేస్తూంటుందిప్పుడు? బహుశా... నా కిష్టమైన, రోజ్ కలర్ బోరిక్ కాటన్ చీర కట్టుకొని, దానికి మాచ్ అయ్యే బ్లౌజుతో, వాలు జడలో చోటు లేనట్లుగా అమర్చబడిన సన్నజాజి పూలతో, బాల్కనీలో వాలు కుర్చీలో కూర్చొని, చేతిలో 'నారాయణరావు' పేజీలు త్రిప్పుతూ నా గురించే ఆలోచిస్తోందేమో!

'ఒరేయ్ ప్రసాద్! నిన్న చిక్కడపల్లి వెళ్ళేనురా! సరళ— నీ గురించి ఎంత అడిగిందని?'

ముందరి సీట్లోని విద్యార్థి దగ్గర గొంతు, నా ఆలోచనలను భగ్నం చేసింది.

ఎదుటివారి మనస్తత్వాలను వారి మాటలనుబట్టే తెలుసుకోవచ్చునని నా అభిప్రాయం. మాధవి అంటూ వుంటుంది, 'మిమ్మల్ని యే పోలీసు డిపార్టుమెంటులోనో వెయ్యాల్సిందండీ' అంటూ. నవ్వి ఊరుకొంటాను.

వారి మాటలను జాగ్రత్తగా వినసాగేను.

'అమ్మ బాబోయ్! వాళ్ళింటికే! బాప్రే నేను చచ్చానురా' ప్రక్కనున్నతను భయం అభినయిస్తూ అన్నాడు.

'పోరా—సరళ ఎంత మర్యాద చేసిందనుకొన్నావ్! వాళ్ల అన్నయ్యలు కూడ చాల ఆదరంగ మాట్లాడేరు—' మొదటి అతను.

'ఏరోయ్ ఏమిటీ కథ?' ప్రసాద్ అనే అతను కొంటెగా అన్నాడు.

'ఛ ఛ కథ లేదు ఏమీ లేదురా! సరళ బాపిరాజుగారి 'శాంతిశ్రీ' లాగ వుంటుంది గదరా. ఆమె 'అడివి శాంతిశ్రీ' అయితే నేను...' అతని మాటలు బస్సు హారనులో వినపడలేదు.

నవ్వుకొన్నాను. ఇంత చిన్న వయసులోనే 'అడివి శాంతిశ్రీ' చదివేడా ఇతను? భావుకుడిలాగున్నాడు. మాధవి నేనూ ఆ నవలని ఈ మధ్యనే పోటీలుపడుతూ చదివేము. అడివి బాపిరాజుగారి నవలలంటే మాధవికి చాలా యిష్టం. ఆయన నవలలు చాలా బాగుంటూ యుంటుంది. నాకుమటుకు 'హిమబిందు' నచ్చిన నవల. విశ్వనాథవారి 'వేయి పడగలలోని' గిరికా, బాపిరాజుగారి 'హిమబిందు'లోని హిమబిందూ మరువలేని పాత్రలు నా దృష్టిలో.

బస్సు యింకో స్టాపులో ఆగింది. దిగినవారికి నాలుగింతలు మంది బస్సెక్కేరు. పూర్తిగా వోవర్‌లోడయిపోయింది. ఫుట్‌బోర్డు మీదకూడ వ్రేలాడుతున్నారు. విపరీతమైన రణగొణ ధ్వనిగా వుంది. కండక్టరు మొదటి టికెట్ యిచ్చేడంతే! మళ్ళీ అయిపులేడు.

బస్సు కదిలింది.

వాళ్ళిద్దరూ ఏమీ మాట్లాడటంలేదు. కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చున్నారు.

ఇంతలో బెల్లు అదేపనిగా మ్రోగసాగింది. వెనుతిరిగి చూసేను; చిన్నా పెద్దా అనే తారతమ్యం లేకుండా అందరూ దాంట్లో భాగం పంచుకొంటున్నారు. కండక్టరు ఎక్కడ వున్నాడో కనుపించలేదు. అతనితో నిమిత్తం లేకుండా, వెనకాలవాళ్ళే బెల్ కొడుతున్నారు. రణగొణధ్వని ఎక్కువయింది. బస్సుని ఎక్కడా ఆపటంలేదు డ్రైవరు. స్పీడుగా పోనిస్తున్నాడు. బస్సు గౌలిగూడ దాటింది.

ముందరి సీట్లోని విద్యార్థు లిద్దరూ హఠాత్తుగా లేచేరు; 'అదిగోరా రామచంద్రాపురం బస్సు, తొందరగా దిగుదాం' అని అనుకొంటూ. బెల్ యింకా మ్రోగుతూనే వుంది. వాళ్ళిద్దరూ దోవచేసుకొంటూ డ్రైవరు కాబిన్‌లోకి వెళ్ళేరు దిగటానికి.

బస్సు ఒక్కసారిగా ఆగిపోయింది పెద్ద కుదుపుతో. ఒకతను గబ గబ దిగిపోయేను. రెండో అతను దిగబోతుంటే డ్రైవరు సీట్లోనుంచి లేచి వచ్చి అతని చెయ్యి పట్టుకొన్నాడు.

ఆశ్చర్యంగా చూస్తున్నాం అందరమూ. రణగొణ ధ్వనంతా తగ్గిపోయింది.

'కైకూ మారే బెల్?' కఠినంగా అడిగాడు డ్రైవరు.

'నేను కొట్టలేదు. వెనకాల వాళ్ళు కొట్టేరు. వెళ్ళి వాళ్లనడుగు. మా స్టాపొచ్చింది దిగుతున్నాం. చెయ్యి విడు మర్యాదగా.' అన్నాడతను చెయ్యి విదిలించుకొంటూ.

డ్రైవర్ విడిచిపెట్టలేదు. 'అబ్ పోలీస్ స్టేషన్‌కూ జాయింగే' అన్నాడు కరుకుగా.

'పద అనవసరంగా నన్ను పట్టుకొన్నావు, ఇనస్పెక్టరు దగ్గరే నీ చేత నిజం కక్కిస్తాను.'

వాళ్ళిద్దరూ దిగిపోయేరు. దిగ్భ్రాంతుడినై చూస్తుండిపోయేను. బస్సులోని మిగతావారి పరిస్థితి కూడ దాదాపు నా మాదిరిగానే వుంది. కిటికీలోనుంచి బయటకు చూసేను.

దగ్గరలో వున్న పోలీసు స్టేషనులోకి వెళుతున్నారు వాళ్ళిద్దరూ. కండక్టరు కూడ బస్సు దిగి వారిని వెంబడించేడు.

బస్సులోని వారందరూ దిగిపోవటం మొదలు పెట్టేరు. నేనూ దిగేను. కొందరు కోఠీ వేపు సాగిపోతున్నారు. మరికొందరు పోలీసు స్టేషను కిటికీ దగ్గర నిలబడి చూస్తున్నారు.

ఏం జరుగుతుందో అనే కుతూహలంతో వారికి కొంచెం దూరంలో నిలబడ్డాను. లోపలినుంచి మాటలు వినపడసాగేయి. చెవియొగ్గి వినసాగేను.

'సార్! ఇతను వెనకాల సీట్లో కూర్చుని అదేపనిగా బెల్ కొట్టి అల్లరి చేస్తున్నాడు. పైగా కొట్టలేదని బుకాయిస్తున్నాడు.' డ్రైవరు కంప్లైంటు

వేసేను.

'నో సర్! మా స్టాపు వచ్చింది. మే మెళ్లే బస్సుకూడ రెడీగా వుంది. వెనకాలవాళ్లు బెల్ కొడ్తుంటే డ్రైవరు బస్సాపేశాడు. అందుకని మేము దిగబోయేము. మా ఫ్రెండు దిగేలేదు. నేను దిగబోతుంటే నన్ను పట్టుకున్నాడితను. నే నసలు బెల్లు కొట్టనే లేదు.' అన్నాడతను గట్టిగా.

'నై సాబ్. చాలా దూరంనుంచీ వస్తున్నాడు. బెల్‌కొట్టి అల్లరిచేసి పట్టుకొంటామేమో అని పారిపోతున్నాడు' అన్నాడు డ్రైవరు.

'నో సర్ సత్య ప్రమాణంగా చెబుతున్నాను. నే నసలు బెల్ కొట్టనే లేదండి' ఆవేశంగా అన్నాడతను.

'మీ రిద్దరూ వెళ్లిపొండి.'

ఇనస్పెక్టరు డ్రైవరుతోనూ, కండక్టరుతోనూ చెప్పేడు. వాళ్లిద్దరూ బయటకు వచ్చేసేరు.

'కావాలంటే వారిని అడగండి సార్. నే నసలు బెల్లు కొట్టలేదు. నే నిలాటి అల్లరిపనులు చేయనండి. ప్లీజ్ నన్ను నమ్మండిసార్' అతను ఏమేమో అంటున్నాడు.

'ఎవర్నీ అడగం. మీ ఫ్రెండెందుకు దిగిపోయేడు? ఏ తప్పూ చేయందే అత నెందుకు దిగిపోతాడు? రిపోర్టు రాస్తున్నాం.' కరకుగా అన్నాడినస్పెక్టరు.

'మా మదర్‌సాక్షిగా చెబుతున్నాను సర్. నే నసలు బెల్లు కొట్టలేదు నన్ను నమ్మాలి మీరు.'

బస్సు వెళ్లిపోయింది. కొందరు దాంట్లో వెళ్లేరు. మిగిలిన వో పదిమందీ ఇంకా అక్కడే నిలబడి చూస్తున్నారు. నేనూ వెళ్లలేక పోయేను.

ఫెడీల్‌మని దెబ్బ, 'మాకీ కసమ్ ఖా బోల్‌రేజీ' అన్న పోలీసు కంఠమూ విన్పించేయి.

విశ్వేష్టుడినై చూసేను. ఉద్రేకంగా అడుగు ముందరికేసేను. మనసు హెచ్చరించింది. 'ఇది పోలీసు స్టేషను. నీలాటి పరువు మర్యాదలుగల వ్యక్తి అడుగు పెట్టకూడని స్థలం' అని. వేసిన అడుగు యాంత్రికంగా యథాస్థానంలోకి వచ్చింది.

సన్నగా యేడుస్తున్న అతనికంఠమూ,

# నేనేం చేయగలిగాను

'అయిదు నిముషాలు కూర్చోబెట్టి పంపించవోయ్' అన్న ఇనస్పెక్టరు కంఠమూ విన్పించేయి.

కిటికీదగ్గర నుంచుని చూస్తున్న వారంతా లోపలికి వెళ్లేరు. నేను కొంచెం ముందుకు జరిగేను.

అతను బెంచీమీద కూర్చుని వున్నాడు. కళ్లనుండి ధారాపాతంగా కన్నీళ్లు వర్షిస్తున్నాయి.

'జాన్‌దేవ్ సాబ్. విడిచిపెట్టెయ్యండి సర్' అందరి నోళ్లలోనుంచి ఒక్కసారిగా వచ్చింది.

వారందరినీ బయటకు వెళ్ళేసేరు.

అయిదు నిముషాలు గడిచింది. అతను బయటకు వచ్చేడు. చుట్టూ మూగేరందరూ!

ఒక డంటున్నాడు. 'ఏడుస్తారుటయ్యా. ధైర్యంగా చెప్పాలిగాని' ఇంకొకడు 'డ్రైవరుని, కండక్టరుని విడిచి పెట్టకుండా వుండవలసింది.' అతను కళ్లు తుడుచుకుంటూ, 'ఏడవక ఏం చెయ్యమంటారు. ఎప్పుడూ పోలీసుస్టేష [illegible] అడుగు పెట్టని వ్యక్తిని. ఈ నాడు [illegible] తప్పుకు వెళ్లి దెబ్బ తినాల్సి వచ్చింది.' అని కొంపొందు బయటకు రాసాగేడు.



"అవును డాక్టర్! వీడు మా పెద్దాడు! వాడు పెద్ద మనమడు! ముగ్గురమూ ఆపరేషన్ చేయించుకోడానికి వచ్చాం!"

అంగగూ ఎవరికోసన వాడు వెళ్లిపోతున్నారు.

అతను కోపేవు దారితీసేడు.

నేనూ అతని వెనకాలే నడిచి, చేతులు తట్టి పిలిచి, 'ఏం జరిగింది, ఏమన్నారు?' అడిగాను తెలియనట్లుగా.

అతను ఆగి—'అయిదు నిముషాలు కూర్చోని వెళ్లమన్నారండీ వారందరినీ చూడండి. నే నొక్కడినీ స్టేషనులోకి వెళితే ఒక్కడు లోపలికి వచ్చేడుకాదు. వాళ్లకి తెలియదూ నేను బెల్లు కొట్టలేదనీ? పుట్టినదాదిగా ఎవరిచేతా దెబ్బ తినని వాడిని. ఈనాడు చెయ్యని తప్పుకు పోలీసుచేత దెబ్బ తినాల్సొచ్చింది. ఎవరైనా ఒక్కరువచ్చి చెబితే...నన్ను విడిచేవారు కాదూ? అందరూవున్నా వొంటరినై పోయేను. మా ఫ్రెండు వెళ్లిపోయుంటాడు. ఒక్కడూ హెల్ప్ చేయలేదు కాని నీతులు చెబుతున్నారు. నీతులు' గొణుక్కుంటూ వెళ్లిపోయేడు.

నేను అలాగే చూస్తూ నిలబడ్డాను.

అవును—గొప్పవాళ్లం, సంస్కారంగలవాళ్లం అని మనల్ని మనమే అందలమెక్కించుకొంటున్నాము. పోలీసు స్టేషనులో అడుగుపెడ్తేనే పరువు పోతుందనుకొనే దేశం మనది. ఈ భారత దేశంలో నాకే కాదు—మరే వ్యక్తికీ ఒకరి తరుపున వకాల్తా పుచ్చుకునే సాహసం వుండదేమో!

రొమ్ము విరుచుకొని సగర్వంగా చెబుతున్నామే భారతీయులమని, ఇదేనా భారతీయత్వం.

ఆ బస్సులో అతని వెనకాల సీట్లో కూర్చుని, నిజం తెలిసిన నేనే వెళ్లి చెప్పలేక పోయేను. తప్పు చేసిన మిగతావాళ్లు చేస్తారా సహాయం? నేనేకాదు—మాలో ఎవ్వరు వెళ్లిచెప్పినా, ఆ ఇనస్పెక్టరు అతనిని ఏమీ అనకుండా విడిచేసేవాడేమో! నా హృదయం ఘోషించింది. అతనికి నేనేం చెయ్యగలిగాను? తప్పు అతను చెయ్యలేదని తెలిసీ ఏమీ చెయ్యలేక పోయేను.

అవును. నేనేం చేయగలిగా నతనికి!

నేనేం చేయగలిగాను?

నేనేం చేయగలిగాను? ●

# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు




మృగాంకదత్తుడు ఇలా ఉజ్జయినికి పోతూ వుండగా దారిలో ఒక అడవి వచ్చింది. దానిలో నీరు లేదు. మండే ఎండ. దారి విషమం. దప్పితో గొంతుక ఆరిపోతూ వుంది. అలసట ఏర్పడింది. ఎలాగో ఆ విషమమైన దారి దాటి పోతుండగా ఒక కొలను కనిపించింది.

అది చాలా దూరం వ్యాపించిన పెద్ద కొలను. ఆ తుమ్మెదల ఝుంకార గీతాలకు సంతోషంతో పులకించి అలసిన నేత్రాలను పోలె రేకులున్న కలువలు ఉన్నాయి. వాటిని చూస్తే సరస్సు లక్ష్మీదేవికి కృష్ణవక్షఃస్థల ప్రీతిని (కృష్ణుని వక్షఃస్థల నివాసంలో ప్రీతిని, నల్లని వక్షస్థల కాంతిని) కలిగిస్తున్నట్లు అనిపించింది. హంసలు బారులుకట్టి తరగల నురగలపై విహరిస్తున్నాయి. దానిని చూడగా, సముద్రమే చంద్రమండల మధ్య ప్రవేశంతో వున్న అమృతపు పెనుతరగలతో పాటు అక్కడికి వచ్చిందా అన్నట్లుంది. వర్షాకాల మేఘాలలాగ నల్లగా వున్న వరాహాలు సరస్సులో మునిగి [illegible] ఆడుతున్నాయి. ఆ దృశ్యం చూడగా, చక్రవాక పక్షుల వియోగాగ్ని పొగలు ముద్దకట్టి నీటి మధ్యన పడి వున్నాయా అన్నట్లుంది. తామరాకులమీద నీటి బిందువులు కదులాడుతూ ఆ ముత్యాల అందాలు చిందులాడుతూండడం చూడగా, సరస్సు ఈ సంసారం తరళం, చంచలం అనిత్యం అని తెలుపుతున్నా అన్నట్లుంది. ఏనుగుల గుంపులు వచ్చి తామరతూళ్లను లాగివేశాయి. అవి తెల్లగా కనిపిస్తున్నాయి. వాటిని చూడగా కుముదినీ కాంతుడయిన చంద్రుని కిరణాలు వేలకొలది వచ్చి పడ్డాయా అన్నట్లుంది.

ఆ సరస్సును చూడగానే వారి కళ్లు విప్పారాయి. వారి అలసట అంతా తగ్గింది. విపులాశయాలు చూడగానే సంతోషం కలిగిస్తాయి. దాని పడమట గట్టున ఒక పెద్దచెట్టు, వేలాది శాఖలున్నది, పండ్లతో నిండినది కనిపించింది. ఆ వృక్షం ఐశ్వర్యం లాగ ఛాయాసహితం (కాంతి యుక్తం, నీడ గలది,) అభిమానంలాగ ఎత్తయినది, సౌహార్దంలాగ సంశ్లిష్టము అయినట్టి (దట్టమైనది), సంతోషంలాగ సౌఖ్యం కలిగించేది, దగ్గరికి వచ్చేవారికి

అనువాదం : తిరుమల రామచంద్ర

సంతాపం పోగొట్టింది, అభిజాతుడయిన రాజులాగ సకలాశలను (ఆశలను—దిక్కులను) నింపేటటువంటిది.

పండ్లతో నిండిన ఆ చెట్టును చూచి, మృగాంకదత్తుని మంత్రులు, ఒక్క శ్రుతధి మినహాగా, అందరూ పండ్లు తిందామనే ఆశకొద్దీ సంతోషంతో తొందర తొందరగా ఎక్కారు. కొమ్మలమధ్యకు చేరగానే కనబడకుండాపోయారు.

మిత్రులు కనిపించకపోగానే మృగాంకదత్తుడు, శోకము చేస్తూ, వారి వియోగం భరించలేక మూర్ఛతో భూమి మీద కూలి పోయాడు. శ్రుతధి అతనికి చిగురుటాకుల వీవనతో విసిరాడు; మృగాంకదత్తుడు నెమ్మదిగా మూర్ఛ తేరుకున్నాడు. కాని, అతనికి మిత్రులు లేకుండా జీవించాలని లేదు. అందువల్ల సరోవరం తీరంలో ప్రాణాలు వదలాలని నిశ్చయించుకొన్నాడు. అప్పుడొక అశరీరవాణి ఇలా పలికింది.

'రాజకుమారా, ఇది చెట్టు కాదు, గణాధిపతి. గణాధిపతి ఉల్లాస వినోదంగా ఈ వృక్షాకృతి ధరించి ఉంటున్నాడు. అతనిని ఉల్లంఘించడంవల్ల, ఈ చెట్టు శాఖలు నీ మిత్రులను పళ్ళుగా మార్చివేశాయి. తపస్సు చేసి హేరంబుని సంతోషపెడితే వారిని కలుసుకొంటావు. లేకపోతే వారిక నూరేళ్ళయినా, విముక్తి వుండదు.'

ఆ దివ్యవాణి విని రాజకుమారుని మనస్సు కుదుటబడింది. వెంటనే ప్రథమ ప్రభువయిన వినాయకుణ్ణి పూజించి ఈ విధంగా స్తోత్రం చేశాడు:

'గజేంద్రా, నీ ముఖమనేది ఉదయ పర్వతం. దానిమీద నీతెల్లటిదంతం తెల్లటి పొడుగాటి కిరణాలు వెదజల్లే చంద్రుడు. నీవు తొండంతో పూత్కరిస్తే చెదరిపోయే తుమ్మెదలిపిందుల్ల చీకట్లు. ఆ చీకట్లో వచ్చే నీ తొండపు తుంపర్లు ముత్యాల వంటి నక్షత్రాలు. అలాటి సీత్కార నక్షత్రాలు జయించుగాక!'

మృగాంకదత్తుడు ఈ విధంగా పన్నెండు నాళ్ళు ఉపవసించి గణపతిని పూజించాడు. గణపతి అతనికి స్వప్నంలో కనిపించి, 'నీ వాంఛితం నెరవేరుతుంది' అని వరమిచ్చాడు. రాజకుమారునికి సంతోషమయింది. పదమూడోనాడు తెల్లవారి మేల్కొగానే తన పదుగురు మంత్రులూ వచ్చి నమస్కారం చేయడం చూచి మరీ ఆశ్చర్య సంతోషాలు కలిగాయి. వారూ ముదంతో వున్నారు. వారిని చూచి సంతోషం పట్టలేక మృగాంకదత్తుడు ఇలా అన్నాడు :—

'ఏమిటి నాకు ఈ అరణ్యంలో మహాలాభం కలిగింది. మిత్రులందరూ వచ్చి చేరారు. దేవతలందరూ నన్ను అనుగ్రహించి నట్టయింది. దృఢముష్టి, మేఘబల, స్థూలబాహూ, వ్యాఘ్రసేన దుస్సహమయిన నా వియోగం ఎలా గడిపారు?'

ఇంతవరకు రాజకుమారుణ్ణి ఆరుగురు మిత్రులు కలుసుకున్నారు. ఇప్పుడు హేరంబానుగ్రహంవల్ల తక్కిన నలుగురూ వచ్చి చేరారు. ఇప్పుడు వచ్చిచేరిన నలుగురిలోను మతిమంతుడయిన వ్యాఘ్రసేనుడు ఇలా అన్నాడు.

'దేవ, నీకు స్వస్తి. నాగేంద్రుని శాపంలో మేము దిక్కులకు విరజిమ్మబడి, మూర్ఛపోయాము. నాకు మెలకువ వచ్చే టప్పటికి చిమ్మచీకటి పిశాచిలాగ దట్టంగా వ్యాపించింది. ఆ చీకట్లో శోకాంధకారంవల్ల మంచిచెడు స్పృహ తప్పి పోయాను. ఆ రాత్రి నాకు సహస్రయామలాగయింది. నేను యముణ్ణి కోరుతూ, అడవిలో తిరిగాను. ఆ రాత్రి, పతిమారిన స్త్రీ అడవికి లాక్కుపోయి దుఃఖపెట్టినట్టయింది.

తెల్లవారింది. కమలాలు పూచిన ఒక సరోవరం చూశాను. ఆ సరస్సులో స్నానం చేసి విచారంతో దాని గట్టున కూర్చున్నాను. తలయెత్తి చూశాను. దృఢముష్టి, మేఘబలుడు, స్థూలబాహువు కనిపించారు. ఏడ్చి ఏడ్చి వారి కండ్లు ఉబ్బిపున్నాయి. మేమందరం దేహత్యాగం చేయాలనుకున్నాము. అప్పుడు ఒక మునిపుత్రుడు మమ్మల నందరినీ మంచి నీడగల తపోవనానికి పిలుచుకొని పోయాడు.

అది కణ్వముని ఆశ్రమం. కణ్వముని తేజస్సుతో అగ్నిలాగ వెలిగిపోతున్నాడు. బ్రహ్మలోకంలో పలువురు తపస్సులు బ్రహ్మను కొలిచినట్టు అనేక మునీశ్వరులు ఆయనను సేవిస్తున్నారు. కణ్వముని రూపం అరౌద్రం, ప్రసన్నం. ఆయన కాలుణ్ణి, కాముణ్ణి జయించినట్టివాడు. అకృష్ణచరితుడు (కృష్ణచరితుడు కానివాడు. నల్లటి చరిత్ర లేనివాడు) అయినప్పటికీ, పుణ్యశాంతి పదం నుంచి అచ్యుతుడు (చ్యుతిలేనివాడు). కృష్ణాజినాన్ని ఉత్తరీయంగా వేసుకొన్నాడు. తేజస్సుతో పింగళకాంతులీనే అగ్నిలాగ వున్నాడు. అబ్జాసనుడయిన బ్రహ్మలాగ అబ్జదళాల మాలికలు వేసుకొన్నాడు, కమలాల పుప్పొడి ఆయనకొక వింత కాంతి కలిగిస్తూంది. ఆయనకు జగత్త్రయము అరచేతిలోని ఆణిముత్యం వంటిది. శమసంతోష సంపదలకు ఆయన పుట్టినిల్లు వంటివాడు.

అలాటి ఆయనను మేము దర్శించుకొన్నాము. ఆయన శోకార్తులయిన మమ్ములను చూశాడు, మా సంగతి విన్నాడు. అమృతం కురిపిస్తున్నట్టుగా మాట్లాడాడు, కరుణాసింధువయిన ఆ ఋషి. ఆయన మాట్లాడుతూ వుంటే, దంతకాంతులు దిక్కులకు వ్యాపించాయి. ఆ కాంతులు సోమపానం చేసిన అతని ముఖంనుంచి వెలువడుతున్న చంద్రకాంతులలాగ వున్నాయి. అలాటి దంతకాంతులతో దిక్కులను ప్రకాశింప జేస్తూ ఆయన ఈ విధంగా సమాధాన పరిచారు.

'మానవులకు ఈ సంసారంలో విచిత్ర కర్మపరిపాకంవల్ల, సంయోగ వియోగాలవల్ల సుఖదుఃఖాలు మారిమారి కలుగుతూ వుంటాయి. అందువల్ల పారం లేని విశాల శోకసాగరంలో మునగకండి. త్వరలో మీరు మృగాంకదత్తుని కలుసుకొంటారు. పూర్వం ఇలాగే సుందరసేనుడనే రాజకుమారుడు భార్యా మిత్రుల వియోగంతో బాధపడి మళ్ళీ వారిని కలుసుకొన్నాడు.'

ఆ మాటలకు మేమూ, అక్కడి మునులూ కుతూహలంతో అడిగాము, సుందరసేనుని కథ వినిపించండి అని. ఆ మహాముని తన ఆహ్నికమంతా అయిన తర్వాత చెప్పడం ప్రారంభించాడు.

(ఇంకా వుంది)

# మానవస్థితిగతులపై వాతావరణ ప్రభావం !

కాలిఫోర్నియాలోగాని, దక్షిణ ఆఫ్రికాలోగాని మీరు వుంటే ఆ వాతావరణం మీకెంతో నచ్చి ఆ రోజు—మీకు చాలా ఆనందదాయకమైన రోజులా కనిపిస్తుంది. ప్రపంచం పైభాగాన ఉన్నామని అనిపిస్తుంది. కాని ఎండ ఎక్కువగా ఉండే రోజుల్లో అక్కడ నివసించే ప్రజల్లో ఎక్కువభాగం సంతోషంగా గడపలేరు.

'నీలాకాశం అస్తమానూ కనిపిస్తే విసుగు పుట్టించి మనుషుల్ని నిరుత్సాహపూరితుల్నిగా తయారు చేస్తుంది. ప్రజలు తమ వ్యాపారాలమీద దృష్టి నిలుపలేరు. వారి ఉత్పాదకశక్తి దెబ్బ తింటుంది. వాతావరణస్థితిలో మార్పులేక ఇలా జరుగుతుంది' అని డా. ఐ. కర్న్‌బ్లూ (అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్లైమెటాలజీ వైస్ (ప్రెసిడెంట్) అంటారు.

లండన్ వాసులకి సర్వసాధారణం అనిపించే అక్కడి వాతావరణం కొత్తవాళ్ళను ఉత్సాహ పరుస్తుంది. మానసిక శక్తిని ఉద్దీపింప చేస్తుంది. ఉదాహరణకి: ఎండలు మెండుగా ఉండే మెక్సికో నగరం నుంచి ఒక కుటుంబం అసాధారణ ఇంగ్లీష్ సమ్మర్‌లో లండన్ వెళ్ళిందనుకోండి. అక్కడ చాలా చల్లగా, తేమగా ఉంటుంది. వెళ్ళిన వాళ్ళతో అక్కడి ప్రదేశాలు అనుకూలిస్తవి. విక్టోరియా హోటల్ గార్డెన్‌లో నించుంటే చల్లటి వర్షం పడుతూ— వాళ్ళ తలపు రోజును ఎంతో సంతోషకరంగా తయారు చేస్తుంది. ఆహ్లాదకరమైన వాతావరణంలో ఉన్నామన్న అపూర్వానుభూతిని కలిగిస్తుంది.

అమెరికాలో జనవరి నెలలో చల్లగా వుంటుంది. జూలై వచ్చేసరికి ఎండ తీవ్రరూపం దాలుస్తుంది. జనవరి నుంచి జూలైదాకా వాతావరణంలో ఎలా—మెల్లమెల్లగా మార్పు ప్రారంభమయి, తీవ్రతరమౌతుందో—అలా ఆ ప్రభావం అక్కడివారి మీద పడుతుంది. అక్కడ్నుంచి ప్రమాదాల కేసులు హెచ్చుగా సంభవిస్తూ ఉంటవి. ఆయా నెలల్లో ఉండే ఉష్ణోగ్రతను బట్టి నేరాలు కూడా మలుపులు తిరుగుతూంటవి. తేమగా ఉండే అమెరికన్ నగరాలలో ప్రజల్లో కలహాల ధోరణి జూలైనాటికి శిఖరాగ్రాలను అందుకుంటుందనటం నిస్సందేహం—అని యీ శతాబ్దం ఆరంభంలో అమెరికన్ శాస్త్రజ్ఞుడు ఎడ్విన్‌డెక్స్టర్ పేర్కొన్నాడు.

వాతావరణంలో ఏర్పడే హఠాత్పరిణామాలవల్ల ప్రజల్లో అనేకమంది ఏకాగ్రతను కోల్పోయి—నరాల బలహీనతవల్ల ఉద్రేకపడటం, తల నొప్పితో బాధపడటం, నిద్రలేక పోవడం వంటి—వాటికి లోనవుతారు. పురుషులకన్న స్త్రీలు చాలా ఎక్కువగా, త్వరగా ఈ మార్పులకు గురి అవుతారు. ఎందుకనంటే, వారి శరీరాలు సున్నితంగా ఉండటంవల్లనూ, తేలికయిన ఉడుపులు ధరించటం చేతనూ యిలా జరుగుతుంది.

అనుగుణమైన జీవనానికి అనుమతించని వాతావరణం ఏర్పడటంవల్ల పశ్చిమ జర్మనీలోని హాంబర్గ్‌లో 67,000 ప్రమాదాలు జరిగినవని పరిశీలించిన పిమ్మట తేలింది. ప్రమాదాల సంఖ్య 85 నుంచి 90 శాతానికి పెరిగింది. [illegible]లోని ఒక ఫ్యాక్టరీలో వాతావరణంలో ఒక్కసారిగా మార్పు రావటంవల్ల తక్కువగా ఉండే ప్రమాదాల సంఖ్య 45 శాతానికి పెరిగింది.

శృంగార జీవితం చక్కగా సాగిపోవటం మీద వాతావరణస్థితి ప్రభావం చాలా ఉన్నది. కొందరు స్త్రీలు చల్లటి వాతావరణంలోకన్న ఎక్కువ వేడిగా ఉండే వాతావరణంలోనే గర్భం ధరిస్తారు. అధికోష్ణం కలిగిన వాతావరణంలో కన్న చల్లటి వాతావరణంలో గర్భం ధరిస్తే—వారికి పుట్టే పిల్లలు ఆరోగ్యంగా ఉంటారని కూడా శాస్త్రజ్ఞులు చెబుతారు.

'బయటి ప్రదేశాలలో ఉష్ణోగ్రత 65 డిగ్రీలు ఫా. హీ. ఉన్నపుడు మనిషి స్వభావంలో దెబ్బలాటల ధోరణి ఉత్పన్నమయి, అంచులదాకా వెళ్ళుతాయి. లోపలి ప్రదేశాలలో ఉష్ణోగ్రత 40 డి. ఫా. హీ. కి తగ్గినపుడు వేసవిలో కన్న లవ్ మేకింగ్ (ప్రేమకలాపాలు) ఎక్కువగా జరిపి బలహీనులవుతారు. ఉష్ణోగ్రత 70 డి. ఫా. హీ. పైగా ఉన్న వేసవిలో 'లవ్ మేకింగ్' బాగా తగ్గిపోతుంది; మరింత విస్తృతమైన ఏర్పాటు



తుంది.' అని—ఈ రంగంలో ప్రముఖుడయిన అమెరికన్ పరిశోధకుడు శ్రీ క్లారెన్స్ మిల్స్ చెప్పారు.

జపాన్‌లో వసంతఋతువులో కన్న సంవత్సరాంతంలో పుట్టుకలు ఎక్కువగా జరుగుతూంటవి. తొమ్మిది నెలలకిముందు వాతావరణస్థితి మొదట చల్లగాను, ఎంతో ప్రశాంతంగాను ఉంటుంది. ఆ తర్వాత వేడిగాను, జిడ్డుగాను ఉంటుంది.

'మీరు పొడవుగా సన్నగా ఉండటం కాని; పొట్టిగా లావుగా ఉండటం అనేది కాని — మీరు నివశించే దేశంయొక్క శాశ్వత శీతోష్ణ స్థితిమీద ఆధారపడి వుంటుంది.' అని ఫ్రెంచి ఆంత్రోపాలజిస్టు డాక్టర్ ఎగిన్ ష్రెయిడర్ చెప్పారు. చాలా వాతావరణాల్లో నగటు మనుషులగురించి ముఖ్యమైన లెక్కలు పరిశీలించిన పిదప — 'స్వచ్ఛమైన వాతావరణంలో సౌకర్యంగా జీవించేవారు శరీరాలను పెంచుకో గలిగార'నికూడా ఆయన పేర్కొన్నారు. దృఢంగా ఉండే రష్యన్స్, స్కాండనేవియన్స్, నార్తు యూరోపియన్స్‌ల శరీరాలకి వేడి బాగా తగిలితే దశత్వాన్ని పోగొట్టుకుంటారు. ప్రపంచంలోని చల్లని శీతోష్ణ స్థితుల్లో జీవించే మనుషులు — వేలకొద్దీ మైళ్లదూరాన ఉన్నాకూడా శరీర సాదృశ్యాన్ని కలిగి వుంటారు.

పోల్చి చెప్పాలంటే బాగా సన్నగా ఉండేవాళ్లు ఇండియా, మలేసియా మొదలయిన వేడి ఎక్కువగా ఉండే దేశాలలో కనిపిస్తారు. వారి శరీరాల లోపలకూడా వేడి ఉండటమే అందుకు కారణం. [అంతర్గతంగా ఉండే వేడి చాలా సులభంగా వారి శరీరాల్ని తగ్గించి వేస్తుంది] ఉత్తర రాష్ట్రాలలో సమానంగా [బాగా లావూ కాని, బాగా సన్నమూ కాని] ఉండే మనుషులు — వేడి దేశాలలో నివశించవలసి వచ్చినప్పుడు కొత్త పరిసరాలకి అక్కడి వాతావరణానికి అనుగుణంగా చక్కగా మారిపోతారు.

(ఫో. న్యూ.) ●
















### జరిగిన కథ

కళ్యాణి ఆ ఆఫీసులో కొత్తగాచేరింది. అక్కడ పని చేస్తున్న వారందరిలోను మురళిపై ఆమెకి సదభిప్రాయం ఏర్పడింది. ఈ సదభిప్రాయమే ఆమెని అతనికి సన్నిహితురాలిగా చేసింది. ఆఫీసులో తోటివారి విసుర్లు ఆరంభమయ్యాయి. ఒకరోజు కళ్యాణి తన పుట్టుపూర్వోత్తరాలని మురళికి చెప్పుకున్నది. మురళి పూరిగా వినకుండానే ఆమెనుంచి సెలవు తీసుకున్నాడు. కళ్యాణి మనసు పరిపరివిధాల పోయింది ఆమె వేశ్యజాతిలో పుట్టడమే. అందుకు కారణం. తను ఎంత నీతిగా బ్రతుకుతున్నా ఈ సమస్య వెన్నాడుతూనే వుంది.

## 5

మర్నాడు పుదయం కళ్యాణి ఆఫీసు గేటులో అడుగుపెడుతూంటే, అప్పుడే ఆగిన రిక్షాలోంచి కమల దిగింది. ఇద్దరూ చిరునవ్వుతోనే పలకరించుకున్నారు.

రిక్షా అతనికి డబ్బులిచ్చి పంపించేసి, ప్రక్కనే నడుస్తూ 'నీకోమాట చెప్పాలి,' అంది కమల.

'ఏమిటది?' అంది కళ్యాణి ఏదేమిటయి వుంటుందా అనే కుతూహలంతో కళ్లు వెడల్పు చేసుకుని.

'లోపలికి వెళ్లి కూర్చుని తాపీగా చెప్పుకుందాం.' అంది కమల చెకచెక చీకీలు ఎక్కేస్తూ.

'ఇప్పుడు చెప్పు అంది.' కమల సీటు దగ్గర మరో కుర్చీ లాక్కుని తను కూడా కూర్చుంటూ.

'రవీంద్రభారతిలో ఇవాళ సాయంకాలం సుబ్బులక్ష్మి ప్రోగ్రాం వుంది.' అంది కమల పర్సు టేబిలుమీద పడేసి కర్చీఫ్‌తో నుదురు, మెడ తుడుచుకుంటూ.

ఏదో పెద్ద విశేషం, ముఖ్యంగా తనకి బాగా ఆసక్తి కలిగించే విషయం చెప్తుంది అని చెవులు దోరగించుకుని, అవ్యక్తమైన ఉద్వేగంతో గుండె దడదడలాడుతూండగా, కమల మొహం వంకే చూస్తూ కూర్చున్న కళ్యాణి ఆ మాటలు వినగానే ఒక్కసారి తెల్లబోయినట్లయింది. అయితే ఆ ఆశాభంగాన్ని తన నిరుత్సాహాన్ని పైకి కనబడనీయకుండా,

'అవును — తెలుసు — ఆ మధ్య క్రానికల్‌లో చూశాను' అంది.

'బావ వారం క్రిందటే మా ఇద్దరికీ రెండు టిక్కెట్లు కొన్నాడు. కాని, అనుకోకుండా తను నిన్న 'క్యాంపు'కి వెళ్లాల్సి వచ్చింది—'

'ఓహో, అందుకా ఇవాళ నువ్వు రిక్షాలో వచ్చావు' అనుకుంది కళ్యాణి. అతను వూళ్లోలేని సందర్భాలలో తప్ప మిగతా రోజులలో కమలని తన స్కూటరు మీద తీసుకొచ్చి ఆఫీసుదగ్గర దిగవిడిచి తను ఆఫీసుకి వెళ్లిపోతాడు. మళ్లీ సాయంకాలం ఆఫీసు అయిపోయే వేళ్టికి వచ్చి ఇంటికి తీసుకువెళ్తాడు.

'ఎమ్మెస్ సుబ్బులక్ష్మి పాట వినాలని ఎంతో సరదా పడ్డావు, రేపు ఒక్కరోజు ఆగు బావా అని చెప్పానుకూడ...తల అమ్ముకున్నాక పై అధికారి ఆజ్ఞలకి కట్టుబడి వుండాల్సిందే. పాటకచ్చేరీలూ నాటకాలూ అన్నీ అయిందాకా వుండి ఆ తరువాత ఎప్పుడో మనం ఇష్టం వచ్చినప్పుడు వెళ్తామంటే ఎలా కుదురుతుంది — అర్జెంటు వ్యవహారం. నేను ఉన్నపళంగా బయలుదేరి వెళ్లకపోతే అక్కడ కొంపలంటుకుంటాయి అని చెప్పి వెళ్లిపోయాడు — తన టిక్కెట్టు వుంది. నువ్వు వస్తావేమో అని...'

ఒక్కక్షణం ఆలోచించింది కళ్యాణి 'తనకి ఇలాంటి సంగీతం అంటే సరదా

వుంది—పైగా ఈ పరిస్థితిలో కాస్సేపైనా మనస్సుకి ఆ వాతావరణంలో కాస్త రిలీఫ్ దొరకవచ్చు—రవీంద్రభారతి కూడ తనఇంటికి దగ్గరే—రాత్రి పొద్దుపోయినా ఏం భయం వుండదు. అయినా ఆ చుట్టుప్రక్కల వాళ్లెవరూ ఈ ప్రోగ్రాంకి రాకుండా వుంటారా?' అనుకుని,

'సరే ఆ టిక్కెట్టు నేను తీసుకుంటాను—ఇప్పుడు నా పర్సులో అట్టే లేదు—నీకు డబ్బు రేపు తెచ్చిఇస్తాను' అంది.

'భలేదానివే— ఆ టిక్కెట్టు అమ్మేసేయాలి అనే వుద్దేశ్యంతో అడగలేదు నేను — సరదాగా నీకంపెనీ కోసం అడిగాను. అసలు నీకు ఈ క్లాసికల్ మ్యూజిక్‌లో ఇంటరెస్టు వుందో లేదో వస్తానంటావో లేదో అనుకున్నాను—ముందు మా ప్రక్కింటి వాళ్లమ్మాయిని అడిగాను, అయ్యో బాబోయ్ ఈ సుబ్బులక్ష్మిని వినే వోపిక నాకు లేదు బాబూ హాయిగా రేడియోలో సినిమా పాటలు వింటాను, అంది ఆ అమ్మాయి — అమ్మకి నాలుగు రోజుల నుంచీ ఆయాసం మరీ ఎక్కువగా వుంది. మూడు నాలుగు గంటలు కూర్చోటం తనవల్ల కాదు — లేకపోతే తనకి ఎంతో సరదా'...

'నాకూ సరదయే, నేను తప్పకుండా వస్తాను. నాకయితే ఇల్లు దగ్గరే అనుకో నువ్వు ఒక్కదానివీ వెళ్లాలి...' అంది కళ్యాణి.

'అదో ప్రాబ్లమ్ కాదులే — అయినా మా కజినూ తన మిసెస్సూ కూడ వస్తున్నారు— ఏ టాక్సీలోనో వెళ్లిపోతాం. నన్ను మా యింటి దగ్గర డ్రాప్ చేసేసి వాళ్లు వెళ్లిపోతారు. మా ప్రక్క వీధేగా.'

'సరే, అలాగే' అని కళ్యాణి తన సీటులోకి వెళ్లిపోయింది.

కాస్త ముందుగా వెళ్లిపోటానికి పర్మిషన్ తీసుకుని ఇద్దరూ నాలుగు గంటలకే ఆఫీసు వదిలి బైటకి వచ్చారు.

'మీరు అయిదున్నర కల్లా రవీంద్ర భారతికి వచ్చేసేయండి — నేనూ నా ఫ్రెండూ కూడ త్వరగానే వచ్చేస్తాం — మీరు వచ్చేటప్పుడు అమ్మనడిగి మా రెండు టిక్కెట్లూ తెచ్చి పెట్టండి —



తనకి తెలును అవెక్కడున్నాయో,' అని కమల మధ్యాహ్నమే వాళ్ల కజిన్ ఆఫీసుకి ఫోన్‌చేసి అతనితో చెప్పింది. ఆ సాయంత్రం తనతో తన యింటికి వచ్చి ఫలహారం అదీ చేసి ఇద్దరూ కలిసి అక్కడికి వెళ్దాం అని కళ్యాణి అడిగిన దానిని కాదనలేక—

అలాగే ముందు తిన్నగా కళ్యాణి యింటికి వెళ్లి, అక్కడనుంచి రవీంద్ర భారతికి వెళ్లారు.

* * *

పదిరోజులు గడిచిపోయాయి—

ఆఫీసునుండి వచ్చి కాస్త కాఫీ పెట్టుకుని త్రాగి ఆ చేత్తోనే రాత్రి వంట కూడ ముగించుకుని, స్నానంచేసి వచ్చింది కళ్యాణి.

అద్దంలో చూసుకుంటూ తిలకం దిద్దుకుంటూంటే తన కళ్లల్లో అగాధాలు కొట్టవచ్చినట్లుగా కనిపించాయి— తన మొహం తనకే ఎలాగో అనిపిస్తోంది, పదిరోజుల క్రిందటి తనకి ఇవాల్టి తనకి అసలు పోలికే లేదేమోననిపిస్తోంది— అందుకే ఉదయం కమల అననే అంది.

'చక్కనమ్మ చిక్కినా అందమే అన్న మాటలో నిజం వుందో లేదో స్వయంగా పరీక్షించి తెలుసుకోదలుచుకున్నావా ఏమిటి డియర్.' అంటూ.

'నేనా? చిక్కిపోయానా? ఏమో నా కలా ఏమీ అనిపించటం లేదు.'

'సరే—అయితే, ఎవరినయినా అడుగు చెప్తారు. నా మాట అబద్ధమేమో,' రెట్టించింది కమల.

'అబద్ధం చెప్తావన్నానా — చూస్తున్నావుగా ఎండలు ఎలా మండిపోతున్నాయో —రోజూ ఈ బస్సులలో పడివచ్చి వెళ్లే సరికే సగం ప్రాణం పోతోంది.'

'ఈ ఎండలు నీ ఒక్కదాని వరమే అవుతున్నట్టు, మాకెవ్వరికీ లేనట్టూ మాట్లాడుతున్నావు.' విడిచిపెట్టలేదు కమల.

'ఈమధ్య కాస్త వంట్లోకూడ బాగుండటం లేదులే!' ఏదో వో కారణం చెప్పి తప్పించుకోవాలని చూసింది కళ్యాణి.

'వంట్లోనే నా, మనస్సులో కూడానా...' అర్థోక్తిలోనే ఆపేసి కిసుక్కున నవ్వింది కమల.

# ఆచరణలో ...

ఇంతలో ఆఫీసరు రావటంతో ఖబుర్లు మాని ఎవరిపని వాళ్లు చేసుకోటంలో మునిగిపోయారు...

అదంతా తలుచుకుంటూ ఒక్కసారి నిట్టూర్చింది కళ్యాణి.

'జరిగిందేదో జరిగిపోయింది.'అని మనస్సుకి నచ్చచెప్పుకోవాలి కాని అదే దిగులుతో ఇలా రోజు రోజుకి కృంగిపోతూ నలుగురి దృష్టిలో పడటం వివేకం అనిపించుకోదు – ఇవాళ కాకపోతే—మరోనాడు, మురళీ మరో అమ్మాయిని పెళ్లిచేసుకున్నా కయినా వాళ్లంతా ఇవాల్టి నా పరిస్థితిని తలుచుకుని నవ్వుకోరా— నాలుగు రోజుల ఎడబాటునే భరించలేక విరహంతో మగ్గిపోయింది అనుకున్నాం, పాపం ఆశలు మొదలంటూ కూలిపోయాయే— అని వాళ్లంతా చాటుగానయినా అనుకోరా? ఛ—ఏమిటంత పిచ్చిదాన్ని అయిపోయాను! ఇంక ఈ క్షణంనుంచీ గతం అంతా మరిచిపోయి ఇప్పటిలా వుండటానికే ప్రయత్నిస్తాను.' కుంకుమభరిణె అలమారులో పెట్టి ప్రక్కకి తిరిగేసరికి టేబిలుమీద మల్లెదండ కంటపడింది — ఇంతకు ముసుపే ఇంటివారిపాప ఇచ్చి వెళ్లింది—మొన్నొకనాడు ఇలాగే పెరట్లో పూసిన పువ్వులు దండగుచ్చి తెచ్చి ఇచ్చినా కళ్యాణి దాన్ని అలమారులోనే పడేసింది అన్య మనస్కంగావుండి, మర్నాడు ఆ దండని అక్కడచూసిన పాప ఇల్లుపీకి పందిరివేసినంత పనిచేసింది. తను కష్టపడి కట్టిఇచ్చిన మాలని నిర్లక్ష్యం చేసినందుకు—'మొన్నటిలా మరిచిపోకండేం' అంటూ చెప్పి మరీ ఇచ్చింది ఇవాళ — కళ్యాణి నవ్వుకుంటూ ఆప్యాయంగా దండ చేతిలోకి తీసుకుని తలలో ముడుచుకుంది.

గేటు తెరిచిన చప్పుడు తరువాత, 'పాపా, ఇలా రామ్మా,' అన్నమాటలు వినిపించాయి. కళ్యాణి ఒక్కసారిగా వులిక్కిపడింది. 'ఆ గొంతు—అది—తను గుర్తుపట్టకలదు—సందేహం లేదు మురళీయే— ఒకసారెప్పుడో తను దూరంనుంచి ఇల్లు చూపించింది. ఇప్పుడు బహుశః కళ్యాణి ఈ ఇంట్లో ఎక్కడ వుంటుంది అని ఇంటివారి పాపని అడుగుతాడేమో — 'ప్రత్యేకం తనని వెతుక్కుంటూ అతను ఎందుకు వచ్చినట్లు,' కళ్యాణి తలలో ఆలోచనలు గిర్రున తిరిగిపోతున్నాయి.

'అవాళ నావల్ల పొరపాటు జరిగిపోయింది కళ్యాణి — అదేం మనస్సులో పెట్టుకోకు-- మనం ఇద్దరం ఎప్పటికీ ఒక్కటిగానే బ్రతుకుదాం అంటాడా,' అని వూహించుకుంటూ పరవశించబోయిన మనస్సుని అదిమి పట్టుకుని, 'ఛ—ఈ మనస్సుకి అసలు బుద్ధి అనేది లేదు— ఒక అనుభవం అయినా గుణపాఠం నేర్చుకోలేదు—అవాళ రెండు మాటలైనా చెప్పకుండా అలా తలవంచుకుని వెళ్లిపోయాడే, అతని సంగతి తెలిసి కూడ మళ్లీ వ్యామోహంలో పడిపోతోంది — అతను మళ్లి ఎందుకు వచ్చాడో వూహించుకోటం కష్టం కాదు — అతని పెళ్లి నిశ్చయం అయిపోయి వుంటుంది— ఆఫీసులో అందరితోపాటూ నాకూ వో ఇన్విటేషను ఇవ్వటానికి వచ్చి వుంటాడు.' అని మనస్సుని స్వాధీనంలోకి తెచ్చుకోటానికీ, తామిద్దరి మధ్యా అసలు ఏమీ జరగనట్టే అతన్ని ఆహ్వానించటానికి తనని తను సిద్ధం చేసుకుంటోంది.

ఇంతలో మురళీ గదిముందుకి రానే వచ్చాడు.

'కళ్యాణీ' అని అభిమానంగా చనువుగా పిలవబోయిన అతనిగొంతు బిడియంగా సంకోచంగా బిగుసుకుపోయినట్లయింది. ఓసారి గొంతు సవరించుకుని చివరికి మెల్లిగా పిలిచాడు.

ఆ వచ్చినదీ పిలిచినదీ ఎవరో తెలిసినా 'ఎవరూ?' అంటూ తలుపు తెరిచింది కళ్యాణి. ఒక్కక్షణం ఇద్దరూ ఒకరి వొకరు అపరిచితుల్లా చూసుకున్నారు. అంతే ఆ తరువాత ఇద్దరూ కళ్లు వాల్చేసుకున్నారు.

'లోపలికి రండి' అనాలనుకున్న కళ్యాణి మాటలాడటం చేతకానిదానిలా మౌనంగా నిలబడిపోయింది.

చొరవగా లోపలికి వెళ్లి కూర్చోవాలి, కళ్యాణికి ఎన్నో సంగతులు చెప్పాలి అనుకున్న మురళీ ఎవరో అడ్డు వచ్చినట్లే ఆగిపోయాడు.

'అవాళ నా ప్రవర్తన చాలా రూడ్‌గా వుంది కదూ—దానికి నేను ఇవాళ మన

స్వార్థంగా క్షమార్పణ చెప్పుకుంటున్నాను కళ్యాణి — నీతో కొంచెం మాట్లాడాలి — అలా పార్కులోకి వెళ్దాం.' మాటలు కూడబలుక్కుంటున్నట్లు ఆగి ఆగి అన్నాడు.

'నాతో ఏం మాట్లాడతారు? నా చరిత్ర అంతా చెప్పుకుంటారు. అంతేగా. నాలాంటివాళ్ల కథలు వినటానికి మీకు వినోదంగా వుంటుందే తప్ప నా సమస్యని ఏ విధంగానూ పరిష్కరించలేరు.' అనాలనిపించింది కానీ, తన ఆలోచనలతోనూ, కష్టాలతోనూ నిమిత్తంలేనట్లు, 'అలాగే' అన్నట్లు తల ఆడించేసింది, గుమ్మం అప్పగించి చూస్తూ, 'సరే నేను వెళ్తున్నాను. నువ్వు త్వరగా వస్తావు కదూ,' అనేసి మురళి వెళ్ళిపోయాడు.

'ఛ, నాకసలు బుద్ధి లేదు. అతను ఒక్కసారి పిలిచేసరికి అంతా మరిచిపోయి అలాగే అంటూ తల వూపేశాను— అయినా అసలు నాతో మాట్లాడటానికి ఏముంటుంది? ఆవాళ అలా రూడ్‌గా వెళ్ళిపోయాడు కదూ, ఇవాళ కాస్త నెమ్మదిగా నచ్చచెప్పే ధోరణిలో మాట్లాడతాడేమో—'నా పరిస్థితి నువ్వు కొంచెం అర్థం చేసుకోవాలి కళ్యాణి — అమ్మా వాళ్ళని ఒప్పించగలననే ధైర్యం నాకెంత మాత్రం లేదు. వాళ్ళని వ్యతిరేకించి ఈ పెళ్లి చేసుకుంటే ఇంక వాళ్ళని దూరం చేసుకున్నట్లే అయిపోతుంది—నా ఒక్కడి సంతోషంకోసం వాళ్ళందర్నీ బాధ పెట్టడం నాకు ఇష్టంలేక పోయింది— అందుకే నాకు ఇష్టం వున్నా లేకపోయినా వాళ్ళు చూపించిన అమ్మాయిమెడలో తాళికట్టటానికి అంగీకరించాను. ఇదంతా నీకు చెప్పాలని నీదగ్గర క్షమాపణ కోరుకోవాలనీ వచ్చాను.' అంటాడేమో జాలిమొహం పెట్టి... 'అసలు నేనిప్పుడు అక్కడికి వెళ్ళకపోతేనేం? కాస్సేపు చూసిచూసి విసుగొచ్చి అతనే తిరిగి వెళ్ళిపోతాడు.' అని పౌరుషపడిన మనస్సు కాస్సేపటిలోనే మళ్ళీ సరళంగా మారి పోయి 'పిచ్చిదానా. అతను చెప్పేది వినాలి, అడిగింది చెప్పాలి.' అని నిశ్చయించుకుని తలుపుకు తాళంపెట్టి బయలు దేరింది.

* * *

ఆఫీసునుంచి వచ్చి కాళ్ళూ మొహం కడుక్కుని తీరుబడిగా గదిలో మంచం మీద పడుకుని పేపరు చదువుకుంటున్నాడు వాసు — ఇంతలో వాసూ అన్న పిలుపూ వీధితలుపు తడుతున్న చప్పుడూ వినిపించి లేచివెళ్ళాడు పేపరు చేత్తో పట్టుకునే.

తలుపులు పూర్తిగా తెరవకుండానే పలకరించేశాడు మురళి, 'ఈ వేళప్పుడు ఇంట్లో వుంటావో వుండవో అనుకుంటూ వచ్చాను...ఉన్నావు' అంటూ.

'ఏం చేస్తాను — ఊరంతా తిరిగి తిరిగి కాళ్ళు నొప్పులు పుడుతున్నాయి కాని కాలం గడిచినట్లు కనిపించటం లేదు — సరే. ఇంట్లో కూర్చుని పేపరయినా చదువుకుందామని వచ్చేశాను ... ఏమిటో, ఒక్కొక్కసారి మరీ తిక్కగా వుంటుందనుకో ఈ ఒంటరితనం' స్నేహితుడికి కుర్చీ చూపిస్తూ తనూ మరో కుర్చీలో కూర్చున్నాడు వాసు.

'అక్కయ్య ఇంకా ఎప్పుడు వస్తారు— ఇంతగా ఆపసోపాలు పడకపోతే ఆవిడ్ని త్వరగా వచ్చేసెయ్యమని వ్రాయరాదూ—'

'వ్రాస్తే వచ్చేస్తుంది, తనకేం అలాంటి అభ్యంతరాలు లేవు...బొత్తిగా పసివాడితో చేసుకోలేక ఇబ్బంది పడి పోతుందని అక్కడయితే కాస్త విశ్రాంతిగా వుంటుందని నేనే వుండమన్నా మరి కొన్నిరోజులు— ఇంకెంత—వచ్చేనెల రోజులలో వచ్చేస్తుంది...నాన్న దగ్గరికి వెళ్ళి పోదాం అని పాప ఒకటే మారాం చేస్తోం దిట. దీన్ని పట్టుకోటం నా తరం కావటం లేదు, అంటూ వ్రాసింది' అన్నాడు వాసు భార్యాపిల్లల్ని తలుచుకుంటూ.

'ఈ నాలుగు నెలలకే ఎన్నాళ్ళో అయి పోయినట్లుంది పాపని చూసి!' అన్నాడు మురళి తను చెప్పాలని అనుకున్నది ఎలా మొదలుపెట్టాలా అని వో పక్క ఆలోచిస్తూనే.

'ఊ... ఇంకా ఏమిటి విశేషాలు.' స్వంతగొడవకి స్వస్తిచెప్పి స్నేహితుడికి అవకాశం ఇచ్చే ధోరణిలో అడిగాడు వాసు.

'విశేషమే వుంది మరి. నీతో కొంచెం మాట్లాడాలని వచ్చాను ప్రత్యేకంగా.'

'ఊహూ ... ప్రత్యేకంగా నా సలహా కావలసివచ్చే విషయం ఏమయి వుంటుం దబ్బా,' సగం హాస్యంగానూ సగం ఆసక్తి గానూ అంటూ మురళి మొహంలోకి చూశాడు వాసు.

మురళి చటుక్కున కళ్ళు వాల్చుకుని చేతివేళ్ళకేసీ ఆ తరువాత షూ లేసులకేసీ చూస్తూ కూర్చున్నాడు కాస్సేపు.

స్నేహితుడి ధోరణికి విస్మయంగా కళ్ళు చిట్లించి కుతూహలంగా అతన్నే పరికిస్తున్నాడు వాసు. అంతలో మురళి



మౌనానికి స్వస్తి చెప్పి, 'నేను పెళ్లి చేసుకోవాలను కుంటున్నాను.' అని మెల్లిగా చెప్పటంతో, బిగపట్టి వుంచిన వూపిరి ఒక్కసారిగా వదిలేసి పెళ్ళున నవ్వుతూ స్నేహితుని వీపుమీద ఉత్సాహంగా ఒక్కచరుపు చరిచాడు వాసు— మురళీ ఆ ఆర్భాటాన్ని భరించలేనట్లు సిగ్గుతో ఇంకా ముడుచుకు పోయాడు.

'హోయి నీ అసాధ్యం చల్లగావుండ— నీ నస్పెన్సు చూసి ఇంకా ఏమిటో అనుకున్నాను — పెళ్లి మాట చెప్పటానికి ఆడపిల్లలా ఇంతసేపు సిగ్గుపడి పోయావేమిటి ?...ఊఁ, సరేలే ... ఇంతకీ పెళ్లిచూపులు అయాయా ? సంబంధం ఏవూరు ? పెళ్లికూతురు ఏం చదువుకుంది ? కట్నం ఎంత ఇస్తామంటున్నారు ? అన్ని సంగతులూ చెప్పు మరి' వాసు తీరికగా కుర్చీలో జార్లబడి కూర్చుని చనువుగా అన్ని వివరాలూ అడుగుతూంటే, మురళీమొహం అధోకరకంగా ముడుచుకు పోయింది.

'నీతో మాట్లాడాలి అంటూ హోటెంప నేను మొత్తుకుంటూంటే, నువ్వేమిటి ప్రశ్నలతో ఇలా వూదర గొట్టేస్తున్నావు నన్ను?' అన్నాడు కాస్త చిరచిరలాడుతూ.

'హో-అమాటె మరిచిపోయాను-ఊఁ— ఏమిటది ?' వాసు మొహంలోంచి కాస్సేపటి క్రితం మాయం అయిపోయిన కుతూహలం ఆసక్తి మళ్లీవచ్చి కూర్చున్నాయి.

'కళ్యాణి నేనూ పెళ్లిచేసుకుంటున్నాం' ధైర్యంగానే వాసు మొహంలోకి చూశాడు మురళీ.

వాసు చిలిపిగా నవ్వుతూ కొంటెగా స్నేహితుడివంక చూశాడు. 'నువ్వు ఈ మాట ఏదో ఒకనాడు చెప్తావని మేము అనుకుంటూనే వున్నాం — అవాళ బస్సు దగ్గర మమ్మల్ని పరిచయం చేసినప్పుడు నీ గొంతులో మొహంలో ఏం కని పెట్టిందో మీ అక్కయ్య మరి — నాతో ఒకటిరెండుసార్లు అంది, మా తమ్ముడు ప్రేమలో పడ్డట్టున్నాడండి అంటూ — అయితే మంచిదే. ఈడూ జోడూ బాగా కుదిరింది అనేవాణ్ని నేను ... మరి ఇంక ఆలశ్యం ఎందుకు ? శుభశ్య శీఘ్రం అన్నారు పెద్దలు...మాకూ త్వరలో పెళ్లి విందు ఆరగించాలని ఆశగా వుంది...'

# ఆచరణలో...

మాటల కోసం తడుముకుంటూ, అసలు నేను చెప్పింది ఇతనికి ఎంతవరకూ నచ్చుతుంది. అని ఆలోచిస్తూ కొద్ది క్షణాలు మౌనంగా వుండిపోయాడు మురళీ. ఆ తరువాత నిదానంగానే అన్నాడు 'మా వాళ్లకి ఈ పెళ్లి ఇష్టం వుండదు... నీలాంటి స్నేహితులు, పరిచయస్థులు పదిమందయినా మమ్మల్ని ఆశీర్వదిస్తే...

'ఏం? మీ ఇద్దరికీ మధ్య కులాలు అడ్డు వచ్చాయా?'

'అందరికీ వచ్చే కులాల ప్రసక్తి కాదు, కళ్యాణి భోగం వాళ్లమ్మాయి.'

'వ్హాట్?' దిమ్మరబోయాడు వాసు. అంతకన్నా అతని గొంతులోంచి మరి మాటలు పెగిలి రాలేదు. కాని అతని కళ్ల లోనూ మొహంలోనూ మాత్రం అణుచుకోలేని తొట్రుపాటు, ఆశ్చర్యం, అయిష్టతలాంటి భావాలన్నీ వ్యక్తం అవుతున్నాయి.

'ఏం? నేను చేస్తున్నది సరియైన పని కాదంటావా?'

'అది కాదు మురళీ......'

'నీ అభిప్రాయం నాకు అర్థం అయింది—అన్ని రంగాలలోనూ అభ్యున్నతిని, పురోగతిని సాధిస్తూ దేశప్రజలంతా సగర్వంగా తల ఎత్తుకుని తిరుగుతున్న ఈ రోజులలో కూడా నా నిర్ణయం విని నువ్వింత ఆశ్చర్య పోతావనుకోలేదు — ముసలివాళ్ళు, క్రిందటి తరం వాళ్ళు ఎలా మాట్లాడినా నీలాంటి స్నేహితులంతా నన్ను అభినందించి, సంతోషంగా మాకు శుభాకాంక్షలు అందజేస్తారనుకున్నాను—సరేకాని, నేను ఒకటి అడుగుతాను చెప్పు – కళ్యాణికి ఏం తక్కువ? అందం వుంది, చదువుంది. ఒకళ్లు వంక పెట్టటానికి ఆస్కారం ఇవ్వని మంచి నడవడి వుంది...నేను భార్యగా కోరుకునే అమ్మాయికి ఇంతకన్నా ఇంకా ఏం కావాలి?'—సంజాయిషీ అడుగుతున్నట్లు, సవాల్ వేస్తున్నట్లు వున్న అతని, ధోరణికి కొద్దిగా నివ్వెరపోయాడు వాసు.

'మొదట నీ ధోరణి మాని నువ్వేదో నా సలహా అడగటానికి వచ్చావనుకున్నాను. ఇప్పుడు నీ మాటలు వింటూంటే అంతా నిర్ణయం చేసుకున్నట్లే అనిపిస్తోంది... అయినా...

చూడు మురళీ— నేను చెప్పేది నువ్వు కొంచెం శ్రద్ధగా వినాలి... నీ దృష్టితో చూస్తే కళ్యాణిలో ఎలాంటి లోపం లేని మాట వాస్తవమే – కాని, మీ అమ్మా నాన్న వాళ్లిద్దరి వుద్దేశ్యాలూ ఎలా వుంటాయో ఒక్కసారి ఆలోచించి చూడు— పెళ్లికూతురు అప్సరసని తలదన్నే అందకత్తె కాకపోయినా కాస్త కనుముక్కు తీరుగావుంటే చాలు, సంసారపక్షంగావుంటె అని తృప్తిపడతారు. అంతగా చదువు సంధ్యలులేకపోయినా పోనీలే మాకోడలేం వుద్యోగాలు చెయ్యాలా, ఊళ్లేలాలా, ఆ వున్న చదువే చాలు' అని సరిపెట్టుకుంటారు. ఇవాళ వాళ్ళు పదివేలు కట్నం ఇస్తే మన దగ్గరవుండిపోతుందా ఏమిటి. అమ్మాయే లక్షవరహాలపెట్టు అని కట్నకానుకలదగ్గర కూడ పట్టుదలలు సడలించుకుంటారు— కాని మనవాళ్లు ఈ నాటిదాకా అత్యంత ప్రాధాన్యతనిస్తూ ఎంతో పవిత్రంగా చూసుకుంటూ వస్తున్నది కుటుంబ సాంప్రదాయమూ, వంశగౌరవమూ పరువూ, ప్రతిష్ఠ, ఇవే...'

'ఆ చాల్లేద్దూ... ఆ గొప్పలన్నీ చెప్పుకోవటానికి వినటానికి మాత్రమే బాగుంటాయి. అగ్నిహోత్రంలాంటి వంశంలో పుట్టినవాళ్ళు కూడ అడ్డమైన తిరుగుళ్లూ తిరిగి వాళ్ల తాతతండ్రులు పదిమందిలో తలఎత్తుకోలేకుండా చేసిన సందర్భాలు కావలసినన్ని చూపించగలను నేను. సదాచారసంపన్నమయిన వంశంలో నీతిమంతుడే వుడతాడనే నియమంలేదు. దొరకడుపున దొరే వుడతాడనే గ్యారంటీ లేదు... మనిషికి వ్యక్తిగతమైన గుణం ప్రధానంగానీ, సాంప్రదాయం పట్టుబండలూ అంటూ కూర్చోటంలో అర్థం లేదు'—అంటూ స్నేహితుడి హితబోధని తేలికగా ఎగరగొట్టేశాడు మురళీ.

'మరి, ఇదే వాదనతో మీ వాళ్లని ఒప్పించలేవా?' నిశితంగా మురళీ కళ్ల ల్లోకి చూస్తూ అడిగాడు వాసు.

ఒక్కక్షణం తలబద్దాడు మురళీ — ఆ తరువాత మళ్ళీ ధృఢంగానే సమాధానం ఇచ్చాడు.

'ఉహూ. లాభంలేదు—వాళ్లు ఒప్పు

కోరు. ఇంకా ఆలోచిస్తూంటే అసలు వాళ్ళకి ఈ సంగతి చెప్పగలిగే ధైర్యం నాకు లేదేమోననిపిస్తోంది...ఆ—సీకో సంగతి చెప్పలేదుకదూ—పదిరోజులపైనే అయింది లే నాన్నగారి దగ్గరనుంచి వుత్తరం వచ్చింది—ఎవరో పెళ్ళికూతుర్ని చూడాలనీ వారంరోజులు శెలవుపెట్టి రమ్మనీ వ్రాశారు...ఇక కళ్యాణి సంగతి: తను మా ఆఫీసులో చేరి సంవత్సరం కావస్తోంది. తను కొత్తగా ఆఫీసులో చేరినరోజున మా ఆఫీసరు ఆమెని పరిచయంచేస్తూంటేనే, ఆవేళే ఆ మొదటి చూపులోనే తనంటే నాకు వో మంచి అభిప్రాయం ఏర్పడిపోయింది—ఆ తరువాత నేనే కావాలని తనతో పరిచయం పెంచుకుని స్నేహం చేశాను. తనూ ఎలాంటి అయిష్టతా చూపించలేదు. క్రమంగా ఒకరి మనసు ఒకరికి అర్థం అయిపోయినా ఆ విషయం ఏనాడూ పైకి మాట్లాడుకోలేదు...సరే, ఆవాళ నాన్నగారి దగ్గరనుంచి వుత్తరం వచ్చిందని చెప్తూ నేను మీ విషయం నాన్నగారికి వ్రాయాలనుకుంటున్నానని చెప్పాను. అప్పుడు చెప్పింది తను ఫలానా అని. అది వింటూనే నాకు ఒళ్ళు తెలియనికోపం ఆవేశం ముంచుకు వచ్చాయి. తను చెప్తున్నది సరిగ్గా వినటం కూడ ఇష్టంలేక పోయింది. కాస్త ముందుకు గానే లేచి వెళ్ళిపోయాను. ఆ వూపులోనే మర్నాడు బయలుదేరి మా వూరు వెళ్ళాను. నన్నుచూసి అమ్మా వాళ్ళూ చాలా సంతోషించారు. వాళ్ళ వుత్తరానికి సమాధానంగానే నేను వెళ్ళానని, వాళ్ళ ప్రయత్నానికి నేను సుముఖంగానే వున్నాననీ అనుకుని వాళ్ళకి వుత్తరం వ్రాసేశారు. ఆ పెళ్ళికూతురు మేనమామది మా వూరే. వాళ్ళు మూడోనాటికి పిల్లని తీసుకుని ఈమునింటికి వచ్చారు. అక్కడే పెళ్ళి చూపులు ఏర్పాటు చేశారు—ఇంక నా సంగతి—ఈవూరు వదలివెళ్ళిన మరు నిముషంనుంచీ కళ్యాణి తలపులే నన్ను విడవకుండా వెంటాడటం ప్రారంభించాయి. ఆమెమాటలే చెవిలో గింగురుమంటూండేవి. ఏ పనిచేస్తున్నా, అమ్మా వాళ్ళతో మాట్లాడుతున్నా, పెళ్ళికూతుర్ని చూడటానికి వెళ్ళి అనుక్షణం కళ్యాణి గుర్తు తప్ప మరోధ్యాస లేకపోయింది. ఇప్పటి నుంచీ ఇంత పరధ్యానం వచ్చేసిందేమిటని మాచెల్లాయి హాస్యం కూడ చేసింది...'

'ఇంతకీ ఆ అమ్మాయి ఎల్లా వుందో చెప్పనే లేదు—అసలు చూడలేదా?' అన్నాడు వాసు మధ్యలో కల్పించుకుని.

'చూడకేం చూశాను. కళ్యాణితో పోల్చిచూస్తే అందగత్తెగా లెఖ్ఖ రాదు కాని చూడగానే మాత్రం ఫరవాలేదనిపిస్తుంది. అంతో ఇంతో కట్నం గుమ్మరించగలరు—ఆ అమ్మాయి తండ్రీ అన్నగారూ చేసే ఆర్భాటం చూస్తూంటే నాకు కళ్యాణిపట్ల విపరీతమైన జాలి కలిగింది. మనదేశంలో ఆడపిల్ల తనంతట తానుగా నేను పెళ్ళి చేసుకుంటాను అని చెప్పగలిగేస్థితికి యింకా రాలేదేమో అనిపిస్తుంది. అసలు అలా అడగక్కర్లేకుండానే పెళ్ళిళ్ళు కుదిరిపోతున్నాయనుకో. ఒకవేళ ఏ అమ్మాయి అయినా అలా అడగవలసివచ్చినా అయిన వాళ్ళంతా పూనుకుని దేశం అంతా గాలించయినా వో పెళ్ళికొడుకుని సంపాదిస్తారు. కాని కళ్యాణికి అలా ఆదుకునేవారు ఆదరించేవారు ఎవరున్నారు? ఒకవేళ నాలాంటి వారెవరైనా ఆమెకి దగ్గర కావాలని అనుకున్నా తీరా ఆమె కథ విని వెనక్కి పారిపోతారు...'

'అయితే కేవలం ఆమెపట్ల జాలితోనే నువ్వీ పెళ్ళి చేసుకో దలిచావా?'

వాసు మాటలు వింటూ ఏమిటింత నిర్మొహమాటంగా ఇలా నిలదీసినట్లు అడుగుతున్నావు అన్నట్లు ఒక్కసారి చూసి, మళ్ళీ అంతలోనే సర్దుకుని అన్నాడు మురళీ 'నువ్వు అలా అడిగితే జాలి ఒక్కటే కారణం అని నేను చెప్పలేను—కళ్యాణి తను ఫలానా అని చెప్పగనే ఆవేశంగా లేచి వెళ్ళిపోయానే కాని ఆ తరువాత ఆవేడితగ్గి మనస్సు చల్లబడ్డాక ఎందుకు నేనలా ప్రవర్తించాను, అసలు తనలో ఏం తక్కువ అని నేను నిరాకరించాలి అని ప్రశ్నించుకుంటే సమాధానం నాకే దొరకటంలేదు—మరి అలాంటప్పుడు ఏవో సాంప్రదాయం కుటుంబం అంటూ పాతచింతకాయ పచ్చడి భావాలతో తనని నిరాకరించటం ధర్మం కాదనిపిస్తోంది— ఇంక ఆమెని కాదనటం నాకు సాధ్యం కాదనిపించింది—అందుకే అక్కడ అమ్మ ఆ సంబంధం నిశ్చయం చేసుకుందామా అని అడిగిన దానికి నేను మరోసారి ఆలోచించుకుని వ్రాస్తాను అని చెప్పి తప్పించుకుని వచ్చేశాను— అలా వచ్చేముందు కళ్యాణి సంగతి వాళ్ళతో చెప్దామా అని ఒకసారి అనిపించింది. కాని ఆమాటలు నా నోటిలోంచి వచ్చిన మరుక్షణంలో మా యింట్లో ఏం జరుగుతుందో నేను వూహించుకోగలను.

మా వాళ్ళంతా ఒక్కక్షణం తను చెప్పలని తామే నమ్మలేనట్లు తాము విన్న విషయం నిజంగా జరగబోతోందా అన్నట్లు



## ఆవేశంలో...

దిగ్భ్రాంతిలో మునిగిపోతారు. ఆ వెంటనే ఆ పరిస్థితినుంచి తేరుకొని కాస్త చిరాగ్గా చివాట్లు వేస్తూ 'ఇలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలూ వేషాలూ మాని బుద్ధిగా మేం చూపించిన సంబంధం ఒప్పుకో' అని నచ్చచెప్పపోతారు. నేను నా పట్టు విడవను. అప్పుడు అమ్మ నా మెట్టు క్రిందకిదిగి కన్నీళ్లతో నన్ను బ్రతిమిలాడుకోటం మొదలుపెడుతుంది. అయినా నేను కరగకపోతే నాన్నగారు నామెట్టు పైకి వెళ్లి ఆగ్రహంతో చిందులువేస్తూ 'నువ్వు నీమాటే కావాలని అంత పట్టుదలగా వుండి ఆ పిల్లని పెళ్లిచేసుకున్నావంటే నీకు నా యింట్లో స్థానం వుండదు. ఇవాళ మీతో లెక్కేమిటి అని మమ్మల్ని ఎదిరించి ఇంట్లోంచి వెళ్లిపోదలుచుకుంటే నువ్వు ఒక్క విషయం బాగా ఆలోచించుకుని మరీ వెళ్లు. ఇవాళ నువ్వు దాటి వెళ్లిన ఈ గడప మళ్లీ తొక్కటానికి వీలులేదు—నీ జీవితంతో నీ భవిష్యత్తులో మాకెలాంటి సంబంధమూ వుండదు' ఇంక నీకు అమ్మా నాన్నా లేనట్లే. అని కేకలువేస్తారు' నాన్నగారి కోపం నాకు తెలిసిందే'

'అందుకని చెప్పకుండా వచ్చావా?' అన్నాడు వాసు ఎవ్వరికీ తెలియకుండా తను గొప్ప సంఘ సంస్కర్తలా పూనుకుని ఈ పెళ్లి చేయించాడు అనే నింద తనమీద పడుతుందేమో అనే భయం సంకోచం వ్యక్తం అయాయి అతని మాటల్లో.

'నిజంగా నేను చెప్పటమే జరిగితే అక్కడ ఎదురయే పరిస్థితి ఎలా వుంటుందో ఇప్పుడు చెప్పానుగా—

సినిమాలో దృశ్యం చూసినట్లు ఆ సంఘటనని అలా వూహించుకుని చెప్పుకోటానికి బాగనే వుంటుంది కాని నిజంగా అదే సన్నివేశం ఎదురయితే ఎలా తట్టుకోవాలో నాకు తెలియలేదు. అమ్మ ఏడుపు, నాన్నగారి కేకలు, చెల్లాయిల బేల మొహాలు వీటన్నింటి మధ్య నేను నిలదొక్కుకుని మాట్లాడగలననే నమ్మకం నాకే లేకుండాపోయింది. నన్ను పిరికివాణ్ణి అని నువ్వు వెక్కిరించినా సరే నేను చెప్తున్నాను. అన్నివైపులనుంచి వచ్చే ఆ ఒత్తిడికి తట్టుకోలేక నాకు నేనే అన్యాయం చేసుకుంటానేమో—నేను మనస్ఫూర్తిగా కోరుకున్న దానిని, జీవితాంతం పొందాలి అనుకున్న దానిని ఆ ఒక్క బలహీనమైన క్షణంలో వదిలేస్తానేమో, కళ్యాణిని చేజేతులా వదులుకుంటానేమో అనే భయంతోటే ఎక్కడా మాటమాత్రం చెప్పకుండా వచ్చేశాను... ఇక్కడ నీలాంటి పదిమంది స్నేహితుల్ని పిలుచుకుని ఏ దేముడి గుడిలోనో, రిజిస్ట్రారాఫీసులోనో పెళ్లి చేసుకుంటాం—పెళ్లి జరిగిపోయాక మా వాళ్లకి వ్రాస్తాను. మొదట వాళ్లకి కోపం వస్తుంది...కాని, కొన్నాళ్ల తరువాతయినా అన్నీ మరిచి వాళ్లు మమ్మల్ని ఆదరించగలిగితే సంతోషమే—లేక ఏనాటికీ వాళ్లు పట్టుదలలు వదలక పోయినా నేను విచారించను—అందర్నీ వదులుకున్నాననే బాధ కించిత్తయినా లేకుండా కళ్యాణి సహచర్యంలో జీవితం నందనవనం చేసుకుని శాంతిగా తృప్తిగా బ్రతకగలను. ఆ నమ్మకం నాకు వుంది' ఒక్కవూపులో చెప్పేశాడు మురళి.

'నువ్వు చెప్తున్నది వింటూంటే చాలా సంతోషంగా వుంది—అయినా నేను మరొక్కమాట చెప్పదలుచుకున్నాను. ఒక విధమైన ఉద్రేకంలో వేడిలో చేసుకున్న నిర్ణయాలు, ఏర్పరచుకున్న అభిప్రాయాలు ఒక్కొక్కసారి చాలాకాలం నిలవవు... నువ్వు చేసినపనికి పశ్చాత్తాపపడే రోజు రావచ్చు. నీ వాళ్లందర్నీ వదులుకున్నందుకు విచారించేరోజు రావచ్చు. ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే ఒక సంస్కరణయుతమైన పని చేయటానికి కేవలం విశాలహృదయం అభ్యుదయ భావాలు చాలవు. ఆ అభ్యుదయాన్ని ఆచరణలో పెట్టటానికి ఓ విధమైన తెగువ, మొండితనం, ఎలాంటి పరిస్థితులనైనా ఎదుర్కొని నిలబడగలిగే సంస్కారం వుండాలి...నిన్ను నిరుత్సాహ పరచాలనీ, నీ నిర్ణయాన్ని మార్చుకోమని చెప్పాలనీ నా వుద్దేశ్యం కాదు కాని, మా పిన్నికూతురు విషయం మాత్రం చెప్తాను. అది వింటే, నేను ఇంత చెప్తూ ఎందుకిలా మాట్లాడానో నువ్వే అర్థం చేసుకుంటావు.

(ఇంకా ఉంది)

# మంత్రివర్గంలో ఒక వనిత మాత్రమే

బ్రిటన్ కొత్త విద్య, విజ్ఞాన శాఖల మంత్రికి బంగారుజుట్టు, చక్కని ముఖం ఉన్నాయి. మంత్రికి సుగంధ ద్రవ్యాలు వాడే అలవాటు కూడా ఉంది!

శ్రీమతి మార్గరెట్ థాచ్చర్ కొత్త మంత్రివర్గంలో ఏకయిక స్త్రీ సభ్యురాలు. ఆమె వయస్సు 44 ఆమె ఇంతకి ముందు ఒకసారి — పోయిన కన్సర్వేటివ్ ప్రభుత్వంలో — జూనియర్ మంత్రి పదవిలో ఉండేవారు. శ్రీ విల్సన్ ప్రధాన మంత్రిగా ఉన్నప్పుడు ప్రతిపక్షం పయిపువింతో ప్రముఖంగా కూడా ఉండేవారు.

శ్రీమతి థాచ్చర్ మితంగా మాట్లాడే మనిషి. అయితే ఎంతో ఖచ్చితంగా, నిలకడగా ఉండే మనిషి కూడా. మార్దవంతోబాటు దృఢ సంకల్పం కూడా కల మనిషి.

## హోమ్‌వర్క్

'నా హోమ్‌వర్క్ (రాజకీయాలకి కావలసిన కృషి) విషయంలో ఎప్పుడూ ఎంతో శ్రద్ధ వహించాను. రాజకీయాలు నాకు ఒక రకం హాబీ వంటివి. నాటకాలు, పత్రికలకి రాయటంలాగ అది అలవాటయితే రక్తంలోకి జీర్ణించుకుపోతుంది!' అన్నారు ఆవిడ ఒక ఇంటర్వ్యూలో.

ఇక ఆమె రాజకీయ చరిత్ర—ఆమె మొదటిసారిగా ఫించ్లీ అనే నియోజక వర్గం నుంచి 1959 టోరీల తరపున ఎన్నిక అయ్యారు. రెండేళ్లలో పించన్లు, నేషనల్ ఇన్‌షూరెన్స్ మంత్రిశాఖలో జాయింట్ సెక్రెటరీ అయ్యారు

శ్రీమతి థాచ్చర్ మూడు రంగాలలో విజయం సాధించారు. ఆమె రసాయన శాస్త్రంలో రిసెర్చి చేశారు, బారిస్టర్ వృత్తిలో నెగ్గుకు వచ్చారు...

ఆమె తండ్రిగారిది కాయగూరల వ్యాపారం. గ్రామర్‌స్కూలు ముగించి ఆమె ఆక్స్‌ఫర్డ్ విశ్వ విద్యాలయంలో డిగ్రీ తీసుకున్నారు. తమ 23వ సంవత్సరంలో డార్ట్‌ఫర్డ్ అనే చోట ఎన్నికలకి నుంచుని వోడి పోయారు. అక్కడే ఆమె తమ కాబోయే భర్తని కలిశారు. డెనిస్ థాచ్చర్ ఒక రసాయన ద్రవ్యాల కంపెనీకి మానేజింగ్ డయిరెక్టర్.

1953 లో థాచ్చర్ దంపతులకి కవల పిల్లలు పుట్టారు. పురుడు పోసుకున్న నాలుగు నెలలలో బారిస్టర్ పరీక్ష పాసయ్యారు. ఏడు సంవత్సరాలు ప్రాక్టీసు చేశారు.

ఇంత నిండు జీవితంలో ఆమె తని స్త్రీ సహజమయిన అలంకరణ ప్రీతిని వదులుకో లేదు.

'పిలయినప్పుడెల్లా వారానికి ఒకసారయినా హెయిర్‌డ్రెస్సర్ దగ్గరికి వెళ్తా వస్తాను. లేకపోతే నాకు తోచదు. కొత్త డ్రెస్సు కన్నా హెయిర్‌సెట్ మీదనే నాకు ఎక్కువ ఇష్టం!' అంటారు ఆవిడ.

గృహిణి, తల్లి

శ్రీమతి థాచ్చర్ 1955 ఎన్నికలలో పాల్గొనలేదు. పిల్లలు ఎదిగే కాలంలో వారివద్ద ఉండాలని ఆమె అనుకున్నారు.

'ఈ రెండు బాధ్యతలనీ ఎలా తీరుస్తావని నన్ను అడుగుతూ ఉంటారు! అంతా పరిదిద్దుకొనటంలోనూ, సహకారంలోనూ ఉంటుంది! నేను రాజకీయాలలో ఉండటం

(64 వ పేజీ చూడండి)



మార్గరెట్ థాచ్చర్

[గతసంచిక తరువాయి]

## నా లు గు

స్థలం: రెండవ రంగస్థలమే

[రంగస్థలమంతా ఖాళీగా వుంది. సీతారాం మేడ మెట్లు దిగి వచ్చాడు. కాస్సేపు మాగజైన్లు తిరగేశాడు. ఏమీ తోచటంలేదు. సిగరెట్టు అంటించాడు. రేడియో ఆన్ చేశాడు. ప్రేమారావు కాఫీ తెచ్చి టీపాయ్‌మీద వుంచాడు.]

సీతారాం : ఆ. . . , ఏమోయ్, మన యుద్ధ వీరుడు నానారావుగారేరి?

ప్రేమారావు : గార్డెన్‌లో కూసున్నారండి. సెయినావోళ్లు అక్కడెక్కడో సెట్లసాటున దాక్కున్నారంట. . . . . సెట్టూపుట్టా అంతా గాలిం చేస్తున్నారు. తస్సారవలా. . . . దొరగోరు తుపాకీ పేల్చేరు. . . . . రెండు పిట్టలు లా అని కింద పడ్డాయ్. . .... ఒక్క దెబ్బకి రెండు పిట్టలు. . . . సిత్రంగా లేదండీ. . . . . ?

సీతారాం : అయితే ఆయన చేతులో తుపాకీ నిజం తుపాకీయేనా యేంటి? ఇంకా వుత్తుత్తిదనుకునాను...

ప్రేమారావు : అరి తస్సారవలా. . . ., ఆయన గోరి దగ్గర శానాశానా తుపాకీలున్నాయండి. . . . బాబుగోరు మాటల్లో పడిపోయారు. కాఫీ తీసుకోండి.

సీతారాం : అబ్బా. . . . ఈ కాఫీలు తాగలేక చస్తున్నాననుకో. ఏదీ, నువుకూడా ఒక పట్టు పట్టు. [సగం ప్లేట్లో పోసిచ్చాడు]

ప్రేమారావు : తస్సారవలా. . . . . అందుకు సందేహం లేదండి. . . . [పుచ్చుకు—తాగి టీపాయ్‌మీదుంచాడు. అక్కడేవున్న పేపరులోని ఒక ప్రకటన అతని దృష్టి నాకర్షించింది. పేపరు చేతిలోకి తీసుకున్నాడు]

అరి తస్సారవలా. . . . ఇది సూడండి. . . . సూశారామీరు ? నూతన నటీనటులు కావలెను. వయస్సుతో సంబంధము లేదు. చదువుతో సంబంధము లేదు. నటనానుభవం అక్కరలేదు. అందమూ ఆకారమూ వున్నా లేకపోయినా ఇబ్బందిలేదు. సంపన్నుల కుటుంబాలో నుంచి వచ్చినవారికి ఎక్కువ అవకాశాలుంటాయి. అందరూ వెంటనే సంప్రదించండి. పది రూపాయిలు 'యమ్: వో' చేస్తూ వెంటనే దరఖాస్తులు పంపండి. ఆలసించిన ఆశాభంగం! నేడే త్వరపడుడు! —సూశారండి బాబుగోరూ. . . .ఇది సూశారండి. . . . ?ఇప్పుడే రాసి పారేస్తా. . . . ఒక్క దెబ్బన హీరోనయిపోతా:

సీతారాం : మరేనోయ్. . . . రాయి రాయి. అందుకు తగిన యోగ్యతలన్నీ నీలోవున్నాయి. అదిసరే. ఇప్పటిదాకా నీ ప్రయత్నాల్లో ఏ ఒక్కటీ ఫలించలేదూ. . . . . ?

ప్రేమారావు: ఎక్కడండీ. . . . .ఎక్కేగడపా, దిగేగడపా! హీరోయాసాలు కాకపోతే, తస్సారవలా... ఎగ్‌స్ట్రా యేసాలన్నా దొరకడం లేదండి. ఇదిగో అవకాశం వచ్చేసింది కదండీ. . . . యింక హీరో నయిపోవడం ఖాయమేనండి.

సీతారాం : నీకు సరిగ్గా మాట్లాడ్డమే చేతకాదు . . . హీరో వేషాలేం వెయ్యగల్గుతావోయ్. . . . మాట్లాడ్డం బాగా నేర్చుకోకూడదూ. . ?




ప్రేమారావు : తస్సారవలా. . . . ఏందండి బాబూ. . . . మీరుకూడా అలాగే మాట్లాడతారు. . . .! ఇదిగో ఈ పెకటన సూడండి. . . . మరోపారి సదివి సూడండి. . . . హీరోయేసాలకి మాట్లాడ్డం సేతకానక్కరలేదండి... . . అదేంటో డబ్బింగుట. . . . అది సేసెయ్యొచ్చునంటండి. అయినా, ఈ హాల్ సినిమా మొత్తంలో బాగా మాట్లాడే వోరిని ఒకరిని సూపించండి. ఒకోరిదీ ఒకో బాస. ఒకోరిదీ ఒకో యాస. అలాగే నాదీని, సెప్పండి. . . . నన్నేం డైలాగు సెప్పమంటారు. . . . . . ? డైలాగులే కాదండి.. . . డైచొక్కాలు కూడా సెప్పెయ్యగలనండి. . . . నాను సెప్పినట్టు ఏ పెద్ద యాక్టరు సెప్పలేడండి. . . . అరిచ్చెంద్ర నాటకంలోది సెప్పమంటారా. . . . కాసుకోండి! 'ధన కనకవస్తు వాహనాదులెన్నయినా ధర్మముతో సరిగావు దుర్యోధనా. . . .'

సీతారాం : [నవ్వాడు] బాగుంది బాగుంది. . . హరిశ్చంద్ర నాటకంలో దుర్యోధన పాత్ర బేషుగ్గా వుంది మాణిక్యం . . . భలే బాగుంది.

ప్రేమారావు : అరి తస్సారవలా. . . . మీరూ మాణిక్యమనే పిలుస్తున్నారు. సక్కనైన పేరు ప్రేమారావుండగా— అదేం పేరుండి. . . . ? సదువుకొన్నోరు కదా. . . . ప్రేమారావని పిలవకూడదేంటంటి?

సీతారాం : మరే. . . . మరే. . . . మరచిపోయాను. నువు ప్రేమారావువి కదూ. . . .! అయినా అదేం పేరోయ్. . . . . నీ మొహ్నానో. . నీ రోమియోవో పెట్టుకోవలసిన పేరు నువు పెట్టుకున్నావేమిటి?

ప్రేమారావు : అద్గదే. . . . తస్సారవలా. . . అందులోనే వుందండీ ఎంతున్నా. ఆ పేరు పెట్టుకుంటే నాకు సినిమాల్లో శాన్సొస్తుందని. . . సెట్టుకింద సిలకమ్మ సెప్పిందండి. నా అసలు పేరు ప్రేతాపురం మాణిక్యారావండి . . . ప్రేతాపురంలో 'ప్రే' మాణిక్యంలో 'మా' రావుకి జోడించేశానండి. . . . . ప్రేమారావయి పోయిందండి. . . ఎప్పటికయినా అదే లక్కీ పేరవుద్దని సిలకమ్మ సెప్పింది కదండీ. . . .! ఎలా వుందండి. . . . బాగోలేదా. . . . ?

[తలుపు తట్టిన చప్పుడైంది.]

సీతారాం : ఆ. . . బాగనేవుంది. చూడు, ఎవరో వచ్చినట్టున్నారు.

ప్రేమారావు : [తలుపుతీశాడు] ండి డాక్టరుగారూ. . . . రండి. . . .

డాక్టరు : [వచ్చాడు] గుడ్‌మార్నింగ్ సీతారాం గారూ. . . . . .

సీతారాం : హలో. . . . గుడ్‌మార్నింగ్. . . . గుడ్‌మార్నింగ్. . . .రండి. . . కూర్చోండి.

డాక్టరు : [కూర్చున్నాడు.]

సీతారాం : చూడు మాణిక్యం. . . . . సారీ. . ప్రేమారావ్. . . . .డాక్టరుగార్కి కాఫీ తీసుకురా.

ప్రేమారావు : సిటికెలో తెస్తానండీ. . . [వెళ్లాడు]

సీతారాం : డాక్టరుగారూ. . . . ఎవర్నో పెద్ద డాక్టరుగార్ని కన్సల్ట్ చేసి చెబుతానన్నారు కదూ. . ? కన్సల్ట్ చేశారా. . . . ? నా రాధ జబ్బు నయమవుతుందంటారా. . . . . ?

డాక్టరు : డాక్టరు రంగారావు గారని. . . . పెద్ద మెంటల్ స్పెషలిస్టు!

ఆయనకి రాధమ్మగారి రిపోర్టు చూపించాను. నాకయినా ఆయనకయినా అనిపించేది ఒక్కటే. రాధ జనరల్ హెల్త్ చాలా బాగుంది. కాదంటే కాస్త బలహీనత. శారీరకంగా ఎలాంటి అనారోగ్య చిహ్నాలుగా కనిపించడం లేదు. చాలా పరీక్షలు చేసి చూశాను. రాధ మెంటల్ పేషెంట్ కావడానికి వీల్లేదు. . . . రాధ ఒక బిడ్డకి తల్లి అనే విషయం నా పరీక్షలవల్ల తెలిసిపోయింది . . కాని, ఇంతా చూస్తుంటే నాకు చాలా అగమ్యగోచరంగా వుంది.

సీతారాం : రాధ ఒక బిడ్డకి తల్లి అనే విషయం మీకు తెలిసిందికదా. . . . ? ఇంతకీ రాధకి జ్ఞాపకశక్తి నశించిందంటారా. . . . ?

డాక్టరు : అబ్బే. . . . . నాకు అలాంటిదేమీ కనిపించడంలేదు. . . . . రాధ మెంటల్ పవర్ పెర్ఫెక్ట్లీ ఆల్‌రైట్. . . . . !

సీతారాం : [జేబులోంచి నోట్లు తీశాడు] వున్న పరిస్థితి మీకు అర్థమైపోయింది కదా. . . . రాధ మెంటల్ పేషెంటే. ఎలాగయినా ఆమె జబ్బు నయం చెయ్యాలి మీరు. . . . ఇది మీదగ్గరుంచండి [ఇచ్చాడు].

డాక్టరు: వాడ్యూ యూమీన్. . . . ?

సీతారాం : ఏముంది? రాధ నా ప్రాణం. . . . ఆమెకి స్వస్థత కలగకపోతే నేను బ్రతుకలేను. రాధ ఎంత తొందరగా కోలుకుంటే అంత తొందరగా మా సంసారం కుదుటబడుతుంది. మీరు ఆమెను కాపాడాలి. . . . .

డాక్టరు : మీ బాధని అర్థం చేసుకోగలను. కాని, మిస్టర్ సీతారాంగారూ. . . . ., నేను కేవలం డాక్టర్ని. డాక్టరు దేవుడు కాలేడుగా. . . .

ప్రేమారావు: [కాఫీతో వచ్చాడు. డాక్టరుగారి కిచ్చాడు] తస్సారవలా రాధమ్మగారు ఒకటే సిందులేసేస్తున్నారండి. . . . . అన్నం ముట్టుకోవడం లేదు, ఏమీ తినడంలేదు. ఆగాలాగయితే యింకేమన్నా వుందా ? ఆరోగ్యం పాడైపోదూ. . . . . ? డాక్టరుగారు వచ్చేరంటే సాలు, అమాంతం ఆవేశపడిపోతున్నారు. . . . . ఫిట్సుకూడా వస్తున్నాయండి. . ... [డాక్టరుతో] బాబూ. . . . రాధమ్మగారిని మళ్లీ మనిషిని సెయ్యండి బాబూ. . .. !

డాక్టరు : [కాఫీ తాగి కప్పు టీపాయ్ మీదుంచాడు] అరెరె. . . . నదు చూద్దాం. మీరు కూడారండి సీతారాంగారూ. . . . . .

సీతారాం : వద్దులెండి డాక్టర్ . . . . నన్ను చూస్తే మరీ రెచ్చిపోతోంది. నన్నిలా వుండనివ్వండి.

డాక్టరు : సరే. . . . !

[డాక్టరూ, ప్రేమారావూ లోపలికి వెళ్లారు. సీతారాం ఒంటరిగా మిగిలాడు. సిగరెట్టు కాలుస్తూ పచార్లు చెయ్యసాగాడు. రేడియో సంగీతం అతనికి విసుగనిపించింది. రేడియో కట్టేశాడు. మళ్లీపచార్లు ఆరంభించాడు. డాక్టరూ, ప్రేమారావూ, శాంతమ్మ వచ్చారు.]

సీతారాం : [లేచునిలిచి] ఏం డాక్టరుగారూ. . . . నా రాధకెలావుందిప్పుడు?

డాక్టరు : ఫిట్సు వస్తున్నాయి. బలహీనత. అంతకంటే ఏంలేదు. మానసికంగా చాలా ఘర్షణ పడిపోతోందామె. పూర్తి రెస్టు కావాలిప్పుడు. ఎవరూ పలకరించకండి.

శాంతమ్మ : డాక్టరుగారూ. . . . మళ్లీ రాధ మామూలుకి వస్తుందంటారా?

డాక్టరు : ఇప్పుడు రానిదేముంది? ఆమె గురించి బెంగేమీ అక్కరలేదు. ఆమెని బాగా రెస్టు తీసుకోనివ్వండి. . . . .

ప్రేమారావు : డాక్టరుబాబుగారు సల్లనిమాట సెప్పారు. తస్సారవలా. . . . ఇంకేం భయంలేదు. రాధమ్మగారికి యిట్టేనయమైపోతాది.

డాక్టరు : వస్తాను సీతారాంగారూ . . . కొంచెం ధయిర్యంగా వుండండి. వస్తాను శాంతమ్మగారూ.!

[ప్రేమారావు అతన్ని సాగనంపి తిరిగివచ్చాడు]

సీతారాం : ఏంటో అక్కయ్యగారూ. . . . ఇదంతా చూస్తుంటే గుండె తరుక్కుపోతోంది. నిక్షేపంలాంటి రాధకి ఈ తెగులేమిటి చెప్పండి. . .!

శాంతమ్మ : రోగాలు మనుషులకి కాకపోతే మానులకొస్తాయా? రోగాలూ భోగాలూ చెప్పిరావు నాయనా అనుభవించాల్సిందే తప్పదు. . . . .

సీతారాం : అంతేనంటారా? [బాధపడిపోతూ] అసలు నేను రాకుండా వున్నా బాగుండిపోను. నేను యిక్కడికి రావడంవల్లనే కదా, నా రాధకి ఇలాంటి జబ్బొచ్చి పడింది? అక్కయ్యగారూ. . . ., పోనీ, కొన్నాళ్లు దేశంమీద తిరిగొస్తాను, అప్పటికయినా రాధ మామూలు మనిషి అవుతుందేమో!

శాంతమ్మ : నువ్వలా అనకునాయనా. నువ్వు ఈ యింట్లో ఒకడివై పోయావు. నువ్వు వెళ్లిపోతే ఏదో వెలితిగా ఉంటుంది. నువ్వుంటే అదో ధైర్యం. . .! తెలుసుగా మగదిక్కు లేనివాళ్లం.. . . ! ఇదిగో. . ఈ దేభ్యమూ వున్నాడు.. . . ఎందుకూ. . . . ?

ప్రేమారావు : ఆదేంటండమ్మగారూ. . . . తస్సారవలా. . . . నన్ను హీరోని కానివ్వండి. . . మేక్కరుగా నా తడాకా సూపిస్తాను. . .

శాంతమ్మ : ఆ . . . . కావాల్సిందే ట్రాక్టరు. అయినా నీ మొఖానికెవడు చెప్పాడ్రా యాక్టరువవుతావని. . . . . ?

ప్రేమారావు: . . . అలా అనకండమ్మగారూ. . . . నాకు కోపమొస్తాది.

శాంతమ్మ: రానివ్వకు నాయనా. . . . రానివ్వకు. అందరి కోపాలూ భరించుకునే శక్తి నాకులేదు. పూ..

సీతారాం : అక్కయ్యగారూ. . . . చాలా అలసిపోయినట్టున్నారు. . . . మీరూ కొంచెం రెస్టు తీసుకోండి. . . . .

శాంతమ్మ . మా నాయనే. . . మా నాయనే! ఇన్నాళ్టికి ఈ శాల్తీకి కూడా రెస్టు కావాలని నువ్వు పసిగట్టావు నాయనా! ఇంతకాలం నుంచి వుంటున్నావా వీడూ? ఒక్కసారన్నా—ఏదీ, శాంతమ్మగారు పనిపాట్లు చేసుకోలేక అలిసిపోతున్నారు—అని ఒక్కమాట అనగలిగాడా. . . . బోరాం పోతులా. . . తిండికిమాత్రం. . . . తిమ్మరాజా. . . .

ప్రేమారావు అరె తస్సారవలా. . . ., మీరసలు అలిసిపోలేకదమ్మా అలిసిపోయేరనడానికి?

శాంతమ్మ : పోరిసి. . . నేను అలిసిపోవడమే లేదుట్రా? లంకంత ఈయింటి చాకిరీ అంతా ఎవరు చేస్తున్నట్టు?

ప్రేమారావు : చేస్తున్నారు. సరి సరేలెండి సూసుకొంటున్నారు ఇంక మీరు సెయ్యాల్సి పనేమిటుంటుందమ్మగారూ తస్సారవలా. . . . భోంచెయ్యడం తప్పితే. . . . !

శాంతమ్మ : నీ తెలివితెల్లారా. . . . సంతోషించాం గాని నోరు మూసుకో. అయితే అల్లుడుగారూ, ఇంతకీ, డాక్టరుగారి మీద నమ్మకముందా ?

సీతారాం : నమ్మాల్సిందే . . . . మనకేం తెలుస్తుంది? రాధకి పిచ్చి లక్షణాలు ఏమీ కనిపించడం లేదట. . . . . జ్ఞాపకశక్తి కూడా బాగానే వుందట. . . తగ్గిపోతుందని. . . . వోపిక పట్టండి అంటున్నారు. . . .

శాంతమ్మ: ఈ డాక్టర్లెప్పుడూ అంతే నాయనా.. కాస్సేపటికి గుటుక్కుమనే వాళ్లని కూడా నూరేళ్లు బతుకుతారంటారు. లేకపోతే డాక్టర్లు బ్రతికేదెలాగ? అది సరే. . . ., రాధ విషయంలో అసలు మీకేమనిపిస్తోంది?

సీతారాం : రాత్రింబగళ్లు ఆలోచిస్తున్నాను అనుకోడానికి ఏమీ తర్కం లేదు. షాక్ తగలడం కూడా అసంభవమనే తెలుస్తోంది కదా. . . . ?

శాంతమ్మ : నాకో మార్గం కనిపిస్తోంది నాయనా.

సీతారాం : చెప్పండక్కయ్యా. . . .

శాంతమ్మ : రాధకి ఏమాత్రం నయంగా వున్నా మీ యిద్దరికీ మళ్లీ పెళ్లిచేసేస్తాను. కాపురం చేసుకుంటుంటే ఎంతెంతటి రోగాలూ తక్కువ కుదురుతాయి.

సీతారాం : మీరు తొందరపడుతున్నారక్కయ్యా . . . . అనవసరంగా అభాసు అయిపోవడం నాకిష్టంలేదు. ఇప్పటికే జరిగిన అవమానం చాలు. రాధని బాగుపడనివ్వండి. 'తప్పు తెలుసుకున్నాను— మీరే నా భర్త' అని తనకు తానుగా రాధ చెప్పేవరకూ నాకు పెళ్లివిషయం తలపెట్టాలనిలేదు. నలుగురూ అంగీకరించినా, అంగీకరించకపోయినా దైవసాక్షిగా మా పెళ్లి అయిపోనే అయిపోయింది.

శాంతమ్మ : పోనీ. . . . ఒక పని చేస్తే మేమిటి? మీ యిద్దర్నీ పుణ్యక్షేత్రాలకని పంపిస్తాను. ఆ తిరగడంలోనయినా రాధ నీకు దగ్గరకావచ్చు. అన్యోన్యత కుదరొచ్చు. ఏమంటావ్. . . . ?

ప్రేమారావు : అప్పలు బాబుగారి మాటెత్తితే అగ్గిమీదగుగ్గిలమైపోతున్నారు రాధమ్మగారు. . .. తస్సారవలా కలిసి పుణ్యక్షేత్రాలు దరిసించడానికి ఒప్పుకుంటారంటారా?

సీతారాం : ఆ మాటా నిజమే. అందువల్ల, ప్రయోజనం వుంటుందని నేననుకోను.

శాంతమ్మ : యింకొక్కటే మార్గం కనిపిస్తున్నది. మీ యిద్దర్నీ ఒకచోట కూర్చోబెట్టి వ్రతాలూ నోములూ నోయించాలి. దాని ప్రభావం కొంతకాకపోతే కొంతయినా వుండక పోదు.

సీతారాం : నాకయినా రాధ అంగీకారం కావాలి కదా. . . .

శాంతమ్మ : ఆ . . . . అంగీకారమూ సింగినాదమూనూ. చచ్చినట్టు ఒప్పుకుంటుంది. అయినా అల్లుడుగారూ, మగవాడికి పౌరుషం వుండాలేగాని

ఓడదెంత సేపూ లొంగడానికి? ఆహా. . . . రాధ దారిలోకి రాడానికి నేనూ ప్రయత్నిస్తాననుకోండి . . . . ! మీ పెళ్లి యిదివరకే అయిపోయిందా? పిల్లకూడానా? ఇంకా జంకెందుకంట?

ప్రేమారావు : అమ్మగోరు రాధమ్మగోరి మనసు తెలిసి మాట్లాడ లేదు. తస్సారవలా, రేపేదయినా జరిగిందంటే అందుకు పాపం అనుభవించేది మనవే.

శాంతమ్మ : పోరా, నీ శ్రీరంగనీతులూ నువ్వూను. మొగుడూ పెళ్లాలమధ్య తగపులెంత సేపురా నిలుస్తాయి. . . . ? పెళ్లికాని వెధవ్వి. . . . నీకేం తెలుసు?

సీతారాం : మీరు చెప్పిందాంట్లో కొంతవరకు నిజం లేకపోలేదు. కాని, ఒకవిషయం మరచిపోతున్నారు మీరు— రాధ దృష్టిలో నేను ఆమె భర్తనికాను. పరాయివాడిని. ఆ పరాయి తత్వం మారేవరకూ. . . నాకు నేనుగా రాధని ఏ విషయంలోనూ బలవంతం చెయ్యడం నా కిష్టంలేదు.

శాంతమ్మ: అల్లుడుగారి మనసు వెన్నలాంటిది. మిమ్మల్ని కట్టుకున్న రాధ ఎంత అదృష్టవంతరాలు? ఎందుకులెండి....అదో నల్లరాయి. గ్రహింపు వుంటేనా? ఒరే మాణిక్యం.......వెళ్లి.....

ప్రేమారావు:ఆఁ..... వెళ్లి......?

శాంతమ్మ: నీ ముఖం చూస్తేనే పని మరచిపోతాన్రా. దేభ్యం ముఖమూ నువ్వూనూ.

ప్రేమారావు: తస్సారవలా. . . .మీరు మరిచిపోయిందానికీ నాకేనా తిట్లు......? ఇదెక్కడి అన్యాయమమ్మా......చెప్పండి, ఏం చెయ్యమంటారు?

శాంతమ్మ: ఆ....[జ్ఞాపకమొచ్చింది] వెళ్లి... శాస్త్రులగారి దగ్గరికెళ్లి పెళ్లికి ముహూర్తం పెట్టించుకురా.....

సీతారాం: పెళ్లికా.....?

ప్రేమారావు: అరి తస్సారావలా.....

శాంతమ్మ: నామతి మండిపోనూ. సత్యనారాయణ వ్రతానికి ముహూర్తం పెట్టించుకురా, పో...!

ప్రేమారావు! తస్సారవలా......అదాండి విసయం వస్తానండి......[వెళ్లబోతాడు]

శాంతమ్మ: ఆ.....అప్పుడే వెళ్ళబోకు. అల్లుడుగారికి భోజనానికిఅన్నీ అమర్చి వెళ్లు. రండి అల్లుడుగారూ......మీ కిష్టమని బంగాళాదుంపలు వేయించాను.

ప్రేమారావు: తస్సారవలా.....ఆ కూర నాకూ ఇష్టమేనండి.

శాంతమ్మ: మంచిది, తగులడు!

[ముగ్గురూ వెళ్లిపోయారు]

—తెర—

## అయిదు

స్థలం: తోట [మొదటి రంగస్థలమే]

[రాధ దిగులుగా బెంచిమీద కూర్చుని వుంది. లలిత ఆడుకుంటోంది]

సీతారాం: [వచ్చాడు. పాపని ఎత్తుకుంటాను రమ్మని సంజ్ఞ చేశాడు. పాప వచ్చింది. ఎత్తుకున్నాడు]

రాధ: [చూసింది. కోపంతో ఆమె ముఖం జేవురించింది] లలితా.....! దిగు కిందికి......!

[లలిత నెమ్మదిగా కిందికి జారిపోయింది]

సీతారాం: ఎందుకు రాధా.......నామీద నీ కింత కసి......నీ కోపంలో నన్ను మసి చేసినా వప్పుకుంటాను. కాని, ఆ పసిపిల్ల నెందుకలా కసురుకుంటావు....

రాధ: అనవసర ప్రసంగం కట్టిపెట్టి మర్యాదగా యిక్కడినుంచి నడు.

సీతారాం: ఎంత కక్ష సాధిస్తున్నావ్ రాధా... ఎంత శిక్ష వేస్తున్నావ్......రాధా.....!

రాధ : తెలిసి పాపం చేసే మోసగాళ్లని ఆ భగవంతుడే శిక్షిస్తాడు. మానవులకి సాధ్యంకాదు. ఆరోజు వస్తుంది. అనుభవిద్దువుగాని.

సీతారాం : రాధా. . . నువ్వామాటలు ఎందుకంటున్నావో నాకు తెలుసు. పాపపుణ్యాలు నీకు తెలుసు. నేను చేసిన నేరం నాకు తెలుసు. నీ వుత్తరాలకి సమాధానం ఇవ్వకపోవడంలో నాకు వేరే ఉద్దేశ్యమేమీలేదు. దయాదాక్షిణ్యాలు లేకుండా నిన్ను వంటరిగా విడిచి అయిదేళ్లు గడిపేశాను. . . . నిజమే. . పోనీ. . . ., ఆ అయిదేళ్ళ జీవితంలోనూ నా ప్రవర్తనలో మార్పులేదని సర్టిఫికేట్లు కావాలా. . . . . చెప్పు. . . . .

రాధ : అవసరంలేదు. . . . నువ్విక్కడ నుంచి బయటికి నడిస్తేచాలు.

సీతారాం: రాధా. . . . నా రాధా. . . . ! ఎంత కర్కశంగా మాట్లాడుతున్నావ్. . . .? నీకు ఏమయిందని? నీ కేమయింది? పోనీ, పూర్వం కథ విడిచిపెట్టేయ్. నాలో ఏం తక్కువని నన్ను దూరం చేసుకుంటున్నావ్? అందం. . . . ఆస్తి. . . అనురాగం. . . . . ?

రాధ: ఒక్కటే తక్కువ. . . . . గుణం!

సీతారాం : నీ ఆవేశంలో అర్థంలేదు రాధా. . .! నిండా పాతికేళ్లులేవు నీకు. . . . . ? జీవితాన్ని ఎందుకు వ్యర్థం చేసుకుంటావు? అందాన్ని నీ యవ్వనాన్ని అడవికాచిన వెన్నెలలా ఎందుకు వృధా చేసుకుంటావు. . . . . నా మాటవిను. . . . నీ పంతం విడిచిపెట్టు. . . . .

రాధ: కట్టిపెట్టు నీ పేలాపన. . . . ! అసలు నువ్విక్కడి కెందుకొచ్చావ్. . . . . ?

సీతారాం : ఒకభర్త భార్య దగ్గరికి ఎందుకు వస్తాడో అందుకు.

రాధ: ఎవరు నీ భార్య. . . . ?

సీతారాం : నీకుతెలియదా.. . . ? అడుగు ఎవరి నడుగుతావో. . . . మీ అమ్మనడుగు. ప్రేమారావు నడుగు. శాస్త్రులగార్ని అడుగు. మీ నాన్ననడుగు ఆ దేవుడ్నడుగు. నేను నీ భర్తనని. . . . నువు నా భార్యవని లోకమంతా కోడైకూస్తుంది. . . .

రాధ : అవును. నీ మోసంతో లోకం కళ్లు కప్పేశావు. నన్ను పిచ్చిదాన్ని చేసేశావు. వాళ్లంతా సాక్ష్యం రాకేమవుతారు? కాని, ఒక విషయం జ్ఞాపకం పెట్టుకో. లోకం దృష్టిలో నువు నా భర్తవి కావచ్చు. . . . . కాని, నా దృష్టిలో కాదు. నా బొందిలో ప్రాణముండగా నువు నా అనురాగాన్ని పొందలేవు. చచ్చినతర్వాత కూడా నన్ను తాకడానికి నీకు అర్హతలేదు. తెలిసిందా?

సీతారాం : హు. . . . , చాలా పెద్దశిక్ష!

రాధ: అవును. ఇలా విను. నువు నాపై ఏఆశలు పెట్టుకుని ఈ యింట్లో ప్రవేశించావో....ఆ ఆశలన్నీ ఎప్పుడో ఒకప్పుడు పేకమేడలా కూలిపోతాయి నువ్వు ధ్వంసమైపోతావు. నిజం నిప్పులాంటిది. దాన్ని దాచాలని ప్రయత్నం చేసినా—కాల్చుకుని మరీ బయటకు వస్తుంది. నీ బండారం బయటపెడుతుంది. నీ బ్రతుకుబండ అవుతుంది. జ్ఞాపకముంచుకో.....ఆరోజు నిన్ను కాపాడేవాళ్ళు ఎవరూ వుండరు.

సీతారాం: నువ్వు నన్ను అనవసరంగా అపార్థం చేసుకుని వూరికే శపించేస్తున్నావు రాధా.....! నేను చాలాచాలా ఓర్పు వహిస్తున్నాను. నేను తలచుకుంటే నిన్ను వశం చేసుకోవడం అంత కష్టంకాదు. సహనానికి కూడా ఒక హద్దంటూ వుంటుంది. ఆ హద్దు దాటిం తర్వాత భార్యాలేదు......పిల్లలూ లేరు! ఇప్పటిదాకా నాలో మానవత్వాన్ని చూసిన నువ్వు నాలో దానవత్వాన్ని కూడా రుచి చూస్తావ్....? నన్ను అనవసరంగా రెచ్చగొట్టకు.

రాధ: భయపెడుతున్నావా?

సీతారాం: లేదు. ఒక సన్నిహితుడుగా హితబోధ చేస్తున్నాను.

[ప్రేమారావు తొంగి చూస్తున్నాడు. అతన్ని కనిపెట్టాడు సీతారాం.]

రాధ: నీ సాన్నిహిత్యంకోసం ఎవరూ ఏడవడం లేదిక్కడ. తమ అధిక ప్రసంగం కట్టిపెట్టి ఇక వెళ్లొచ్చు!

సీతారాం: ఏమిటి రాధా.....యింత మంకుపట్టు. [పాపని చూశాడు] లలితా...... లలితా.....ఇలా రామ్మా.......రా.....

రాధ: వెళ్ళకు.

సీతారాం: నువు చాలా అనుచితంగా ప్రవర్తిస్తున్నావు రాధా. లలితమీద నీ కెంత అధికారముందో, అంత అధికారం నాకూ వుంది.

రాధ: లలితమీద నీకు అధికారమూలేదూ, అనురాగమూలేదు. మమ్మల్నిలా బ్రతకనియ్. అంతే చాలు.

సీతారాం: ఎందుకు రాధా.....నీ మనసింత పాషాణమైపోయింది? ఒక్క రెండేళ్లు ఆలశ్యం చేశానని నా కింత భయంకరమైన శిక్షా......? నిత్యమూ నీ అనురాగంకోసం—నీ అనుబంధంకోసం—ఎంతగా పరితపించిపోతున్నానో తెలుసా? నువు మారతావని—నన్ను కోరతావని ఇంతకాలమూ ఎన్నో ఆశలుపెట్టుకు కూచున్నాను. మన కాలేజీరోజులు జ్ఞాపకంతెచ్చుకో! ఎంత సరదాగా గడిపాం....? నువు ఒక రోజున ఏమన్నావో జ్ఞాపకముందా? రాం...ఎప్పుడూ నీ హృదయంలోదాగి ఉండాలని......నీలో నేను అయిక్యమైపోవాలని తహతహలాడిపోతున్నాను అన్నావు. ఒక్కసారి కాదు, లక్షసార్లు! నువ్వే చెప్పు, నిజమో కాదో?

రాధ: ఆ మాట అన్నమాట వాస్తవమే.....!

# పద్మవ్యూహం

వి, సీతాకాదు......!

సీతారాం: ఎంత నిర్దయగా మాట్లాడుతున్నావు రాధా......! అంత తియ్యని మాటలు ఇంత తొందరగా ఎలా మరచిపోయావు? నన్నెందుకిలా హింసిస్తున్నావు......?

రాధ: మిస్టర్ సీతారాం......! నువ్వేం మాట్లాడతున్నావో, ఎందుకు మాట్లాడుతున్నావో—నీ అంతరాత్మకి తెలుసు. నా ఆత్మకి తెలుసు. అనవసరంగా కంఠశోష పెట్టుకోకు. ఆ కాలం మరో సద్వినియోగమయ్యే పనికి వినియోగించుకో. వెళ్ళు. ఇక్కడ నుంచే కాదు, ఈ యింటినుంచి ఈ వూరునుంచే వెళ్ళిపో......నా కళ్ళకి దూరంగా వెళ్ళిపో....నువ్వు ఎంత తొందరగా వెళ్ళిపోతే అంత మంచిది. నువ్వూ నేనూ యిద్దరం......ఈ యింట్లో వుండగల్గడం అసంభవం. నువ్వో నేనో తేలిపోవాలి....లేకపోతే నువ్వు నా శవాన్నే చూడగల్గుతావ్......!

సీతారాం: హు......ఎందుకులే రాధా.....! అంతంత పెద్ద మాటలనకు. ఇంత తెలివిగా మాట్లాడుతున్న నిన్ను పిచ్చిదానివని నేనెలా అనుకోను? నీ మనసులో ఏదో వుంది.....రహస్యం చెప్పడం లేదు నువ్వు. నన్ను చిత్రహింసకి గురి చేస్తున్నావు....ఇది నీకు భావ్యం కాదు రాధా.....నువ్వే నా సర్వస్వంగా ఎంచుకుని యింతవరకూ బ్రతికున్నాను. నువ్వు లేనినాడు ఈ బ్రతుకు నిరర్థకం.....నా మాట విను రాధా...., నన్ను అర్థం చేసుకోడానికి ప్రయత్నించు. [దగ్గరికి రాబోయాడు

రాధ: రాకు. దగ్గరికి రాకు. నిన్ను కొట్టేననే అపవాదు నాకొద్దు. కాదంటే నీ యిష్టం.......!

సీతారాం: రాధా.......! ఇక నీ మనసు మారదా..?

రాధ: నా మనసు ఎప్పుడూ కటే! మారడానికి వీలులేదు. నువ్వు మనసు మార్చుకోగలిగి బ్రతికిపోతావ్. లేకపోతే అనుభవిస్తావ్.......తప్పదు.....

సీతారాం: అంతేనంటావా? నీ మాట నీదేనా.... నా మాట వినవా.......

రాధ : మనిషనే వాడికి ఒకసారి చెబితే తెలుస్తుంది. . . . ఫో. . . .

సీతారాం : నీ నిర్ణయం మారదుకదూ. . . . ?

రాధ: మారదు మారదూ, మారదు. ఫో, యిక్కడ్నుంచి.

సీతారాం : సరే. . . . ! కాని ఒకటి మాత్రం గుర్తుంచుకో. . . . నువు ఛీ అన్నా, చీదరించుకున్నా నీ శ్రేయస్సే నాకు కావలసింది. మరో విషయం, ఇదికూడా విను. నువు నా భార్యవని అందరికీ తెలుసు. ఏదో రహస్య వివాహమని అనుకుంటున్నారంతా. ఈ రహస్యాన్ని విడగొట్టేస్తాను. అందరి సమక్షంలోను నీకు తాళి కడతాను. అందరితోపాటు—నీ అంతరాత్మచేత కూడా భర్త అనిపించుకుంటాను. భర్తగా అధికారం సంపాదించుకుంటాను. అప్పుడు కూడా నువు మారకపోతే, అది నీ ప్రారబ్ధం. మంచిగా చెప్పి చెప్పి విసిగిపోయాను. ఇకనేను నిన్ను విసిగించదల్చుకోలేదు. వస్తాను, సెలవ్. . . . !

[దురుసుగా వెళ్ళిపోయాడు]

రాధ: [కుమిలి కుమిలి ఏడవసాగింది.]

ప్రేమారావు : [ హడుమంచి వచ్చాడు] అమ్మా. ఎందుకమ్మా ఏడుస్తున్నారు?

రాధ : మాణిక్యం. . . . ! ఈ ఏడుపు నా జీవితాంతమూ వుండేదే మాణిక్యం. . . . . !

ప్రేమారావు : ఎందుకమ్మా. . . . బతుకునిలా బండలు చేసుకుంటారు? బాబుగారి మాటలన్నీ నేను విన్నాను. ఆయన శానా మంచోరమ్మా. మీరంతగా పట్టుపట్టడం బాగోలేదమ్మా. . . .

రాధ: మాణిక్యం. . . . !

ప్రేమారావు: అవునమ్మా, ఆయనగోరు మిమ్మల్ని బతిమాలడం సూస్తే నాకే గుండె సెరువై పోయింది తస్సారవలా. . . ., నామాట యినండమ్మా. సుఖంగా సంసారం సేసుకోండి. బతుకు సేతులారా నాశనం సేసుకోకండి.

రాధ : మాణిక్యం. . . . నువ్వేనా యీ మాట అంటున్నది?

ప్రేమారావు : అవునండమ్మా, మీ కథ తెలిసిన ఎవరన్నా యీమాటే అంటారమ్మా! మీకోసం కాకపోయినా [లలితని దగ్గరకి తీసుకున్నాడు] ఈతల్లి కోసమైనా మీరాయనతో సంసారం దిద్దుకోవాలమ్మా. . . . . సిన్నోడినో, పెద్దోడినో సెబుతున్నా నా మాట యినండమ్మా. . . . !

రాధ : [ బాధగా] మాణిక్యం. . . మాణిక్యం... మాణిక్యం. . . . ! నీకెలా చెప్పను! నా బాధ నీకెలా తెలియజెప్పను? చెప్పి, నిన్నెలా నమ్మించను? అతను నా భర్త కాడు— నేను అతని భార్యనీ కాదని. . . . మీ అందరికీ ఎలా తెలియచెప్పను? ఏ ఆధారం చూపించి మిమ్మల్ని నమ్మించను?

ప్రేమారావు : మీరేమీ ఆధారాలూ సూపించక్కర్లేదు, నమ్మించనక్కర్లేదు. తస్సారవలా, ఏదిఐతే అది నమ్మేయడానికి మేమేమీ సుద్దోళ్ళం కాదమ్మా. ఆయన మీ భర్త. అన్ని ఆధారాలూ ఆయనే సూపించారు. మీరెందుకో దాకాయిస్తున్నారు. . . . ? మీ మనసులో ఏదో రగస్యముండి వుండాలి. సెప్పండి. ఆ రగస్యమేమిటో సెప్పండి. మీ మనసులో మనసు లాంటోణ్ని. నాతో సెప్పండమ్మా. . . . !

రాధ: నేను చెప్పేది నమ్ముతావా. . . . ?

ప్రేమారావు : నిజమే సెబుతారా ?

రాధ : నిజమే చెబుతాను.

ప్రేమారావు : అయితే సెప్పండి. మీరు నిజం చెప్పినా నమ్మకపోతే నేను శుద్ధ మోదవన్నమాట. . . . ! సెప్పండి. . . . ఏంటా నిజం?

రాధ : అతనెవరో నాకు తెలియదు. శుద్ధ మోసగాడు. అతను నా భర్త కాదు. నేనతని భార్యని కాదు. . . . . లలిత అతని బిడ్డ కాదు. . . . . !

ప్రేమారావు: అదిగో. . . . ! తస్సారవలా. . మళ్ళీ అదే పాటపాడుతున్నారు. ఇది నమ్మను. మీరెన్ని సెప్పినా నమ్మను. ఇదికాక, అందులో ఏదన్నా రగస్యముంటే సెప్పండి. నమ్ముతాను. . . .

రాధ : మాణిక్యం. . . . మాణిక్యం. . . . ! నువు నమ్మవు. నాకు తెలుసు. ఇంతకంటే నిజం నా దగ్గరలేదు. . . . . నువ్వు నమ్మకపోతే, అది నా దురదృష్టం!

ప్రేమారావు: అమ్మా. . . . ఎందుకమ్మా. . . మీ అదృష్టాన్ని నిందించుకుంటారు? ఎందుకమ్మా . . . . నా దగ్గర దాస్తారు? తస్సారవలా సీతారాం బాబుగారు యిచ్చిన టెలిగ్రాం సూసుకుని మీరెంత సంబరపడిపోయారు? ఆయన యింట్లో అడుగెట్టారు. మీకేమో అయిపోయింది. నీకూ నాకూ సంబంధమే లేదని కసిరికొట్టేశారు. ఆయనఎంతగా బాధపడిపోయేరో మీకేమి తెల్సమ్మా. . . ? మీకు ఫిట్సు వచ్చినట్టు తెలుసుకొన్నాక మీ ఆరోగ్గెం గురించి ఆయనగోరు మొక్కని దేవుడులేడు. ఎంతగానో ఆందోళన సెందారు. మీరు కాస్త కోలుకున్నారు, అటూయిటూ తిరుగుల్గుతున్నారు. ఆయన ఏనుగెక్కినంతగా సంతోస పడిపోతున్నారు. తస్సారవలా మా రాధమ్మ తల్లి మామూలు మనిసి అయ్యేరుకదాని నేనూ సంతోసించాను. ఆ బాబు మోసం సేస్తున్నారంటే నేనెలా నమ్మను. . . ? కల్లాకపటంలేని మనిసిని మోసగాడని ఎలా అనుకోను—? మీరే ఏదో దాస్తున్నారు. సెప్పలేకపోతున్నారు. . . . ? అవునా?

రాధ : మాణిక్యం. . . . ఇకచాలు. మీరంతా నన్ను నిజంగానే పిచ్చిదాన్ని చేసేస్తున్నారు. వద్దు, నన్ను పిచ్చిదాన్ని చెయ్యొద్దు. వెళ్ళిపో యిక్కడ్నుంచి. నన్ను ఒంటరిగా వుండనియ్. నేను నిన్ను నమ్మించలేను. ఎవర్నీ నమ్మించలేను. ఆ దుర్మార్గుడు మీమీద అంతగా మంత్రం వేశాడు. భగవంతుడున్నాడు. పాపపుణ్యాలు ఆ భగవంతుడికి తెలుసు. ఎప్పటికయినా నిజం బయటపడుతుంది. మీ కంటి పొరలు అప్పుడుగాని తొలిపోవు. ఈ నిజాన్నిలాగే వుండనియ్. అబద్ధంగానే వుండనియ్. దానికి అదిగా కాలంకు వచ్చినప్పుడు తెలుసుకుందురుగాని. . . . వెళ్ళు. . . . ఇక్కడ్నుంచి వెళ్ళి పో. . . . నన్ను వంటరిగా వుండనియ్. . . . లలితని కూడా తీసుకు పో. . . . .

[తల పట్టుకున్నది. ]

ప్రేమారావు : తస్సారవలా. . . . అది కాదమ్మా . . . . నేను సెప్పేదేటంటే. . . .

రాధ : నువ్వు నాకింకేమీ చెప్పకు. నన్ను ప్రశాంతంగా వుండనియ్. వెళ్ళి పో. . . . .

ప్రేమారావు : [పాప నెత్తుకు వెళ్ళిపోబోయాడు]

రాధ : మాణిక్యం. . . . !

ప్రేమారావు : అమ్మా. . . . !

రాధ : ఎవళ్ళ ప్రారబ్ధం వాళ్ళది. ఇక నాగురించి ఆలోచించకు. నన్నిలా వదిలెయ్.

ప్రేమారావు : కాదమ్మా. . . . నేనిటీని పెట్టను. తస్సారవలా. . . . ఈ యిసయం అంతా మాత్తేగాని యిడిసి పెట్టను. సినిమాల్లో యీసొంత మాట దేవుడెరుగు. . . . . మీ బతుకు బాగుపడితే అంతేసాలు. [ వెళ్ళిపోయాడు.]

రాధ : భగవాన్! ఏమిటీ పరీక్ష నాకు? పరిస్థితులు బళ్ళాల్లా గుచ్చుతూ వుంటే మౌనంగా సహించలేనా? దీనికి విముక్తి లేదా? [ఏడుస్తుంది]

—తెర—

(ఇంకా వుంది)

# Xపో! 70 లేదా జపాన్‌లో జానకి

జపాన్‌లో 'ఎక్స్‌పో – 70'ని మన అందరం వెళ్ళి చూడలేము. నటి 'షావుకారు' జానకి మనల్ని అక్కడే వున్నామా అనిపించేవిధంగా అక్కడి విషయ విశేషాలను మనకు వివరిస్తున్నారు.

ప్ర: 'ఎక్స్‌పో 70' లోకి వెళ్ళడానికి టిక్కెట్టు ఏమయినా పెట్టారా?

జ: 800 యన్‌లు, అంటే రూ. 17–00 అన్నమాట. విద్యార్థులకు రు. 13లు మాత్రమే.

ప్ర: ప్రవేశరుసుం యింత పెట్టడం ఉచితమేనంటారా?

జ: ప్రపంచాన్నంతా ఒకచోటికి తీసుకొచ్చారు. అయిదుఖండాలను స్ఫురింపచేసే 'చెర్రీబ్లాసమ్' పుష్పాన్ని ఎక్స్‌పో—70 చిహ్నంగా వుంచారు. ప్రపంచ ప్రజలు పరస్పరానురాగబద్ధులై వుండాలనే ఆశయం యీ 'ఎక్స్‌పో 70' నిర్మాణంద్వారా జపాన్ ప్రజలు వ్యక్తం చేసారు.

ప్ర: 'ఎక్స్‌పో 70' నిర్మాణం ఎలా వుంది?

జ: సుపర్బ్. భూతలస్వర్గమనిపించింది. విలాసవుల్లాసాల నిలయంగా, చిత్రవిచిత్రమయిన యాంత్రిక పరిణామ కూడలిగా విలసిల్లే 'ఎక్స్‌పో 70' యొక్క రూపు రేఖా విలాసాలను వర్ణించడానికి మాటలు చాలవు అంటే నమ్మండి.

ప్ర: 'ఎక్స్‌పో 70'వల్ల ప్రయోజనమేమిటి?

జ: సర్వదేశప్రజలు యిక్కడ కలిసి ఒకదేశంయొక్క నాగరికత, వారి ఆచార వ్యవహారాలను, మిగతా దేశాలవారు మంభంగా గ్రహించవచ్చు.

ప్ర: 'ఎక్స్‌పో 70' లోని ప్రత్యేకత ఏమిటి?

జ: లోపల అడుగుపెట్టానో లేదో, కనులు మిరుమిట్లుగొలిపే దృశ్యాలు, కళ్ళకు యింపుగొలిపే అందమయిన పెవిలియన్ల ఆకృతి, వూహాతీతమయిన సుందర మందిరాలు—అబ్బ ఏమని చెప్పగలను? ఎలా వర్ణించగలను? సూర్యభగవానుడి తేజస్సుతో పగలంతా ప్రకాశిస్తే, విద్యుద్దీపాలంకరణ వైభవంతో రేయంతా యింద్రలోకాన్ని మరిపించింది. ఒక పెవిలియను ఆకాశమంత ఎత్తువుంటే, మరొక భూగర్భంలోకి చొచ్చుకుపోయిందా అనిపించింది.

ప్ర: సోవియట్ పెవిలియను చూశారా?

జ: నాకు నచ్చిన పెవిలియన్లలో అదొకటి. ఆకాశాన్ని అంటి వున్నదా అన్నంత ఎత్తులో యీ పెవిలియను నిర్మించబడడం ఆశ్చర్యంగానే వుంది. అక్కడ లెనిన్‌కు సంబంధించిన ఛాయాచిత్రాలు, ఆయన వుపయోగించిన పరికరాలను వుంచారు. రష్యా దేశపు పాటలు, వారి గ్రామీణవాసులు చేసే నృత్యాలను అక్కడి కళాకారులు పాడుతూ, అభినయించారు.

ప్ర: అమెరికా పెవిలియనుపై మీ అభిప్రాయం?

జ: రష్యా ఆకాశమయితే, అమెరికా భూమిగా విలసిల్లింది. అమెరికా రాకెట్టులు, చంద్రమండలపు రాళ్ళు, మండిపోయే స్థితిలో వున్న 'అపోలో 8' ఓడ, 'అపోలో' మాడల్ రాకెట్టు యీ పెవిలియనులోని ప్రత్యేకత. ఈ పెవిలియను నిర్మాణానికి పదిలక్షల మిలియను డాలర్లు ఖర్చయిందట.

ప్ర: 'ఎక్స్‌పో 70'లో మిమ్మల్ని దిగ్భ్రాంతి చేసిన సంఘటన లేమయినా వున్నాయా?

జ: వుంది. ఒక పెవిలియనుముందు వ్రాయబడ్డ ప్రకటన ఒకదాన్ని చూచి విస్తుపోయాను.

'ఈ పెవిలియను ఒక డాలరుకు (రు. 7–50 లు) అమ్మబడును. కొనే వాళ్ళు ముందుకు రావచ్చు.'

యిదీ ప్రకటన. ఒకఅడుగు ముందుకు వేసిన నాకు ప్రకటన క్రింద వున్న నిబంధన నన్ను ముప్పతిప్పలు పెట్టింది. నవ్వాపుకోలేక పోయాను.

ప్ర: మిమ్మల్ని నవ్వించిన ఆ 'నిబంధన'ను మాకు చెప్పగలరా?

జ: ఓ. ఎస్. 'ఈ పెవిలియన్ను కొనేవాళ్ళు, 'ఎక్స్‌పో' ముగిసిన వెంటనే



ఆటోగ్రాఫులమీద సంతకం చేస్తున్న జానకి.

దాన్ని పగలగొట్టి తమవెంట తీసికెళ్ళాలి.' అంతపెద్ద కాంక్రీటు పెవిలియన్ను పగలగొట్టడమా! ఒకరోజులో జరిగే కార్యమా! అందుకే నవ్వొచ్చింది.

ప్ర: జపాన్‌లో 'ఎక్స్‌పో 70' ని ఎక్కడ నిర్మించారు?

జ: ఒసాకాలో. 'ఎక్స్‌పో 70' నిర్మాణంతో యీ స్థలానికి ప్రత్యేక శోభ వచ్చింది.

ప్ర: టోకియోలో ఎక్కడ బస చేసారు? ఆ దేశ ప్రజలపై మీ అభిప్రాయం ఏమిటి?

జ: న్యూ ఒటాని హోటలులో వున్నాను. ఆ హోటలు మేడమీద తిరుగు

మంది ఒకేసారి కూర్చోవచ్చు. ఒక అంతస్తుకు రివాల్వింగ్ సిస్టమ్ పెట్టారు. అక్కడ కూర్చుని ఒక్కచుట్టు తిరిగేలోపల నగరవైభవాన్ని కళ్ళారా చూడవచ్చు. ప్రజలు శుభ్రంగా, నీతిగా, నిజాయితీగా బ్రతుకుతున్నారు. ఎవడి పొట్టను వాడే కష్టపడి పనిచేసి నింపుకుంటాడు. మంచి, మర్యాద వారి తోబుట్టువులు. మోసం, దొంగతనం వాళ్ళకు చేతకాదు. బిచ్చగాళ్ళు మచ్చుకయిన కనిపించరు. ఎక్కువగా జపాను భాషనే మాట్లాడుతారు. ప్రపంచంలో జపాన్ విలాసదేశంగా విరాజిల్లుతూంది.

ప్ర: టోకియోలో ఏదయినా థియేటరును చూసారా?

జ: 'కొకసాయి' 'ఇంటర్నేషనల్ థియేటరు'ను చూచాను. ఒకే సమయంలో 300 సుందరాంగులు చేసిన నృత్యం అనితర సాధ్యమనిపించింది. వారి అభినయ కౌశలం అద్భుతం. ఆ దేశపు సంస్కృతిని, ఆచార వ్యవహారాలను, వారి నిర్మల మనస్సును ఆ నృత్యం చాటి చెప్పింది. రెప్పపాటు కాలంలో వాళ్ళ దృశ్యాలను ఎలా అందంగా స్పీడుగా మారుస్తారో చాల విచిత్రంగా ఉంది. సినిమా చూస్తున్న ఫీలింగ్ కలిగింది.

ప్ర: 'నైట్‌క్లబ్బు'కు వెళ్ళలేదా?

జ: వెళ్ళాను. ముప్పైమంది మగువలు అద్భుతంగా చేసిన నృత్యాన్ని కళాదృష్టితో చూచిన నాకు ఎబ్బెట్టుగానో తప్పుగానో తోచలేదు. వాళ్ళనుచూస్తుంటే పాలరాతి బొమ్మలా లేక పుత్తడి బొమ్మలా అనిపించింది.

ప్ర: అక్కడి స్త్రీలు ఎలాంటి వాళ్ళు అని చెప్పగలరా?

జ: మనలాగే అక్కడి ఆడవాళ్ళకు కూడా సెంటిమెంట్సు ఎక్కువ. చాల ఎమోషనల్‌గా ఉంటారు, సింప్లిసిటీని ఎక్కువగా లైక్ చేస్తారు. కష్టపడి పని చేస్తారు.

ప్ర: మిమ్మల్ని సినిమా నటిగా వాళ్ళు గుర్తుపట్టారా?

జ: నో. నో. వీధుల్లో నేను వెళ్తుంటే, నావంకే గుడ్లప్పగించి చూసేవారు. చీరెను మడత నలగకుండా కుచ్చీలు పెట్టి ఎక్కడా కుట్టువెయ్యకుండా కట్టిన పద్ధతిని చూచి మొత్తం ఆరు గజాలను ఎలా చీరెగా కట్టావా అని వాళ్ళకు ఆశ్చర్యం. కొంతమంది ఉండబట్టలేక ఎలా కట్టారు. ఇదంతా ఒకటే పీస్ అని నమ్మలేకుండా ఉన్నామని వాళ్ళ సందేహాన్ని తెలియబరిచారు. హిందూ స్త్రీలంటే వాళ్ళకు మంచి అభిప్రాయం, గౌరవం ఉంది. నన్ను భారతవనితగా గుర్తించి, షుమారు 2 వేలమంది ఆటోగ్రాఫ్‌లు తీసుకున్నారు.

ప్ర: 'ఎక్స్‌పో 70' పై మీ అభిప్రాయం తెల్పగలరా?

జ: భూతల స్వర్గాన్ని సృష్టించిన వారి మేధాసంపత్తికి నా జోహార్లు; స్వయంశక్తితో మానవుడు యేదయినా చెయ్యగలడు అని జపాన్ ప్రజలు నిరూపించారు. వారి కృషిని అభినందిస్తూ, మనం అంతటి ప్రగతిని త్వరలో అందుకోవాలని ఆకాంక్షిస్తున్నాను.

—శ్రీనివాస్



## రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరింపబడని తమ వ్రాతప్రతులని తిప్పి పంపకోరే రచయితలు వ్రాతప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పి పంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పి పంపబడవు.

ప్రచురణకి స్వీకరింపబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరింపబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంపనవసరం లేదు. 100 అరఠావు పేజీలపైన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

### కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్‌లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయములో ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

సంపాదకుడు
ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# హిందీ చిత్రసీమలో ధ్రువతార రేఖ



చదువు సంస్కారం ఆమె రూపానికి అలంకారాలు.

ఉత్తరాదిన హిందీ చిత్రసీమలో ధ్రువతారగా వెలుగొందుతున్న కుమారి రేఖ— ఇవాళ 20 చిత్రాల్లో నటిస్తున్నది. పదహారేళ్ళు పూర్తిగా నిండక ముందే ఇంత సంచలనం సృష్టించిన తార మరొకరు వుండరనటం అతిశయోక్తి కాదు.

* * *

రేఖ—ఒకనాటి ప్రసిద్ధనటి శ్రీమతి పుష్పవల్లి కుమార్తె. 1954 అక్టోబరు 10 వ తేదీన జన్మించింది. స్థానిక చర్చి పార్క్ కాన్వెంటులో విద్య నభ్యసించింది. అయిదో ఏటనే శ్రీమతి పుష్పవల్లి రేఖను నాట్యంలో ప్రవేశ పెట్టారు. రేఖకు చిన్నప్పట్నుంచీ ఒక సుగుణం ఉంది. ఏదైనా ఒకసారి చూసినా, విన్నా — వెంటనే దాన్ని గ్రహించివేయగల శక్తి అది.

* * *

శ్రీ బి. యన్. రెడ్డి రేఖను చూసి ముచ్చట పడ్డారు. సినిమాలో వేషం వేయిస్తానన్నది మొదట ఆయనే. వేయించింది కూడా ఆయనే! 'రంగులరాట్నం' చిత్రంలో చిన్న- వాణిశ్రీగా నటించింది రేఖ పన్నెండో ఏట...రేఖకి నాటకాల్లోను, సినిమాల్లోను నటించాలనే ఉత్సాహం గాని, సరదాగాని ఉండేవి కావు. తల్లి పుష్పవల్లి శ్రద్ధ తీసుకుని రేఖను సినిమాలలో చేర్పించారు.

ఇంటర్వ్యూ: మోహన్‌కుమార్

ఫోటోలు: ప్రభాకర్

## తెలుగునుంచి హిందీ చిత్రాలకి ...

ఆ తర్వాత 'అమ్మకోసం' చిత్రంలో నటించేందుకు ఒప్పందం జరిగింది. ఆ చిత్ర ముహూర్తానికి ఏ. వి. ఎం. స్టూడియోకి వెళ్లినప్పుడు — డైరెక్టర్ తిలక్ రేఖను చూశారు ఆయనకి ఎంతో నచ్చింది అమ్మాయి. అప్పుడాయన 'ఛోటీ బహూ' హిందీ చిత్రం నిర్మిస్తున్నారు 'నా తర్వాత హిందీ చిత్రంలో రేఖను హీరోయిన్‌గా తీసుకుంటాను' అన్నారు తిలక్—పుష్పవల్లితో.

అటు పిమ్మట తిలక్ తమ చిత్రం షూటింగ్ సందర్భంగ బొంబాయి వెళ్లినప్పుడు—'పరదేశి' హిందీచిత్రం షూటింగ్ విరామ సమయంలో ఆ చిత్రదర్శకుడు కుందన్ కుమార్‌తోను, అందులో హీరోగా నటిస్తున్న విశ్వజిత్‌తోను రేఖను గురించి చెప్పారు.

విశ్వజిత్ 'పైసాయా ప్యార్' చిత్రంలో నటించడానికి మద్రాసు ఏ. వి. యం. స్టూడియోకి వచ్చారు. ఆ స్టూడియోలోనే 'అమ్మకోసం'లో నటిస్తున్న రేఖను చూసి — కథానాయకి వేషాలకు ఆ టీనేజ్డ్ గర్ల్ ఎంతో బావుంటుందనుకున్నారు. వెంటనే బొంబాయికి ట్రంక్‌కాల్ చేసి తన స్నేహితులైన ఇద్దరు నిర్మాతల్ని రేఖను చూసేందుకు రమ్మని చెప్పారు కుల్‌జిత్‌పాల్, సత్యజిత్‌పాల్ అనబడే వారిద్దరూ అన్నదమ్ములు ఇద్దరూ చెరో చిత్రం నిర్మిస్తున్నారు. మద్రాసు వచ్చి వాళ్ళూ రేఖను చూశారు తమ చిత్రాలలో కథానాయికగా నటించేందుకు ఒప్పందం చేసుకున్నారు.

## హిందీ సెకండ్ లాంగ్వేజి

చదువుకునేటప్పుడు 'హిందీ'ని సెకండ్ లాంగ్వేజిగా తీసుకున్నది రేఖ. హిందీ చిత్రాలలో నటించేందుకు ఒప్పందం జరిగిన నాటి నుంచి—నాలుగు మాసాల్లో హిందీ ధారాళంగా మాట్లాడగలగటం అలవరచుకున్నది. కుల్‌జిత్‌పాల్ చిత్రం 'అంజానా సఫర్'లో మొట్టమొదట నటించినా—విడుదలైన మొదటి చిత్రం—మోహన్ సైగల్ దర్శకత్వం వహించిన 'సావన్‌భాదూన్.' ఈ చిత్రం ఈ మధ్యనే ఢిల్లీలో, ఉత్తర ప్రదేశ్‌లలో విడుదలయి—రేఖకు మంచి పేరు తెచ్చిపెట్టింది హిందీ చిత్రరంగంలో తారగా ఆమెను స్థిరపరచింది.

పైన పేర్కొన్న చిత్రాలు నిర్మాణంలో ఉండగానే—సాజా అవుర్ సనమ్, హసీనోం కా దేవతా, ఈగిల్ ఫిలిమ్స్ చిత్రం, శక్తి సామంతా నిర్మించబోతున్న రెండు చిత్రాలలోను-మరో పన్నెండు చిత్రాలలోను నటించేందుకు ఒప్పందాలు జరిగినవి రేఖ నటించిన ఏ ఒక్క చిత్రమూ విడుదల కుండానే — యిన్ని చిత్రాల కథానాయకి కాగలిగిందంటే ఆమెలోని ప్రతిభ ఎంతటిదో అవగతం అవుతుంది.

రేఖ ఇవాళ తీరికలేని తార!

## స్పోర్ట్స్‌గర్ల్ : సరదాలు

రేఖ మంచి స్పోర్ట్స్ గర్ల్. ఆట అనే సరికి ఎక్కడలేని ఉత్సాహమూ వస్తుంది. అన్ని ఆటల్లోనూ పాల్గొంటుంది. పియానో, వీణ—చక్కగా వాయిస్తుంది. గుర్రపు స్వారీ చేస్తుంది. మరొక చెప్పదగిన విశేషమేమంటే రేఖ మంచి చిత్రకారిణి. బొమ్మలు ఎంతో బాగా వేస్తుంది. ఆమె గీసిన చిత్రాలు, పెయింటింగ్స్ ఆమె గదిలో ఎన్నో అలంకరించబడి ఉన్నవి.

రేఖకు సినిమాలు చూడటం పెద్ద హాబీ. 'ఏ మాత్రం తీరిక దొరికినా మంచి పిక్చర్స్ చూస్తాను. రికార్డ్ ప్లేయర్ పెట్టుకుని పాటలు వింటాను.' అన్నదామె చదువూ, చక్కని సంస్కారమూ, అందచందాలూ, మంచి ఒడ్డూ పొడుగూ కలిగిన రేఖకు—బంగరు భవిష్యత్తును కల్పించింది అదృష్టరేఖ.



రేఖని పుట్టినరోజునాడు అభినందిస్తున్న రాజ్ కుమార్, తదితరులు.



'చిట్టిచెల్లెలు'లో గుమ్మడి, వాణిశ్రీ.

<ins>చిత్రసమీక్ష:</ins>

# చిట్టిచెల్లెలు

కొన్ని చిత్రాలను చూస్తున్నప్పుడు ఇది వందొమ్మిదివందల డెబ్బయ్యేనా—అని వాస్తవ మెరిగికూడా అనుమానంలో పడి పోతూవుంటాం. కాలంతో ప్రమేయం లేని జానపద చిత్రాలకయితే ఇలాంటి ఇబ్బంది వుండదు. మంచిమంచి జానపద కథలన్నీ సాంఘికాలుగా వచ్చేస్తూ వుండడంవల్ల జానపదాలకి బొత్తిగా కథలు దొరకడంలేదు.

అన్న చెల్లెలికి పెళ్లి చేస్తాడు. ఆ చెల్లెలికి భర్తమీద అంతులేని ప్రేమ. పెళ్లయిన కొద్దిరోజుల్లోనే అనవసరంగా పరాయివూళ్లో చిన్న వుద్యోగం చెయ్యడానికి వెళ్లిన భర్త కథకోసం హతుడవుతాడు. ఆ మరణవార్త చెల్లెలి చెవిన పడితే ఆమె చావు తప్పదు అనుకొన్న అన్న ఆవేదన అపరిమితమైంది. చివరికి భర్త మరణవార్త తెలియకుండానే ఆ చెల్లెలు బిడ్డనికని సుమంగళిగా చచ్చిపోతుంది.

ఈ కథలో అన్నపాత్రకి వింత ప్రాధాన్యత వున్నదో గుర్తించి తన చిట్టిచెల్లెలిని ప్రేక్షకుల చిట్టిచెల్లెలుగా భావింపజేసిన ఎన్. టి. రామారావు నటన అద్వితీయంగా వుండి చిత్రానికి జీవం పోసింది. ప్రేక్షకుల మనసుల్లో కొంత ఆడపడుచుగా మిగిలిపోయే వాణిశ్రీ నటన మరువరానిది. ఆమెనటన చిత్రానికి నిండుతనాన్ని సహజత్వాన్ని కూర్చింది. పాత్రలో ఔచిత్యం ఎలా వున్నా చిత్రాన్ని రక్తి కట్టించడానికి గుమ్మడి నటన చాలా సాయపడింది. పాత్ర మధ్యలోనే ముగిసి పోయినా హరనాథ్ నటన నిలుస్తుంది. హాస్యం నవ్వు పుట్టిస్తుంది కాని, తెలుగు జీవనానికి సంబంధించిందయితే ఇంకా రక్తి కట్టి వుండేది. ఇతర ముఖ్యపాత్రలలో రాజశ్రీ, రేలంగి, పద్మనాభం, గీతాంజలి, మాస్టర్ ఆదినారాయణ, బేబీ వెంకటేశ్వరి వున్నారు. పిల్లల నటన చిత్రానికి హైలైట్!

తెలుగు వాతావరణాన్ని బాగా అర్థం చేసుకుంటే దర్శకుడు యం. కృష్ణన్ మరింత సహజంగా చిత్రీకరించగలిగి వుండేవారు. మొత్తంమీద అతని మేధా సంపత్తిని మెచ్చుకుతీరాలి. ఎస్. రాజేశ్వరరావు సంగీతం బాగున్నది. డి. వి. నరసరాజు మాటలతో తెలుగుతనం చిత్రాన్ని ఆకర్షణీయంగా మలచింది. మంచి తెలుగు చిత్రాన్ని అందించిన తమిళసోదరులు మురుగన్, కుమరన్, శరవణన్‌లు ఎంతయినా అభినందనీ[illegible]లు.

## వాణిశ్రీ యింట్లో చిత్రం

నటి వాణిశ్రీ నేటి బిజీ హీరాయిన్. చిన్నచిన్న వేషాలు ధరించిన వాణిశ్రీకి ఏ పాత్రనిచ్చినా చక్కగా పోషించగలదనే అభిప్రాయం 'పంతాలు పట్టింపులు' చిత్రం ద్వారా యేర్పడింది. అయిదు సంవత్సరాల

సినిమా

క్రితం క్యారెక్టరు నటుడు గుమ్మడి అన్నమాటలు అక్షరాలా నిజమై నాయి. 'వాణిశ్రీ ప్రథమశ్రేణి కథానాయిక అవుతుంది' అని ఆనాడు గుమ్మడి చెప్పినది ఈనాడు కరెక్టు అనిపించింది. ఏ యాంగిల్ కయినా సరిపడే ముఖాన్ని, ఏ పాత్రకయినా సరిపడే పర్సనాలిటీ, ఎలాంటి డైలాగునయినా స్పష్టంగా చెప్ప గల ప్రతిభను భగవంతుడు వాణిశ్రీకి వరంగా యివ్వడమే నేటి ఆమె వున్నత



[illegible]'లో వాణిశ్రీ

**ప్రీతికి కారణం:**

ఆగస్టు 3న వాణిశ్రీ నుంగంబాక్కం లోని తన స్వంత యింట్లో సత్యనారాయణవ్రతం ఎంతో నిష్ఠలో జరుపుకుంది. వాణిశ్రీ మంగళస్నానమాచరించి నూతనవస్త్రాలను ధరించి సాయంకాలం అయిదున్నరనుండి ఏడున్నరవరకు సత్యనారాయణస్వామిని పూజించి, ఫలహారాలను అతిథులకుయిచ్చి వారి ఆశీర్వాదాన్ని అందుకుంది. ఆమె గళ్ల ఆరెంజి పట్టుచీర, అదే రంగు జాకెట్టు, శిరోజాల్లో మల్లెపూలు, చెవులకు బంగరు లోలాకులు ధరించి నిండుగా, కన్నులపండువుగా కనిపించింది. ఆనాడు ఆమె ముఖంలో యేదో నూతన తేజస్సు ద్యోతకమైంది. వ్రతం అయిన వెంటనే విందు భోజనం యేర్పాటు చెయ్యబడింది.

* * *



'అల్లుడే మేనల్లుడు'లో జ్యోతిలక్ష్మి.

ఎన్. టి. రామారావు హీరోగా లక్ష్మీ కళా చిత్రవారి సాంఘిక చిత్రం ఆగస్టు 15 నుంచి షూటింగ్ ప్రారంభింపబడుతుంది.

ఇటీవల జెమినిలో మూడు పాటలు రికార్డు చేయబడ్డాయి. యస్. హనుమంతరావు సంగీత దర్శకుడు. కొసరాజు వ్రాసిన రెండుపాటలు డా. సి. నారాయణ



'శాడీ రాణి'లో విజయలలిత, ప్రభాకరరెడ్డి.

రెడ్డి వ్రాసిన ఒకపాట. పీఠాపురం నాగేశ్వరరావు, ఎల్. ఆర్. ఈశ్వరి, ఘంటసాల మరో 20 మందితో పి సుశీల బృందగానం చేశారు. బి ఏ. సుబ్బారావు దర్శకత్వం నిర్వహిస్తున్న ఈ చిత్ర నిర్మాత శ్రీ కోట్ల వెంకట్రామయ్య. పూర్ణానారు విడుదల చేస్తారు.

## నూరు శాతం వర్తించిన నానుడి!

'పరుగెత్తి పాలు త్రాగడంకన్నా, నిలబడి నీళ్ళు త్రాగడమే హాయి' అని

## సినిమా

భావించవాడు హీరో శోభన్‌బాబు. అతగాడు నటించిన 'వీరాభిమన్యు', 'పుణ్యవతి' 'అడపడుచు' చిత్రాలు విజయవంతంగా ప్రదర్శింపబడమేగక, అతనికి మంచి పేరును తెచ్చిపెట్టాయి కానీ, పిక్చర్లు మరెవ్వరికో వెళ్ళాయి. 'కన్నె వయసు' అనేది నానుడి శోభన్‌కు నూరుశాతం వర్తించింది. 'వద్దు బాబోయ్, టైం లేదు' అనేది పరిస్థితిని కాలం శోభన్‌కు ఏర్పరిచింది. ఇప్పుడు శోభన్‌బాబు బిజీయస్టు హీరో.

## సినిమా డైరీ

● విజయ సురేష్ కంబైన్స్ నిర్మిస్తున్న చిత్రానికి "ద్రోహి" అని పేరు పెట్టారు ఈ చిత్రానికి బాపయ్య దర్శకుడు ఆగస్టు 1 నుండి 10 వరకు వాహినిలో షూటింగు జరిగింది.

● ఎన్టీఆర్ ఎస్టేట్స్‌వారి "కోడలు దిద్దినకాపురం" షూటింగు ఆగస్టు 4 తో వాహినిలో పూర్తయింది ఈ చిత్రానికి యోగానంద్ దర్శకుడు

● హీరో నాగేశ్వరరావు ఆగస్టు 1 నుండి 16 వరకు జమునతో ఉత్తమచిత్రకు ప్రత్యగాత్మ దర్శకత్వంలో నటించారు

● రాజ్యం పిక్చర్స్‌వారి "రంగేళి రాజా" షూటింగు ఆగస్టు 7 నుండి 20 వరకు సారథి స్టూడియోలో జరుగుతోంది ఈ చిత్రానికి సి ఎస్ రావ్ దర్శకుడు

● ప్రొడ్యూసర్స్ కంబైన్స్‌వారి "ఇద్దరమ్మాయిలు" షూటింగు హైదరాబాదులో ఆగస్టు 1 నుండి 6 వరకు ఎస్ ఆర్ పుట్టన్న దర్శకత్వంలో జరిగింది

● "శాడీ రాణి" చిత్రానికి లక్ష్మీ ఫిలింస్ పంపిణీదారులుగా ఒప్పందం చేసుకున్నారట

● దక్షిణ భారత సినీ టెక్నీషియన్సు ల్డ జూలై 29 న డి. జి ఫాల్కే శత వార్షిక జయంతిని మద్రాసులో ఘనంగా జరిపారు.

● యన్. టి ఆర్ పిక్చర్స్ చిత్రానికి 'మా తమ్ముడు' అని పేరుపెట్టారు

## మీకు తెలుసా?

షర్లీమెక్లీన్ అమెరికాలో వుంటూ చిత్రాల్లో నటిస్తూంది ఆమె భర్త జపాన్‌లో వుండి చిత్రాలు నిర్మిస్తున్నారు.

1969–70 లో ఫిల్ముఫేర్ అవార్డుల నందుకున్న నటి షర్మిలా టాగూర్ ప్రస్తుతం గర్భవతి. తన ప్రసవాన్ని ఢిల్లీ నర్సింగ్‌హోమ్‌లో జరుపుకోవాలని ఆశ పడుతున్నదట

## జపాన్‌కు జమున

నటి జమున ఆగస్టు రెండవవారంలో జపాన్ దేశానికి వెళ్తున్నారు. అక్కడ 'ఎక్స్‌పో 70 ని చూడడమేగక మరికొన్ని ప్రశస్తమయిన స్థలాలను కూడా చూడగలరని తెలుస్తూంది. ఆమె ఆగస్టు 1 నుండి 10 వరకు ఉత్తమ చిత్ర షూటింగులో పాల్గొని, ఆ తర్వాత ప్రయాణానికి ఆయత్తమవుతుంది. ఆమె వెంట శ్రీ రమణారావు కూడా వెళ్తున్నారు. మరి పాపాయిని కూడా తీసికెళ్తారా? అని అడిగాను 'లేదండి, పాపను మాకజిన్ సిస్టరు జాగ్రత్తగా చూసుకుంటుంది. మావాడు బల్లరి గడ్డుగాయికాదండి. చాలా హుషారుగా వుంటాడు నేను దగ్గరలేక పోయినా వర్రీలేదు ' అంది జమున.

## నటుడయిన దర్శకుడు

'కన్నతల్లి' 'పునర్జన్మ', 'విచిత్ర కుటుంబం' చిత్రాలకు దర్శకత్వం నెరపిన శ్రీ కె ఎస్. ప్రకాశరావు మంచి నటుడు అని మీకు తెలుసా? ఒకసారి 'ద్రోహి' చిత్రం గురుతుకి తెచ్చుకోండి ఒకవేళ ఆ చిత్రాన్ని చూడలేక పోయినా, వాహినీ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న చిత్రాన్ని చూడండి ఈ చిత్రంలో అంజలీదేవిగారికి భర్తగా, శోభన్‌బాబుకు తండ్రిగా కనిపిస్తారు. ఇరవై సంవత్సరాల తర్వాత ప్రకాశరావుగారిని నటింపచేసిన ఘనత దర్శకుడు సాంబశివరావుకు (ఆర్ట్సుశ్రీ ఫేం) చెందింది, ప్రకాశరావుగారి కుమార్తె

## ప్రొద్దుటి
## తాజాతనము
## గంటలు తరబడి
## రోజంతా

ఔను, స్నానం అయిన తరువాత ప్రొద్దుటి
పూటవుండే తాజాతనము రోజంతా
గంటల కొద్దీ వుంచుకోవచ్చు....పాండ్స్
డ్రీమ్ ఫ్లవర్ టాల్క్‌తో. భారతదేశంలో
విస్తారంగా అమ్ముడయే టాల్క్
పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్క్‌కు నాజూకైన
పరిమళము అల్లా వస్తూనే వుంటుంది....
పాండ్స్ డ్రీమ్ ఫ్లవర్ టాల్క్ తడిని
వెంటనే పీల్చుకుంటుంది,
అతిసన్నిహితంగా చేరాలనిపిస్తుంది....
చల్లగా, తాజాగా, పరిమళిస్తూ
వుంటుంది. ఉక్కతో ఒళ్లంత
అంటుకుంటూండే ఉష్ణ
ప్రదేశాల్లో కూడా. ఇది సంవత్సరం
పొడుగునా అన్నికాలాలలోను
ప్రయోగించగల టాల్క్!
3 సైజులలో లభిస్తుంది
ఫ్యామిలీ-లార్జి-మీడియమ్




### పాండ్స్
### డ్రీమ్ ఫ్లవర్ టాల్క్

అతి మృదువుగా ఉల్లాసకరమైన టాల్క్
చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు. యస్. ఎ. లో స్థాపితము.)



“మూగ[illegible]”లో చలం వాణిశ్రీ

## సినిమా

వారిణిగా అంజలీదేవి (గెస్టు) నటించారు. ‘పాండవ వనవాసం’ చిత్రాన్ని నిర్మించిన శ్రీ ఏ. ఎస్. ఆర్. ఆంజనేయులు నిర్మిస్తున్న యీ చిత్రంలో విస్సీరంగారావు, శోభన్‌బాబు, కాంచన, డాలీ ముఖ్యపాత్ర ధారులు.

## కొత్త నాయిక

మధు పిక్చర్స్‌వారి ‘ఇంటి గౌరవం’ చిత్రంలో అరుణ అనే అమ్మాయి శోభన్‌కు జంటగా నటించింది. ఒక హీరొయిన్‌కు కావలసిన అర్హతలు అన్నీ అరుణలో వున్నాయి. అందచందాలతో బాటు యాక్టింగ్ ట్యాలెంటు అరుణలో అగుపించినందువల్లనే దర్శకుడు బాపూ, కథకుడు ముళ్ళపూడి వెంకటరమణగార్లు అరుణను తాము చిత్రకల్పన బ్యానర్‌లో నిర్మించనున్న చిత్రాలలో నటించడానికి ఒప్పందం చేసుకున్నారు.



“ఒకే కుటుంబం!” లో రాజశ్రీ కాంతారావు

## శ్రీ వెంకటేశ్వర వైభవం!

ఇంతవరకూ తిరుమల దేవస్థానంలోకి మూవీ కెమెరా తీసుకుపోవడానికి అనుమతి ఎవరికీ ఇవ్వలేదు. అందుచేతనే శ్రీ వెంకటేశ్వరస్వామి కల్యాణోత్సవాలను, నిత్యం జరిగే అర్చనలు, పూజావిధానాలూ ఎవరూ చిత్రం తీయలేదు. కాని, దేవస్థానం వారు స్వయంగా భక్తులకోసం వేద మంత్రాలతో, శ్లోకాలతో తిరుమలలో అనునిత్యమూ ఏడుకొండలవాని సన్నిధిలో— ఆయన వైభవాలు ఎలా జరుగుతాయో అలా అన్నీ ‘శ్రీ వెంకటేశ్వర వైభవం’ అన్న పేరుతో రూపొందించిన చిత్రంలో చిత్రించారు.

ఇందులో — సుప్రభాతం; స్వామివారి కొలువు, కల్యాణోత్సవం, సహస్రకలశాభిషేకం, వసంతోత్సవం, ఉయ్యాలసేవ, రథోత్సవం, ఏకాంతసేవ (పవళింపు సేవ) 25 సంవత్సరములకు ఒకసారి వచ్చే ‘అష్టబంధన మహాసంప్రోక్షణ’ మొదలైన అంశాలున్నాయి. సుప్రభాతం శ్లోకాలకు భావ వివరణచేస్తూ చక్కని బొమ్మలతో చిత్రీకరించారు. ఇది రంగుల్లో చిత్రించడం మరొక విశేషం!

తిరుమలలో ఏడుకొండలస్వామి సన్నిధిలో జరిగే సేవలు చూపిస్తూ చలన చిత్రంగా రూపొందించడం యిదే మొదటిసారి. ఈ చిత్రం చూస్తున్నంత సేపూ తిరుమలలో వున్నట్లే వుంటుంది. భక్తులకు ‘శ్రీ వెంకటేశ్వర వైభవం.’ ఒక అపూర్వకానుక! ఈ చిత్రాన్ని తిరుమల—తిరుపతి దేవస్థానంవారు సమర్పిస్తున్నారు. యస్. రాజేశ్వరరావు సంగీతం సమకూర్చారు. సుశీల, శ్రీరంగం గోపాలరత్నం, యస్. పి. బాలసుబ్రహ్మణ్యం, పి. బి. శ్రీనివాస్ పాటలు పాడారు. ఈ చిత్రానికి నిర్వహణ: శ్రీ చంద్రశేఖరరెడ్డి (ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్) వ్యాఖ్యానం: శ్రీ కె. జగ్గయ్య త్వరలో ఆంధ్రప్రదేశ్ అంతటా విడుదల కాబోతున్నది.

## మద్రాసులో రాజేష్

బొంబాయిలో తీరికలేకుండా పని చేస్తున్న రాజేష్‌ఖన్నాపై మద్రాసు నిర్మాతల కన్ను పడింది. తమిళ నిర్మాత చిన్నప్ప దేవర్ తను నిర్మించనున్న 'తునైవన్' హిందీ చిత్రంలో రాజేష్‌ను హీరోగా బుక్ చేసారు. భక్తి ప్రధానమయిన యీపాత్రను నిర్వహిస్తున్నప్పుడు మాంసాహారాన్ని ముట్టుకోను అని రాజేష్ ప్రతిజ్ఞ చేశాడు.



'చినా తమ్ముడు'లో శోభన్‌బాబు, భారతి.

తెలుగు చిత్రాలకు సంగీత దర్శకుడిగా పనిచేస్తున్న ఏ. ఏ. రాజ్‌కు యెదురు చూడని లక్ తగిలింది. ఏ. ఏ. రాజా 'పంచకళ్యాణి దొంగలరాణి'కి సంగీతసారధి అని మీకు తెలుసునుకుంటా. ఇప్పుడు ఆయన ఒక హిందీ చిత్రానికి సంగీత దర్శకుడయ్యాడు. ఇటీవల జెమినీ స్టుడియోలో రెండు హిందీ పాటలను రికార్డు చేసారు. ఈ హిందీచిత్రానికి జంబులింగం దర్శకుడు.

—శ్రీనివాస్



## సినిమా ప్రముఖులు - రాజకీయాలు

సినిమా రంగంలో ప్రముఖులుగా వున్న వారిలో కొందరు వివిధ రంగాలలో కూడా ప్రాముఖ్యాన్ని సంపాయించుకుంటున్నారు. మన వాళ్లలో రాజకీయాలతో ప్రమేయం వున్న వాళ్లు ఎక్కువగా లేరు. నిర్మాతలలో శ్రీ చక్రపాణి, దర్శకులలో శ్రీ బి. ఎన్. రెడ్డి ఎం. ఎల్. సి.లు. నటులలో శ్రీ జగ్గయ్య ఎం. పి... 'మనకెందుకులే లేనిపోని గొడవలు' అని సరిపెట్టుకున్నారో ఏమోగాని—మిగిలిన వారెవరూ రాజకీయాలతో సంబంధం పెట్టుకోలేదు.

మన పొరుగువారైన తమిళ నటులకి రాజకీయాలతో సంబంధ బాంధవ్యాలు మెండుగా ఉన్నవి. శ్రీ ఎం. జి. ఆర్. డి. ఎం. కె. పార్టీ సభ్యుడు, ఎం. ఎల్. ఏ. ఇంకా అనేకమైన పార్టీ కార్యకలాపాల్లో తరచూ పాల్గొంటూ ఉంటారు. శ్రీ శివాజీ గణేశన్‌కి కాంగ్రెసు పార్టీతో సంబంధాలున్నవి. ప్రస్తుత మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ ఎం. కరుణానిధి సినిమాలకు సంబంధించిన వ్యక్తి. ఒకప్పుడు ఆయన నటుడు. స్వర్గీయ మాజీ ముఖ్యమంత్రి శ్రీ సి. ఎన్. అణ్ణాదురై మంత్రివర్గం ఏర్పడక ముందు—శ్రీ కరుణానిధి చాలా సినిమాలకు కథలూ, సంభాషణలూ రాశారు. అణ్ణాదురై కూడా సినిమాలకు రచన చేశారు.

మనవారి వలెనే—హిందీ, కన్నడ, మళయాళ చిత్ర సీమల్లో రాజకీయాలతో జోక్యం వున్న సినిమా ప్రముఖులు తక్కువ.

* * *

హాలీవుడ్ నటుడు విల్‌రోజర్స్ అమెరికా అధ్యక్ష పదవికి పోటీ చేశారు. అఫ్‌కోర్స్ ... గెలవలేదనుకోండి.

ప్రసిద్ధ నటుల జాబితాలో చేరిన ఒమార్ షెరీఫ్—అసలు పేరేమిటో తెలీదుగాని, మహమ్మదీయుడని చాలా మంది భ్రమ పడుతూ వుంటారు. కాని, ఆయన ఈజిప్టుకు చెందిన క్రిస్టియన్. బ్రిడ్జిగేమ్ (కార్డ్స్ ఆట)లో నిపుణుడు.

### హిందీ చిత్రాలకు తెలుగు దర్శకులు

శ్రీయుతులు ఎల్. వి. ప్రసాద్, తాతినేని ప్రకాశరావు, ఆదుర్తి సుబ్బారావు, కె. ప్రత్యగాత్మ, తాపీ చాణక్య, వి. మధుసూదనరావు, కె. బి. తిలక్—సాంఘిక చిత్రాల నిర్మాణంలో ఒక కొత్త ఒరవడిని ప్రవేశపెట్టి, ఎన్నో బాక్సాఫీసు చిత్రాలకు దర్శకత్వం వహించి—తెలుగు దేశంలో సంచలనం సృష్టించారు. అలాంటి ఈ ప్రతిభావంతులంతా ఈనాడు హిందీ చలన చిత్రరంగంలో కూడా దర్శకులుగా విశిష్టమైన స్థానం కలిగి వున్నారు. ఇవాళ వారందరికీ ఉత్తరాదిన ఎంతో 'డిమాండ్' ఉన్నది. నెమ్మదిగా ఒక్కొక్కరూ తెలుగు రంగానికి దూరమవుతున్నారు.

శ్రీయుతులు ఎల్. వి. ప్రసాద్, తాతినేని ప్రకాశరావు తెలుగు చిత్రాలకి దర్శకత్వం వహించడం మాను కొని చాలాకాలమయింది. మిగిలిన వారిలో ఇపుడు ఒక్కొక్కరు ఒక్కొక్క తెలుగు చిత్రానికి దర్శకత్వం చేపట్టారు. శ్రీ తిలక్ ఇపుడు ఏ తెలుగు చిత్రమూ తీయడంలేదు; ఇంత వరకూ ఆయన దర్శకత్వం వహించిన ఏ హిందీ చిత్రమూ విడుదల కాలేదు. ఏక కాలంలో రెండు హిందీ చిత్రాలకు దర్శకత్వం వహిస్తున్నారు. "సంచలన చిత్రాలను సృష్టించి గొప్పదనం సంతరించుకున్న యిలాంటి మేధావులంతా హిందీరంగంలో స్థిరపడుతుంటే—ఇక మనకు మంచి చిత్రాలు ఎలా వస్తాయి?...

—మోహన్‌కుమార్.

## మూడు నవలలు!

1. భారతి: శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు. 324 పేజీలు. రు. 6. ప్రతులకు: నవభారత్ బుక్ హవుస్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

2. ఏది సత్యం? ఏదసత్యం?— శ్రీమతి సి. ఆనందారామం. 176 పేజీలు. రు 2.50.

3. సమత: [ఎమెస్కో పాకెట్ నవల]: శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి. 272 పేజీలు. రు. 2. చివరి రెండు పుస్తకాలకు: ఎం. శేషాచలం అండ్ కో మదరాసు సికింద్రాబాదు మచిలీపట్నం.

'హాస్పిటల్ హవుస్ సర్జన్' నవల పాఠకుల్ని ఎంతగానో ఆకర్షించింది. శ్రీ వేణుగోపాలరావు కలం నుండి వెలువడిన మరొక వ్యాధి నవల ఈ 'భారతి'—ఒక నర్సు గాథ. మరొకలా చెప్పుకోవాలంటే ఒక రోగి ఉదంతం. ఇంకొకలా చెప్పాలంటే కుష్ఠువ్యాధిని గురించి కొన్ని సత్యాలను వెల్లడించే కథనం.

నాయిక భారతి ఒక చక్కని చుక్క. ఆ చుక్కకి ఒక మచ్చ. అదే ఈ నవల కథకంతటికీ మూలం. నాయకుల ఒకరికి మించి ఒకరుండటంవల్ల భారతి పాత్రకు సానుభూతి అంతగా లభించదు. ఆమెను పెళ్లి చేసుకున్న భర్త పిరికివాడు. అతన్ని అనుమానించి అవమానించి డాక్టర్ సాగర్ ప్రేమిస్తుంది. భారతి ఈ నిర్ణయానికి రావటం సహజంగా లేదు. స్నేహితురాలు మల్లికకు పెళ్లి కావాలి. తన జీవితం ఏలాగో ఒకలాగా వెళ్లదొయ్యాలి— కనుక ఈ నిర్ణయానికి వచ్చినట్లు అనిపిస్తుంది.

మల్లిక పాత్రకు ప్రాధాన్యం లేదు. నాగరాజు పాత్ర అనవసరం.

లోకం అంటగించుకుని అసహ్యించుకునే ఈ రోగాన్ని గురించి లోకానికి తెలియవలసిన విశేషాలు బోధించడం, వివేకం విచక్షణా జ్ఞానం సానుభూతి కలిగించడం రచయిత ఆశయాలని అనుకోవచ్చు.

* * *

ఊరు ఊరంతా గుప్పుమంది — మౌళి భార్య కల్యాణిని వసంతరావు వశం చేసుకున్నాడంటూ. మౌళి తన ఉద్యోగంకోసమని వంకపెట్టి ఊరు విడిచి వెళ్లాడనీ, సరిగ్గా అదే సమయానికి వసంతరావును ఆహ్వానించాడనీ కూడా వార్తలు ప్రచారంలోకి వచ్చాయి.

ఇందులో ఏది సత్యం? ఏదసత్యం?— ఆ అలజడిలో మూగ మనస్సులు ఛేదించాయి, మమతలు ఛేదించాయి.

విరిగిన మనసులు అతకవు కదా?—

చిట్టచివర—ఒక ప్రశ్న అలానే నిలిచి వుంది—కథానాయిక కల్యాణి బతుకుతుందా, లేదా? అని. అయితే— ఈ ప్రశ్నకు కూడా సమాధానం 'నా మనవి'లో సూచించారు రచయిత్రి.

నిజానికి అదో ప్రశ్న కాదు.

వసంతరావులో పరివర్తన వచ్చేటంతవరకూ, మౌళి పశ్చాత్తాపపడేటంతవరకూ కల్యాణి బతికితే చాలు. ఆ తరువాత మరి అవసరం లేదు.

ఈ పుస్తకంలో 'నా మనవి' మొదటనే వెయ్యడంతో సస్పెన్సు లేకుండా పోయింది. అది చివరికి వస్తే బాగుండేది.

ఇంత చక్కటి నవలను మనకందించిన రచయిత్రికి అభినందనలు.

* * *

అరుంధతి లేచిపోయింది. తాళి కట్టిన భర్త సీతాపతిని వదిలేసి లేచిపోయింది. కన్నబిడ్డ మాధవిని సయితం కాదని వెళ్లిపోయింది. రాజకీయవేత్త రాజారావుకోసం మోజుపడి, అన్నీ వదిలేసి పోయింది.

ఇందుకు కొంతవరకు కారకుడు సీతాపతి అనే చెప్పాలి.

సీతాపతికి రాజారావు ప్రాణమిత్రుడే. అయితేనేం?— అతని మూలాన సీతాపతి బతుకు నవ్వులపాలయింది. అరుంధతి అపవాదు కొనితెచ్చుకుంది.

అంతటితో ఆగిందా?— తల్లిచేసిన పాపం పిల్లని కట్టి కుడిపింది. అరుంధతి కూతురు మాధవి పెళ్లి కాకుండానే బిడ్డతల్లి అయింది!

సినిమాలోలాగా కళ్లముందు జరిగిన, జరుగుతున్న ఘోరాలన్నీ స్పష్టంగా చూసింది అరుంధతి. గుండె రాయి చేసుకుంది. మాధవి కన్న కూతుర్ని— అంటే తన మనవరాలినయినా చేరదీసుకుందామని వెళ్లబోతే, ఆ పసికూనను చూడకుండానే కన్నుమూసింది అరుంధతి.

సిఫారసు లేడీగా అరుంధతి అతి చక్కగా చిత్రించబడింది. నిజానికి రాజారావునుమించిదూసుకపోవలసిన అరుంధతికి అసలయిన స్వేచ్ఛ దొరకనే లేదేమో!—

రాజకీయ సాంఘిక వాతావరణాలతో మిళితమైన ఈ నవలలో సమతాభావం స్ఫురించదు, కాని లోకం పోకడ మాత్రం కళ్లకికట్టినట్లు కనిపిస్తుంది. అయినా ఈ నవల పేరు 'సమత'.

## నిశ్శబ్ద సంగీతం:

[ఎమెస్కో పాకెట్ నవల]. శ్రీమతి సి. ఆనందరామం. 156 పేజీలు. వెల: రూ 2. ప్రచురణ: ఎం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మదరాసు, సికింద్రాబాదు.

సంగీతం నిశ్శబ్దంగా ఉండదు. మరి అంత వినీ వినబడకుండా వుంటే రహస్యమవుతుంది గాని అది సంగీతం కాదు.

ఈ నవలలో నాయికా నాయకులు నిశ్శబ్ద సంగీతం ఆలాపించటానికి అవసరం కనబడదు. ఏమంటే, వాళ్లు నోరూ వాయీ లేనివాళ్లు కాదు, అభమూ, శుభమూ తెలియని అమాయకులూ కాదు.

అయితే— ఆ రెండు హృదయాలకూ మరి రెండు హృదయాలను తోడు చేస్తూ, ఒక చిత్ర సమస్యను పాఠకుల ముందుంచి, ఊహాతీతమయిన పరిష్కారాన్ని చూపుతున్నారు రచయిత్రి.

మాధవ సరళను ప్రేమించాడు, జానకిని పెళ్లాడాడు. సరళ అతనిమీదే ప్రాణాలు పెట్టుకుంది. కాని, జానకి మాధవను పెళ్లాడటం తప్పనిసరి అయింది. ఈ మూడు మనసులతో అనుబంధం అనురాగం పెంచుకున్న మాతృమూర్తి కాత్యాయని ఈ సమస్యను ఛేదించనే లేకపోయింది.

సాటిలేని వ్యక్తి జానకి. ఆమె మాట ఒక్కొక్కటే సరిగా తూచినట్టు. ఈ పాత్రను చిత్రించిన రచయిత్రి ప్రజ్ఞ, అనమాన ప్రతిభ ఎంత చెప్పినా కొద్దిపాటే.

కుసుమ కథ చిన్నదయితేనేం, ఎంతో ఆహ్లాదకరంగావుంది. ఆమె గడుసుదనం మరొకళ్లకురాదు.

బరితెగించిన లోకానికి బుద్ధి చెప్పాలంటే కుసుమలాంటి గడుసు పిల్లలూ, జానకిలాంటి— కాత్యాయనీ వంటి చల్లని తల్లులూ ఉండే తీరాలి.

—శివకుమారి ●

## మంత్రివర్గంలో...

(47 వ పేజీ తరువాయి)

నా భర్తకి ఎంతో ఇష్టం—చివరికి పిల్లలకి కూడా నా రాజకీయ జీవితం మీద ఆసక్తి కలిగింది!

'నేను రాజకీయాలలో మళ్లీ కాలు పెట్టేసరికి వారికి సుమారు ఆరేళ్లు. ఇప్పుడు వాళ్లకి పార్లమెంటు భవనం బాగా పరిచయం అయిపోయింది! నేను అక్కడ లేకపోతే వారికి తోచదు...

'వాళ్లకి ఒక మంచి 'నానీ' (దాది)ని ఏర్పాటు చేశాను. అదీ లేకపోతే వాళ్లని అసలే వదిలి వెళ్లలేక పోయే దానిని...'

**సంగీతం**

శ్రీమతి థాచ్చర్ కుటుంబ జీవితం పరిధి క్రమంగా తగ్గిపోతూ ఉండటంలో ఆశ్చర్యం లేదు. ప్రస్తుతం సంగీతం ఒకటే ఆమె పాల్గొనగలిగే వినోదం. వీలయినప్పుడెల్లా థాచ్చర్ దంపతులు సంగీత నాటకాలకి వెళుతూ ఉంటారు.

నిజంగా తీరిక సమయాలలో ఆమెవంటి రాజకీయ నాయకులు ఏమి చేస్తారు? ఆమెకి ఏమి ఇష్టం?

'ఇల్లు చక్కబెట్టుకొనటం, వంట చెయ్యటం, కుట్టుపని, గదిని అలంకరించటం—మన కృషి ఫలితాన్ని 'వీటిలో చూడటమే పెద్ద ఆనందం! మెదడుకి తగిలే పనిని మాని చేతులతో పని చెయ్యటం నాకు ఇష్టం! ఎంతో సంతోషంగా ఉంటుంది అప్పుడు......'

(ఫీ. వ. ఫీ.) ●

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# సవ్యమైన పెంపకానికి రక్ష బోర్న్‌విటా శక్తే!

ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాల అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు.

రుచికరమైన శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారుచేసేవారు—క్యాడ్‌బరిస్




**శక్తి, ఉత్సాహం — మరియు రుచికోసం క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

బిడ్డల భవిష్యత్‌కి తల్లా! తండ్రా!!
ప్రతి తల్లీ, తండ్రీ, బిడ్డలు, కుటుంబ సమేతంగా
చూడతగ్గ సందేశాత్మక చిత్రం - చూడండి!


రామ విజేతా ఫిలింస్

# తల్లితండ్రులు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: కె. బాబూరావు  నిర్మాత: కె. ఏ. ప్రభాకర్

మాటలు: పినిశెట్టి  సంగీతం: ఘంటసాల

పోలాప్రగడ వారి 'కౌసల్య'
నవల ఆధారం.

విడుదల:
ఆంధ్ర: జోతీ, సీడెడ్: నవభారత్
నైజాం: ఉషా, మైసూర్: విజయా